# భారత వస్త్రసమస్య



బహూత్తమ పబ్లికేషన్సు

పుల్లంపేట

# భారత వస్త్ర సమస్య

## (చేనేత పరిశ్రమ)

గ్రంథకర్తలు:

శ్రీ తాడిపత్రి శ్రీకంఠయ్య, బి. ఏ., ఎల్. ఎల్. బి.

ప్రథమ అఖిలభారత చేనేతపారిశ్రామిక సంఘమాజీ అధ్యక్షుడు.

ప్రధాన న్యాయమూర్తి, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు ఎన్నికల న్యాయస్థానము.

★

శ్రీ కార్యంపూడి నాగేంద్రుడు, బి. ఏ., బి. ఇడి.

ప్రథమ అఖిలభారత చేనేతపారిశ్రామిక సంఘమాజీ కార్యదర్శి.

"నేతపరిశ్రమ" సంపాదకుడు.



బహూత్తమ పబ్లికేషన్సు

పుల్లంపేట

ప్రథమ ముద్రణ : 800 డిశెంబరు 1946.

ఈనాడు
గ్రామసీమల్లో
చాలీచాలని జీవనభృతితో
డొక్కలు ఎండుచుకొంటూ
చెమటోడ్చి చాకిరిచేసి
భావిభారత భాగ్యోదయ కాంక్షలో
సోదర మానవుల అభిమానాన్ని కప్పిపుచ్చే
ఖద్దరు వస్త్రముల నుత్పత్తిచేయు
పారిశ్రామిక సోదరులకు
అంకితము



బహూత్తమ పబ్లికేషన్సు
పుల్లంపేట (కడప జిల్లా)

 రు. 2/-

# విన్నపము

ప్రాచీనకాలంనుంచీ భారత నాగరకతతోపాటు భారత చేనేతపరిశ్రమ ప్రసిద్ధినందినది. పందొమ్మిదవ శతాబ్దారంభము వరకు మన వస్త్రపరిశ్రమ కేవలం ఖద్దరు పరిశ్రమగానే ఉండేది. 1813 వ సంవత్సరము వరకు వడికి నేసి మనదేశం తన సంపూర్ణావసరాన్ని తీర్చుకొనుటయే గాక ఇతరదేశాలకు కూడ వస్త్రాలను ఎగుమతి చేసింది. స్వదేశి విదేశి మిల్లులు బయలుదేరిన తర్వాత పాశ్చాత్య నాగరికతతోపాటు ప్రజలకు మిల్లుగుడ్డపై వ్యామోహం హెచ్చింది. తూర్పుఇండియా సంఘమురంతాలతో ప్రారంభమైన చేనేతపారిశ్రామిక పతనం మిల్లుల పెంపకంతో తీవ్రరూపందాల్చింది. కాని యిప్పటికీ మనభారత గృహపరిశ్రమలల్లో ప్రధానమైనది చేనేతపరిశ్రమయే.

ఈ చేనేతపరిశ్రమ రెండుకోట్ల మందికి జీవనాధారమై ఉంది. భారత స్వాతంత్ర్యోద్యమమునకు ఖద్దరు తారకమంత్రమని గాంధీమహాత్ముడు 1921 నుండి ప్రబోధించుచున్నాడు. అందునిమిత్తమే అఖిలభారత చరఖాసంఘము (A. I. S. A.) స్థాపింపబడినది. గ్రామపరిశ్రమల సంఘము కూడ తదభివృద్ధికై పనిజేయుచున్నది, భారతావనిపై మహాత్ముడు చరఖాను పునరుద్ధరించి పాతికసంవత్సరములైనది. మహాత్ముని దృక్పధమున చరఖా కామధేనువు. భారతీయులపాలిటి కల్పవృక్షము. భారతజాతీయ ఆర్థికాభి

వృద్ధికి జీవకర్ర. భారత స్వాతంత్ర్యయోధులకు సమరాంగణమున ప్రబలాయుధము. సత్యాగ్రహులకు ఖద్దరు బాహ్య చిహ్నము. వేయేల! దీనజనోద్ధరణకు నారాయణావతారము. ఈ కాలమున చరఖాను త్రిప్పుటయే కర్మయోగమని మహాత్ముని గీతావ్యాఖ్యానము. భారతదేశ సౌభాగ్యమునకు, గ్రామవస్త్ర స్వయంసమృద్ధక సిద్ధాంతమునకు ఖద్దరేశరణ్యమని మహాత్ముడు ఉద్ఘాటించుచున్నాడు.

అందువల్ల వస్త్రపరిశ్రమను గృహపరిశ్రమగానే ఉంచి ఖద్దరు వ్యాప్తిగావింపవలయునని సిద్ధాంతము. కాంగ్రెసు కూడ ఇప్పటివరకు అదే సిద్ధాంతముతో పని జేయుచున్నది. క్రిందటి కాంగ్రెసు మంత్రివర్గము ఖద్దరు పరిశ్రమాభివృద్ధికి ద్రవ్యసహాయము కావించినది. ప్రస్తుతం శ్రీ ప్రకాశంగారి ఖాదీ ప్రణాళిక మహాత్ముని సిద్ధాంత ఫలితమే. ఖాదీప్రణాళిక గ్రామాలకు వస్త్రసమస్యను పరిష్కారము చేయుటయేగాక, సంవత్సరంలో ఆరు మాసాలు పనిలేని గ్రామీణులకు ఉపవృత్తిని కల్పించి, ఆర్థికాభివృద్ధికి దోహతమొసంగి తద్వారా గ్రామ పునరుద్ధరణ, దేశ కళ్యాణములకు పునాదివేయుచున్నది.

ఇటీవల మన దేశంలోనేగాక ప్రపంచమంతటా, కుటీర పరిశ్రమలతత్త్వాన్ని, ఆర్థికశక్తిని ఆర్థికశాస్త్రజ్ఞులు పరిశీలిస్తున్నారు. "గాంధీజీ ఖద్దరు అభివృద్ధినిగూర్చి చేస్తున్న నిరంతరప్రచారము కేవలం వట్టి భావోద్రేకంకాదనీ, గ్రామీణులను పేదరికమునుండి రక్షించి వారి జీవితప్రమాణముల హెచ్చించేటందుకు కావించే ఆచరణయోగ్యమైన కార్య

కలాపము'' అని ప్రొఫెసర్ జి. డి. హెచ్. కోల్‌వంటి సుప్రసిద్ధ బ్రిటిషు ఆర్థికతత్త్వవేత్త కూడా అంగీకరించెను. నేటి కేంద్రప్రభుత్వాధ్యక్షుడైన జవహర్‌లాల్ నెహ్రూ పండితుడు ఈ అభిప్రాయముతో నేకీభవించుచు ఇందంత ఖ్యాతమైయున్న వికేంద్రీకరణ సిద్ధాంతమును (Decentralisation) హెన్రీఫోర్డు (Henry Ford) వంటి అమెరికా పారిశ్రామికవేత్త కూడ బలపరచుచున్నాడని తన ("The Discovery of India") అను గ్రంథములో స్పష్టపరచెను.

కాంగ్రెసు వారిలో మహాత్ముని ఖద్దరు సిద్ధాంతమును అర్థముచేసుకొని హృదయపూర్వకముగ ఆచరించదలచు కొన్నవారెవరో, అందుకు వ్యతిరేకులెవరో శ్రీ ప్రకాశం గారి ఖాదీ విధానంవల్ల బయటపడినారు. దేశంలోని కొందరు నాయకులు, మిల్లు యజమానులు, పత్రికలవారు ఈ సిద్ధాంతమును వ్యతిరేకించిరి.

నేడు మన వస్త్రసమస్య అఖిలభారత సమస్యగా మారిపోయినది. కనుక ఖద్దరు విధానాన్ని భారతప్రభుత్వం ఆచరణలో పెట్టుట మంచిది కాని రాష్ట్రీయప్రభుత్వాలు ప్రవేశపెట్టుట మంచిదికాదని కొందరి అభిప్రాయము. కాని కాంగ్రెసు సిద్ధాంతములను అమలుపరచుటలో మొదటినుండి మనరాష్ట్రమే ముందంజవేస్తున్నది కదా! మద్యనిషేధం లోను, హరిజనసమస్యా పరిష్కారంలోను అగ్రతాంబూలం మందే! ఖద్దరు ప్రణాళికను కూడ శ్రీ ప్రకాశంగారు మన రాష్ట్రంలో ప్రవేశపెట్టి మదరాసుయొక్క విశిష్టతను నిల

బెట్టిరి. బొంబాయిరాష్ట్రం కూడా యీ విధానాన్ని అనుస రించే సూచనవచ్చింది. ఈ విధానాన్ని యితర రాష్ట్రా లున్నూ ఆచరిస్తే, అప్పుడది అఖిలభారత వస్త్రసమస్యను తప్పక పరిష్కారము చేస్తుంది.

ఈ ఖద్దరు విధానము భారతదేశ కళ్యాణమునకు, గ్రామ ఆర్థికసాంఘిక స్వయంసమృద్ధక సిద్ధాంతమునకు ఎంత వరకు ఉపయోగపడుచున్నదో స్పష్టము చేయుటకే మే మీ రచనకు బూనితిమి. దేశాభిమానులు నిష్పాక్షిక దృష్టితో భారతపరిశ్రమ చరిత్రను సింహావలోకనం చేసినచో మా అభి ప్రాయములతో తప్పక ఏకీభవింప గలరని మా విశ్వాసము.

ఇట్లు,

మంగళగిరి,<br>
1-12-46.

తాడిపర్తి శ్రీ కంఠము<br>
కార్యంపూడి నాగేంద్రుడు.

## విషయసూచిక



నవ్యభారత భాగ్యవిధాత

మహాత్మ గాంధి

[ *By kind Permission from*
*Jateeya Jnana Mandir, Madras* ]



"పద్మశాలి పితామహ"
కీ। శే। శ్రీమాన్ కార్యంపూడి
వెంకట కృష్ణశతావధానిగారు.



శ్రీమాన్ కార్యంపూడి:
రమాకాంత కవిగారు.



చెన్నరాష్ట్ర ప్రధానామాత్యులు

ఆంధ్ర కేసరి

శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారు

[*By kind Permission from Navodaya Madras*]



గ్రంథకర్తలు :

శ్రీ తాడిపత్రి శ్రీకంఠంగారు, బి. ఎ., ఎల్. యల్. బి.,

శ్రీ కార్యంపూడి నాగేంద్రుడుగారు, బి. ఎ., బి. ఇడి.



కీ॥ శే॥ శ్రీ తాడిపత్రి శ్రీరాములుగారు

'పద్మశాలి' 'సంస్కారి' సంపాదకులు

'సరికొత్తచాపు' కర్తలు

# భారత వస్త్ర సమస్య



''మనుజుల కెల్ల పేశ నభిమానధనంబు లొసంగి గౌరవిం
చిన మన వస్త్రకారకుల జీవకళల్ పునరుద్ధరింపగా
ననువగు కాలమిద్ది, బుధులార! నశించిన వృత్తివిద్యలన్
మనిచి దిగంతర స్థలుల మాతృకళల్ వెలయింపబూనుడీ.''

ప్రాచీనకాలంలో మన భారతదేశం ప్రపంచ మంతటికీ ఆదర్శప్రాయంగా ఉండేది. మన దేశాన్నుంచీ, మన విజ్ఞానాన్నుంచీ, మన పరిశ్రమలనుంచీ, మననాగరకత నుంచీ, పరదేశస్థులు ఎన్నోవిషయాలు నేర్చుకున్నారు. మన నాగరికత, మన విజ్ఞానం, మనవస్త్రపరిశ్రమ, మన సాంప్రదాయాలు, మనఆచారాలు విదేశస్థులచే వేనోళ్ళ ప్రశంసించబడినవి. కాని కాలచక్రం తిరిగి పోయింది. నేడు మన దేశం విదేశ పరిపాలకులక్రిందికి పోయింది. మన దేశస్థితి పూర్తిగా మారిపోయింది. నేడు మన దేశం ఇతర దేశాలకంటె అన్ని విధాల వెనుకబడింది. సాంఘిక, రాజకీయ, ఆర్థిక, పారిశ్రామిక, వైజ్ఞానిక, ఆరోగ్యాది పెక్కువిషయాలల్లో మనం వెనుకబడి పోయాం. మన దేశానికి సర్వతోముఖ వికాసం కావాలంటే స్వాతంత్ర్యం అవసరమని జాతీయవాదులు వక్కాణించుచున్నారు. మన దేశం సంపూర్ణ స్వాతంత్ర్యసిద్ధికై గాంధిమహాత్ముని నాయకత్వమున తీవ్రమగు శాంతియుద్ధాన్ని సాగించుచున్నది. స్వరాజ్యప్రాప్తికి రాట్నచక్రమే విష్ణుచ

శ్రమని, ఖద్దరే తారకమంత్రమని గాంధిమహాత్ముఁడు శంఖారావము చేయుచున్నాడు. భారతదేశసౌభాగ్యమునకు గృహపరిశ్రమలే శరణ్యమని గాంధీ ప్రణాళిక సూచించుచున్నది.

గృహపరిశ్రమల్లో ప్రధానమైనది చేనేత పరిశ్రమ. వ్యవసాయం తరువాత ఎక్కువమంది ప్రజలకు జీవనోపాధి కల్పించుచున్నది. నేటికిని మనచేనేతపరిశ్రమ ఒక కోటిమంది చేనేతపారిశ్రామికులకు జీవనోపాధి కల్పించుచున్నది. చేనేతపరిశ్రమకు సంబంధించిన ఉపవృత్తులు మరియొక కోటిమందికి జీవనోపాధిని కలిగించుచున్నవి.

## ప్రాచీన వైభవము

ఒక దేశంగాని, ఒకసంఘంగాని, ఒక వ్యక్తిగాని తనభవిష్య దభివృద్ధిని కోరినచో తన ప్రాచీన చరిత్రను సంపూర్ణంగా అర్థము చేసుకొనవలెను. తన ప్రాచీన చరిత్రనుబట్టి తనభావిజీవిత నౌకను సురక్షితముగా గమ్యస్థానాన్ని చేర్చుకొనకలుగును.

భారతదేశం వస్త్ర పరిశ్రమకు పుట్టినిల్లు. ప్రపంచములోని యితర ప్రజలందరు వస్త్రములంటే ఏమిటో తెలియనినాడు, చెట్లఆకులు, పట్టలచేతనే తమ నగ్నతను కప్పిపుచ్చుకున్నకాలంనాటికే మనభారతదేశం వస్త్రపరిశ్రమలో అగ్రస్థానం వహించింది. మన భారతదేశ వస్త్రపరిశ్రమ మనవేదములకంటె అతి ప్రాచీనమైనది. ఋగ్వేదకాలం నాటికే (అనగా యిప్పటికి 14000 సంవత్సరముల నాటికి పూర్వమే) భారతీయవస్త్ర నిర్మాతయొక్క శిల్పకళావైభ

వము ప్రసిద్ధికెక్కినది. వస్త్రనిర్మాణశిల్ప పారిభాషిక శ
ముల నెరవుదెచ్చుకొని వేదములు తమభాషకు అలంకా
ములు కావించుకొన్నవి. మానవ జీవితంలోని కష్టసుఖాల
వస్త్రంలోని పడుగుపేకలవలె సున్నవని పోల్చబడినవి
స్త్రీలుకూడా నేత పరిశ్రమలో ప్రత్యేక నైపుణ్యం కలి
యున్నట్లు అధర్వణవేదం చెప్పుచున్నది. వరుడు వివాహమైన
మొదటిదినమున, వధువుచే తయారుచేయబడిన వస్త్రము
ధరించు ఆచారముండినట్లు అధర్వణవేదము చెప్పుచున్నది
దీనినిబట్టి వేదకాలంలో వడుకుట, నేయుట అనునవి ప్రజ
సామాన్యమునకు చాల పరిచయము కలిగినట్లు స్పష్ట
పడుచున్నది. ఋగ్వేదకాలమునాటికే మిక్కిలి సన్నివస్త్ర
ముల ఉత్పత్తిగలదు.

ఇట్లే స్మృతి పురాణేతిహాసములలో మన పరిశ్రమ
యొక్క ఔన్నత్యమును గూర్చిన ప్రశంసలు చాల కాన
వచ్చుచున్నవి. 10 పలములనూలు సరిజేయగా 11 పలము
లగునని మనుస్మృతిలో నున్నది. భారతభాగవత రామాయ
ణాది పురాణములలో మన పట్టు, ఉన్ని, దూదివస్త్రముల
గూర్చిన అంశములు చాలగలవు. ధర్మరాజు రాజసూయ
యాగమునకు కర్నాటరాజులు పట్టువస్త్రములను, పాండ్య
చోళరాజులు సన్నిదుకూలములను, గుజరాత్ రాజులు
ఉన్ని జరీతో నేయబడిన వస్త్రములను కానుకలుగాదెచ్చిరి.

వేదకాలములోను స్మృతుల కాలంలోను వడుకుట
అనేది గృహపరిశ్రమగా ప్రతిగృహిణి ఆచరిస్తూ ఉండేది.
ఈ నాడుకూడ అస్సాంలోను, ఆంధ్రదేశంలోను, కొన్ని

ప్రాంతాల్లో గృహిణులు వడుకుట నేయుట చూడవచ్చును. వాత్స్యాయనుని కామసూత్రాలు (పేజి 238, 39) వడుకుట, నేయుట అనునవి గృహిణి ధర్మములని నిర్ణయించెను.

మజూరికి నూలువడకుట, నూలువడకుటకై ప్రత్యేక నిపుణులను తనిఖీ ఉద్యోగులుగా నేర్పాటుచేయుట కౌటిల్యార్థశాస్త్రమున పేర్కొనబడినవి. వితంతువులకు, వికలాంగులకు వడకుట చాల ఉపయోగకరమైన వృత్తియని సూచింపబడినది.

శిశుమారగిరి యను పురములో నకులపిత యనువాడు మరణశయ్య యందుండి తన కుటుంబముయొక్క భావిస్థితిని గూర్చి విలపించుచుండగా వాని భార్యయగు నకులమాత యిట్లని ఓదార్చెను. "నూలువడుకుట, ఉన్నిదారము తీయుట నాకు తెలియును. వీనివలన ధనమార్జించి బిడ్డలను పోషింపగలను". (బౌద్ధజాతక కథలు)

ఇప్పటికి రెండువేల సంవత్సరములనాడు రోము దేశీయులు భారతదేశపు నూలు వస్త్రములను విపరీతమగు ధరలకు కొనుచుండెడివారు. ఆరిలియన్ (Aurelian) ప్రభువు కాలమున మనవస్త్రాలు బంగారంతో సరిసమానమగు వెలకు అమ్ముడు పోయినవి. సుమా రిప్పటికి వందసంవత్సరముల క్రిందటివరకు గ్రీసు, రోము, ఈజిప్టు, ఇంగ్లండు, ఫ్రాన్సు, పెగు, రష్యా, పర్షియా, అమెరికా, అరేబియా, సిరియా, బాబిలోనియా, చైనా, జావా, మలే ఆర్చిపిలాగో మున్నగు ఖండాంతరదేశాలకు సైతం మనవస్త్రాలు విరి

విగా ఎగుమతి చేయబడినవి. బర్నియర్, మెగస్తనీసు, ఫాహియాన్, హ్యూన్‌త్సాంగ్, మార్కోపోలో, వార్తిమా, (1508), రాల్ఫ్‌ఫిచ్ (1598). టవర్నియర్ (1666) మున్నగు విదేశ బాటసారులు మన వస్త్రములజూచి, ఆశ్చర్యపడి, మనవస్త్రనిర్మాణ శిల్పకళానైపుణ్యమును ప్రశంసించిరి. భారతదేశంలో మిక్కిలి సుందరములగు వస్త్రములు తయారగుననియు, ఒక యుంగరములో దూర్చుటకు వీలగునంత సుందరములగు సున్నితవస్త్రములను నేయగల నేర్పరులుకూడా గలరనియు అరేబియా బాటసారులు 9 వ శతాబ్దమునందే వ్రాసియుండిరి. నేత నేయుటయే భారతదేశపు ముఖ్య పరిశ్రమయనియు, తూర్పుసముద్రతీరమున ముఖ్యంగా మచిలీపట్టణమున ప్రపంచంలో మరి యెచ్చటను తయారుగాని వస్త్రములు తయారగుచుండెనని 13 వ శతాబ్దమునందు ఈ దేశమును జూడ వచ్చిన మార్కోపోలో ప్రశంసించియుండెను. వార్తిమ, రాల్ఫ్‌ఫిచ్ యను నాంగ్లవర్తకులు 16 వ శతాబ్దమున బంగాళదేశమును దర్శించి వస్త్రపరిశ్రమయందు దాదేశము అగ్రస్థానము నధిష్ఠించుచున్నదని వ్రాసియుండిరి.

ఢక్కామజ్లిన్ల యొక్క సొగసు, సున్నితము, పనితనములకు మెచ్చి ఆంగ్లేయకవులు. 'Evening Dew' 'Woven Air' 'Running water' అని సాయంకాలపు మంచుతోను, వాయువుతోను, ప్రవహించునీటితోను మన మజ్లిన్లను పోల్చిరి. మన ప్రాచీన వస్త్రకారులు పెద్దపెద్ద సంఘములు స్థాపించుకొని విరివిగా వ్యాపారము జేయు

చుండెడివా రనియు, అట్టి సంఘనాయకులు అప్పటి ప్రభువులకు స్నేహితులుగను సలహాదారులుగను ఉండెడివారనియు "Cambridge Hfstory of India" Vol 1. పే. 219 లో గలదు. బౌద్ధయుగములో రాజులు తమ ద్రవ్యమును భద్రముగ కాపాడుకొనుటకై వస్త్రకారుల సంఘములలో దాచుకొనుచుండెడివారని బౌద్ధశాసనములలో కలదు. పారిశ్రామికుడగు ప్రాచీన వస్త్రకారుడు మంచి గౌరవస్థితిలో నుండెను.

"The Vedantin, the Tatwavaya (the weaver of eternal verities) clothed the nescience of man's soul, while the weaver, the Tantuvaya (the weaver of cotton threads) clothed the nackedness of man's body"

"తత్త్వవేత్త యగు వేదాంతి శాశ్వతమైన సత్యములను తంతువులచే నేయబడిన వస్త్రముతో మానవుని ఆత్మయొక్క అజ్ఞానమును కప్పివుచ్చగా, దూది తంతువులచే నేయబడిన వస్త్రముతో తంతువాయుడు మానవుని దిగంబరత్వమును కప్పివైచెను."

"The weaver among the Hindus is no despicable caste. He is next to the Scribe and above all the machanics" "హైందవ వర్ణవ్యవస్థలో వస్త్రకారుడు నీచమగు కులమునకు చెందడు. లేఖకుని తర్వాత శిల్పు లందరికంటె ఉన్నతస్థాన మధిష్ఠించును" అని ఉర్మిసేనాధిపతి (General Orme) 1782 లో తానువ్రాసిన చరిత్రయందు భారతవస్త్రకారుని వర్ణించెను. మహమ్మదీయ ప్రభువులును,

రాణులును, పాశ్చాత్య సుందరీమణులును మనరవసెల్లాలను, పట్టువస్త్రములను ధరించి మురిసి పోయిరి. ఈ విధమైన చరిత్రాంశములెన్నియో గలవు. ఆ కాలము మన వస్త్ర కారుల స్వర్ణయుగము.

## వస్త్రపరిశ్రమకు ప్రసిద్ధినందిన ప్రదేశములు

మన దేశమునందు వస్త్రపరిశ్రమకు ఖ్యాతినందిన ప్రదేశములు అన్ని ప్రాంతముల యందును ఉన్నవి. వస్త్రపరిశ్రమ మన దేశమున సర్వత్రా వ్యాప్తమై యున్న దనుటకు ఇది ప్రబల తార్కాణము.

ఢక్కా, క్రిష్ణగర్, శాంతిపూర్, ఆరణి, విశాఖ పట్టణము, నెల్లూరుపట్టణాలు సన్నని డోరియా మజిలిన్లకు ప్రసిద్ధి.

బందరు కలంకారీలకు, కాలికోలకు ప్రసిద్ధి. బనారస్, హైదరాబాదు, కచ్చి, మైసూరు, మూర్షిదాబాదు, పునహా, సూరతు, అహమ్మదాబాద్, వరంగల్ జరీలతలుగల పట్టుబట్ట లకు ప్రఖ్యాతినందెను.

కాశ్మీరము ఉన్నిశాలువులకు పేరు పొందెను. మద్రాసు రవికె గుడ్డలకు, పట్టలకు, జేబు గుడ్డలకు విఖ్యాతి నందెను. పాటలీపుత్రంలో దుప్పట్లు, రంగపురం, ఆగ్రా, ఝాన్సీ, అమృతసర్, మీర్జాపూర్, ఖరగ్‌పూరు, బెంగు ళూరు, ఏలూరు, తంజావూరు, హైదరాబాదులలో సుందర మైన తివాచీలు తయారయ్యేడివి.

ఇవిగాక మన పెడన, ఉప్పాడ, బరంపురం, జగ్గయ్యపేట, రాజమండ్రి నగరములుకూడ పూర్వకాలమందే వస్త్ర పరిశ్రమలో మిక్కిలి ప్రఖ్యాతి గాంచెను.

## పనితనము

భారతదేశంలో హస్తనైపుణ్యానికి, పనితనానికి ఢక్కామజ్లిన్లదే అగ్రతాంబూలం. 9వ శతాబ్దంలో మన దేశానికి వచ్చిన అరేబియా బాటసారి సులేమాన్ "20 గజాల తాగను ఉంగరములో దూర్చినది నేను చూచితిని" అని వ్రాసెను. (Elliot's Historians Vol I)

ఢక్కామజ్లిన్లను కట్టుకున్నవాళ్లను చూడగా శరీరం నగ్నముగనున్నదా, ఆచ్ఛాదనముకలదా అను సందియము కలుగును" అని Pyrald వ్రాసెను. ఢక్కా సమీపమందలి సోనార్‌గాన్ అనుచోట అతి సున్నితమైన వస్త్రములు తయారయ్యేనని రాల్ఫ్‌ఫిచ్, (Ralf Fitch) వ్రాసెను. 15 గజముల పొడవుగల మజ్లినుగుడ్డ 4 తులముల బరువు మాత్రమే ఉండెనట.

"ఒక వస్త్రకారుని అజాగ్రత్తవలన పచ్చికపై ఆరవేయబడిన ఒక మజ్లిను వస్త్రమును, పచ్చగడ్డిపైనున్న మంచు పొరయను భ్రాంతితో ఒక గోవుమేసినదనియు అందులకు నవాబ్ అలివర్ది ఖాన్ ఆ వస్త్రకారుని మందలించెననియు తెలియుచున్నది.

అంతేకాక ఢిల్లీ పాదుషాయైన ఔరంగజేబు తన కుమార్తె దర్బారునకు నగ్నముగా వచ్చినదని విభ్రాంతిచెంది

మందలించబోగా నామె తాను 7 పొరల మజ్లిను దుకూలాంబరమును ధరించియున్న విషయమును తండ్రికెరిగించెననియు గాధ కలదు." *

పారశీకపు బాటసారి మహమ్మద్ ఆలీబేగ్, స్వదేశమునకు తిరిగివెళ్లుచు తన రాజునకు బహుమానముగ ముత్యములు పొదగబడిన టెంకాయను తీసుకవెళ్లెననియు, ఆ స్వల్పబహుమానమున కా రాజు అసంతృప్తుడై దానిని నేల విసరికొట్టగా నందుండి 60 మూరల అతి సున్నితమైన తలపాగా ముత్యములతోపాటు బయల్పడెననియు, అందుల కాతడు మిక్కిలి సంతసించెననియు, 17 వ శతాబ్దమున మనదేశంలో సంచారముచేసిన టావర్నియరు తన గ్రంథమున వ్రాసియుండెను.

19 వ శతాబ్ద మధ్యమున మనదేశమున సంచారము చేసిన జేమ్సు టైలర్ (James Taylor) అతి సున్నితమైన నూలు చూచినట్లువ్రాసెను. 40 తులములుగల నూలు 250 మైళ్లు పొడవుండెనట. అనగా దీనినంబరు సుమారు 524 ఉండును.

---

* Interesting stories were narrated as to how the Nawab Ali Verdi Khan chastised one of the Hindu weavers and banished him from the city for having carelessly left on the ground a fine piece of muslin to be eaten up by his cow as grass and of how the Emperor Aurangazeb was startled by his daughter's appearing almost naked before him in court where upon the young princess remonstrated that she had as many as seven muslin suits on her person. Hand Spinningn and weaving page 38.

వస్త్రములలో సున్నితము, పనితనమేగాక, పూర్వము బొమ్మలు, లతలు, శ్లోకములుకూడ వస్త్రములలో వచ్చునట్లు నేయబడిన ఉదాహరణలు కొన్నింటినిచూపుచున్నాము.

'మదారభిక్షు' యనునతడు కుట్టుతో పనిలేక టోపీలను మగ్గంపై తయారుచేసి బహుమతుల పొందెనట.

ఇతనికంటెను పూర్వికుడగు 'భిక్కా'యను నతడు కుట్టులేకుండా చొక్కాను, అయోధ్య నవాబును స్తుతించు కొన్ని పద్యములను నేతలో వచ్చునట్లుగా ఒక తలపాగాను తయారుచేసి, నవాబునకు బహూకరించి 'జాగీరు'ను పొందెననియు C. A. Silberad I. C. S. వ్రాసియున్నాడు. *

19 వ శతాబ్దంలో పార్లమెంటువారిచే పంపబడి, భారతదేశంలోని వస్త్రోత్పత్తి వివరాలను సేకరించిన వాట్సన్ "The Textile Manufactures and Costumes of the people of India" అనుతన గ్రంథములో మిల్లుపరిశ్రమ యెంత అభివృద్ధినందినను ఢక్కాలో తయారుచేయబడిన అతి సున్నితమైన వస్త్రములను మిల్లులు తయారుచేయుట సంశయాస్పదమని భావించెను. ఆ పూర్వకాలపు పనిముట్లు

* ఆధునిక యుగమునకూడ, యింతకంటె మిన్నయైన శిల్పకళను ప్రదర్శించి మగ్గముపై ఇండియాపటమును వివిధరంగులలో తయారుచేసిన శ్రీ॥ శే॥ పెండెం కేశవులు, సూదితో పనిలేకుండా, కోటు, షరాయి తయారుచేసిన శ్రీ అందె సుబ్బారాయుడుగార్లున్ను ఉన్నారు. వీరి విషయము 5 వ ప్రకరణములలో విపులముగ వ్రాయబడినది.

మోటుగానున్నను అతి సున్నితమైన వస్త్రసృష్టికి తగి యుండుట అత్యాశ్చర్యకరము అని వ్రాసియుండెను. *

* "However viewed, therefore our manufacturers have some thing still to do with all our machinery and wondrous appliances, we have hither too been unable to produce a fabric which for fineness or utility can equal the woven air of Dacca—the product of arrangements which appear rude and primitive are admirably adapted for their purpose."

J, F. WATSON M.A.: M.D. F.R.A.S

# పరివర్తనము

## కంపెనీవారు పెట్టిన బాధలు

ఆంగ్లేయులు 1600 సంవత్సరములో తూర్పు ఇండియా సంఘమును స్థాపించుకొని మనదేశమునకు వచ్చిరి. 1610 సంవత్సరములో బందరులోను, 1612 లో సూరత్‌లోను, 1639 లో మద్రాసులోను, 1640 లో కలకత్తాలోను ఫ్యాక్టరీలను నిర్మించిరి. ఇచట నూలువస్త్రములను తీసుకొనిపోయి విక్రయించుటవల్ల రెట్టింపులాభాలు వచ్చెను. అట్టి విపరీత లాభాలవల్ల కంపెనీవారు అత్యాశాపిపాసులైరి. అన్యాయమగు కంట్రాక్టులువ్రాసి, గ్రామోద్యోగీయుల సహాయమున వస్త్రకారులను ఒకచోచేర్చి వారిచే బలవంతముగ నొప్పించెడివారు. వారు నేయు వస్త్రములను, కంపెనీకి బజారు వెలకన్న తక్కువకు విక్రయింపనిచో శిక్షవిధించెడివారు. ఆ శిక్ష జరిమానాలు, కొరడాదెబ్బలు. ఇవి అనుభవిస్తూ 35% చొప్పున అపరాధము ఇచ్చెడివారు. కంపెనీవారు పెట్టు బాధలనుజూచి హృదయముకరగి ఆ అక్రమచర్యలను ఖండించుచు 'Boults' బోల్ట్సు తన 'Considerations' అనే పుస్తకంలో యిట్లు వ్రాసెను. "జరిమానాలు వేయుట, ఖైదులోపెట్టుట, కొరడాదెబ్బలు కొట్టుట, బలవంతముగా బాండుల నొప్పించుట" మొదలగు బాధలచే వస్త్రకారు

లను, కంపెనీ ఏజంట్లున్నూ, గుమాస్తాలున్నూ హింసించెడి వారు. ఆబాధల సహించలేక జంగల్కడీ చుట్టునున్న జిల్లాల యందలి వస్త్రకారుల కుటుంబములు 700 ఒక్కసారి తమ వృత్తిని విడచి వెళ్లిపోయినవి.

ఇట్టి దురంతములవలన, వస్త్రపరిశ్రమ ఉన్నతియందున్న డక్కావంటి నగరమున, జనసంఖ్య క్రమంగా తగ్గిపోయెననియు, డక్కాలో 1800 సం॥లో 20,000 జనాభా ఉండెననియు, 1840 లో 8000 మాత్రమే ఉండెననియు, చార్లెసు ట్రెవిలియన్, పార్లమెంటులో, తూర్పు యిండియా సంఘమువారి దురంతముల విచారణలో సాక్ష్యము నిచ్చెను. కంపెనీవారి బలవంతమున, నూలువడకువారు పైన వివరించిన బాధలు పడలేక తమ బొటనవ్రేళ్ళను తామే తెగగొట్టికొనిరని బోల్టుసుగారే వ్రాసియుండిరి.

ఇంగ్లీషు గవర్నరు జనరల్ అయిన (Lord Bentick) బెంటిక్ ప్రభువు 1834 లో "వాణిజ్య చరిత్రలో ఇట్టి కష్టముల సాదృశ్యమును కానమనియు, నూలు వస్త్రపారిశ్రామికులయొక్క ఎముకల గుట్టలచే హిందూదేశ మైదానములు నిండుచున్నవనియు వ్రాసెను. *

కంపెనీవారి పై విధానము భారతదేశమున వస్త్రపరిశ్రమను, యితర పరిశ్రమలను నష్టపఱచెననియు, వస్త్ర

---

"*The English Governor-General of India Lord Bentick reported in 1834 that the misery hardly finds a parallel in the history of commerce. The bones of cotton weavers are bleaching the plains of India."

"The Discovery of India." Jawaharlal Nehru. Page 352.

కారులు యితర శిల్పులు నశించిరనియు, ఇట్టి క్షీణత బెంగాలు, బీహారులలో త్వరితముగ జరిగెననియు, బ్రిటిషు పాలన యితర ప్రాంతములకు వ్యాప్తియైనకొలది ఈ నాశన విధానముకూడ వ్యాపించెననియు, కాగితము, గాజు, లోహ ములు, నౌకానిర్మాణము మొదలగు పరిశ్రమలనుకూడ నాశనముచేయు ఈ విధానము 19 వ శతాబ్దమంతయు సాగె ననియు, పండిత జవాహర్‌లాల్ నెహ్రూ తన "The Discovery of India "లో వ్రాసెను. *

## ఇంగ్లండులోని నిరోధక చర్యలు

కంపెనీవారి కాలంలో యిచ్చట తయారయిన వస్త్రాలల్లో ముప్పాతిక ఇంగ్లండు కెగుమతిచేయబడెను. ఒక కలకత్తా రేవునుండియే పదికోట్ల రూపాయల విలువగల వస్త్రములు యెగుమతియగుచుండెను. ఇందుచే ఇంగ్లండు లోని ఉన్నిపరిశ్రమ క్షీణించుట కారంభించెను. భారత వస్త్రముల దిగుమతి నరికట్టి అచ్చట ఉన్నిపరిశ్రమను రక్షించవలయునని ప్రజలు గొప్ప ఆందోళనచేసిరి. మెకాలే

* "The Indian Textile Industry collapsed affecting vast numbers of weavers and artisans. The process was rapid in Bengal and Behar, elsewhere it spread gradually with the expansion of British rule and the building of railways. It continued throughout the 19th century breaking up other old industries also, ship-building metal working, glass, paper and many other crafts." "The Discovery of India." Jawaharlal Nehru. Page 351.

తనఇంగ్లండు చరిత్ర(History of England)లోఇట్లువ్రాసెను.

"Was it not shame to see a gentlemau whose ancestors had known nothing but stuffs made by English hands out of English fleece flaunting in the calico suit and a pair of silk stockings from Morshidabad."

"ఎవరిపూర్వులు ఇంగ్లండు ఉన్నితో ఆంగ్లేయులు తయారుచేసిన వస్త్రములు తప్ప ఇతరము నెఱంగరో అట్టి వారి సంతతివారు ఇండియాలో మూర్షిదాబాదునుండి వచ్చిన కాలికోసూట్లను, మేజోళ్ళను వేసుకొని తిరుగుట సిగ్గుచేటుకదా!"

డానియల్ డిఫో (Daniel Defoe) ఆంగ్లేయులు భారతవస్త్రములను ధరించుటను తీవ్రముగ నిరసించెను. అచటి ఉన్ని వస్త్రకారులకు క్రోధముపెరిగి కోల్చెస్టరు (Colchester)లో హిందూదేశపు కాలికోలను ధరించిన స్త్రీల చుట్టును మూగి అల్లరిచేసి అవమానపరచిరని డిఫో (Defoe) వ్రాసెను.

ఈ విధముగ నా ప్రజలలో స్వదేశాభిమానము రేకెత్తి, భారతవస్త్రముల దిగుమతిని నిరోధించి తమ పరిశ్రమను కాపాడుకొనుటకై గొప్ప ఆందోళన సాగించిరి. తత్ఫలితముగా పార్లమెంటు, 1700. 1721, 1774, 1777, 1813 సంవత్సరములలో నిరోధక శాసనములు గావించెను.

1700 సం॥ శాసనము అద్దకపు కాలికోలను నిషేధించెను. 1721 వ సంవత్సరపు శాసనము అద్దకపు కాలికోలను ధరించుటను నిషేధించెను. మన కాలికోలను ధరిం

చినవారికి 5 పౌన్లు (75 రు.) అమ్మినవారికి 30 పౌన్లు (రు. 300) జరిమానా విధించిరి. 1777 వ సంవత్సరములో శాసనము, అచ్చట గొర్రెలవధను నిషేధించెను.

## క్రొత్త పరికరముల యభివృద్ధి

ఈ పరిస్థితు లిట్లుండగా ఇంగ్లండులోని వస్త్ర నిర్మాతలు తమ పారిశ్రామికజ్ఞానము నభివృద్ధి జేసికొనుటచే నూత్న పరికరముల గనిపెట్టిరి. 1733 లో 'జాన్ కే' మరమగ్గమును (Fly shuttle loom) 1738 లో 'లూయీపాల్' దూదేకు యంత్రమును (Mule) కనిపెట్టిరి. 1764 లో 'జేమ్సుహార్ గ్రీవ్సు' Spinning Jenny యంత్రమును, 1767 లో 'ఆర్క్ రైటు' water frame యంత్రమును కని పెట్టిరి. 1765 లో మిల్లుమగ్గము (Power loom) 1768 లో ఆవిరియంత్రము (Steam engine) కనిపెట్టబడినవి. 1798 లో 'జాకార్డు' నూతన మగ్గమును కనిపెట్టెను. 1814 లో 'హారక్సు' నూలునేతకు ఆవిరియంత్రమును జోడించెను. ఈ విధముగ నేతపరిశ్రమకు యంత్రయుగ మారంభమయ్యెను. ఈ పరివర్తన ఫలితముగ 1778 న ఇంగ్లండులో 'రవసెల్లా' తయారుచేయబడెను.

1813 లో హిందూదేశ దిగుమతి వస్త్రములపై 70% నుంచి 80% దిగుమతి పన్ను విధించు శాసనమును గావించిరి. ఈ విధముగ నచ్చట మన వస్త్రముల దిగుమతి నిరోధింపబడి 1800 నుండి ఇంగ్లండు వస్త్రములు మనకు పంపబడినవి. అచ్చటి మిల్లునూలు 1823 లో మొదటిసారి

మనగడ్డపై దిగెను. విదేశములకుపోవు మన వస్త్ర ప్రవాహము ఎదురుతిరిగినది. ఇంగ్లండునుండి మనకే నూలు, వస్త్రములు దిగుమతి యగుచుండెను. మన పరిశ్రమ క్రమముగా క్షీణించెను. "భారత వస్త్రపరిశ్రమను బలిగొని పైస్లీ మాన్చెస్టరు పట్టణములలోని యంత్రములు సృష్టింపబడినవి." అని విల్సను వ్రాసెను.

"The Mills at Paisely and Manchester were created by the sacrifice of the Indian Manufacture." (Wilson).

## ఇంగ్లండు ఎగుమతి వ్యాపార అభివృద్ధికై విచారణకమిటీలు

అంతతో నూరకుండక ఇంగ్లండుసరకులు మన దేశంలో విక్రయించుటకు మార్గము నన్వేషించుటకై 1813, 1846లలో పార్లమెంటు, విచారణ కమిటీలనుబంపెను. ఆ కమిటీలు ఇండియాకువచ్చి, అన్ని ప్రాంతములు దిరిగి విచారణలు జరిపి, నివేదికలను తయారుచేసి పార్లమెంటునకిచ్చెను.

1861 లో J, F. Watson (వాట్సను) మనదేశంలో వస్త్రపరిశ్రమను గూర్చి నివేదిక తయారుచేయుటకై ఇచ్చటకు వచ్చెను. అతడిచ్చట 700 రకముల వస్త్రముల నమోనాలను ప్రోగుచేసెను. 700 నమోనాలకు వరుస నెంబరులు వేసి, నంబరువారీగా, ఆవస్త్రములు తయారయినచోటు, నూలునంబరు, గజము ఖరీదు మొదలగు వివరములను చేర్చి "The textile Manufactures and Costumes of people of India" అను నొక నివేదికను తయారుచేసెను. మనదేశమందలి వివిధప్రాంతములందలి ప్రజలు

ధరించు దుస్తుల ఆకృతులను, రంగులను యథాతథముగా చిత్రపటములు వ్రాయించి అందుజేర్చెను. ఆ నివేదికా ప్రతులు పార్లమెంటువారివల్ల అచ్చటి వర్తకులకు బంచి పెట్టబడెను. దాని ద్వారామన పరిశ్రమయొక్క ఆయువు పట్టులన్నియు ఆంగ్లేయులకు తెలిసెను.

రైళ్ళవ్యాప్తి : విదేశ వస్త్రాల దిగుమతులు : దుష్టఫలితాలు

ఇండియానుండి ప్రత్తిని యింగ్లాండుకు తీసుకొని పోయి, అచ్చట తయారైన వస్త్రములను ఇచ్చట వ్యాప్తి జేయుటయే మనదేశములోని రైలుమార్గములను స్థాపించుటకు ప్రధానోద్దేశమని డల్‌హౌసీ ప్రభువు వ్రాసెను. జి. ఐ. పి. రైల్వేస్థాపకుడగు, చాప్‌మన్ ఈయుద్దేశమున కనుకూలముగా రైలుమార్గములను స్థాపించు విషయమై 1851 లో "Indian Railways" అను గ్రంథమును వ్రాసెను.

మనదేశమునకు దిగుమతియయిన, విదేశ నూలు, వస్త్రములు విరివిగ వ్యాప్తినందెను. తత్ఫలితముగ మన వృత్తి ఎట్లు క్షీణించినదియు 1879 లో మదరాసు ప్రభుత్వపు సాంవత్సరిక నివేదిక వలన కొంత తెలియగలదు.

"ఇంగ్లండునుండి నూలు, వస్త్రములు దిగుమతికాక పూర్వము మధురలో రెండు లేక మూడువేల మంది నేతకువా రుండిరి. ఇప్పుడు నేతకుట పూర్తిగా నశించినది. పూర్వము 500 మహమ్మదీయ కుటుంబములు జరీ పరిశ్రమ వల్ల జీవించుచుండిరి. ఇప్పుడు 10 కుటుంబములవా రున్నారు. వృత్తి విడిచిపెట్టిన వారిలో కొందఱు మాత్రమే

వ్యవసాయములో చేరిరి. కాని చాలమంది ఇసుకబండ్లు లాగుచున్నారు.'' ఇట్లు అనేకమంది వృత్తి వదలిపెట్టి పోవుట చేతనే 1870–1921 సం॥ల మధ్య మద్రాసు జనాభా 3 కోట్లనుండి 4 కోట్లకు పెరిగినను మగ్గాలు మాత్రము 2,79,000 నుండి 1,69,000 వఱకు తగ్గిపోయినవి.

## మనదేశములో గృహపరిశ్రమల క్షీణత

ఇంగ్లండు దేశములో పారిశ్రామికాభివృద్ధితోపాటు మనదేశమున కుటీర పరిశ్రమల క్షీణత ప్రారంభమయ్యెను. నేత పరిశ్రమ నశించుటయేగాక, మనదేశములో ఉన్న ఇతర చిన్న పరిశ్రమలు, కాగితము, గాజు, లోహములు, నౌకానిర్మాణము మొదలైనవి కూడ నశించెను. ఇట్టి క్షీణతవలన వృత్తులపై ఆధారపడియున్న ప్రజలందఱు వ్యవసాయమునకు మరలిరి. వృత్తుల క్షీణతవలన నిరుద్యోగులైన ప్రజలు భూమిపై నాధారపడుట వలన వ్యవసాయ వృత్తికూడ లాభసాటి కాదయ్యెను. 19 వ శతాబ్ద మధ్యమున వ్యవసాయముపై మనదేశ ప్రజలలో 55% మాత్రము ఆధారపడి యుండిరనియు, అది ప్రస్తుతము 74% వఱకు పెరిగినదనియు జవహర్‌లాల్ పండితుఁడు తన 'The Discovery of India' లో వ్రాసెను. ఇట్లు బ్రిటీషు ప్రభుత్వ విధానము వలన హిందూదేశము క్రమముగ వ్యవసాయ దేశమైనదనియు, ఇతర దేశములు వ్యవసాయదశనుండి పారిశ్రామిక దశకు అభివృద్ధి యగుచుండగా మనదేశమున ఆ సూత్రము తారుమారైనదనియు జవహర్‌లాల్ పండితుఁడు వ్రాసెను.

"India became progressively ruralised. In every progressive country, there has been, during the past century, a shift of population from agriculture to industry, from village to town. In India this process was reversed, as a result of British Policy." "The Discovery of Indiâ".

## మనదేశములో నూలు, బట్టల మిల్లులు

హిందూదేశములో మొట్టమొదటి మిల్లు 1851 లో నెలకొల్పబడెను. 1900 సంవత్సరము నాటికి 193 మిల్లు లుండెను. అందు 50 లక్షల కదుళ్లు 40,124 మగ్గాలు ఉండెను. మొట్టమొదట మిల్లులు నూలును మాత్రమే తయారుచేయుట చేతను, ఆ నూలు అంతయు చేమగ్గాలకు ఉపయోగించుటచేతను, ఆ విధానము చేనేత పారిశ్రామికు లకు సహకారిగ నుండెను. చేమగ్గాలకు కావలసిన ముతక నూలంతయు మన మిల్లులే తయారుచేసెను. కాని 19 శతాబ్దాంతమునకు విదేశనూలు దిగుమతి తగ్గుటచే మన మిల్లులలోని ఉత్పత్తి చాల అధికమయ్యెను.

మొదట చాలకాలమువఱకు మిల్లులకును చేనేతకును పోటీ లేకుండెను. మిల్లులలో ఉత్పత్తియైన నూలులో చాల భాగము చేమగ్గాలకు సప్లయిచేయబడగా మిగత చైనాకు ఎగుమతిచేయబడెను. కొద్దిగా మాత్రము మిల్లులలో నేత కుపయోగింపబడెను. 1896-97 మొదలు 1900-1901 సంవత్సరములలో మిల్లులు 4210 లక్షల పౌన్ల నూలును ఉపయోగించెను. 10030 లక్షల పౌన్ల నూలు (అనగా 2½ రెట్లు) చేమగ్గాలకు ఇవ్వబడెను. ఈకాలములోనే హిందూదేశమున గొప్ప కఱువు వచ్చెను. కఱువు కారణ

మున బట్టకుగిరాకి తగ్గుటచే దేశమందంతటను చేనేత పారిశ్రామికులు చాల బాధలు పడిరి. ఆ కలువులో నేత పరిశ్రమ కొఱకు ప్రత్యేక సదుపాయములు చేయబడెను. అట్టి వ్యతిరేక పరిస్థితులలో గూడ నేత పారిశ్రామికులు తమ ఉత్పత్తిని నిలబెట్టుకొనుటయేగాక ఎక్కువ చేయ గలిగిరి. ఈ శతాబ్దారంభము నుండియు ఈ పరిశ్రమ వికాసము నొందసాగెను. 1901 నుండి 1911 సంవత్సర కాలములో చేనేతమగ్గాలు వాడిన నూలు 24% పెరిగెను. ఈ కాలములో చేనేత వస్త్రాలకు గిరాకి వచ్చి నందున, ఢక్కా, శాంతిపూర్, షోలాపూరు, ఇల్‌కాల్, అహమ్మ దాబాదు, బొంబాయి, పైఠాన్, బరంపురం, బేరార్, సేలం, మధుర, కంచి, కోయంబత్తూరు, ఉప్పాడ, ధర్మ వరము అభివృద్ధినందెను. ఈ మధ్యకాలంలో నేతపరి శ్రమ అభివృద్ధికి గల కొన్ని కారణములను గమనింతము.

(1) సుంకవిధానము చేనేతకు రక్షణ నొసంగెను. ఎగుమతియైన మిల్లు బట్టపై 3½% సుంకమును విధించిరి. దిగుమతియైన నూలుపైన సుంకము లేకుండెను. అందువలన పారిశ్రామికునకు తగిన మజూరి గిట్టుట కవకాశమేర్పడెను.

(2) జాతీయవాదులచే 19వ శతాబ్దము చివరను ప్రారంభముచేయబడిన స్వదేశిఉద్యమము చేనేతకు మంచి సహకారము చేసెను. తర్వాత బెంగాలు విభజనవలన భారత జాతీయ కాంగ్రెసుచేత ప్రోత్సహింపబడెను. ఈ స్వదేశీ ఉద్యమమువలన మన మిల్లులు అధికలాభములను

పొందెను. అయినను చేనేత పరిశ్రమకూడ కొంత లాభము పొందక పోలేదు.

(3) రాష్ట్రీయ ప్రభుత్వాల ప్రోత్సాహమున దేశములోనున్న పూర్వపు 'నాడి విసరే మగ్గాలు' ('Throw Shuttle') మర మగ్గాలుగా మారుటవలన అధికోత్పత్తి, నిపుణత ఎక్కువ యయ్యెను. ఇట్టిమార్పు మన రాజధానిలో 1900 నుండి ప్రారంభమయ్యెను. కాని 1912 సంవత్సరమునకు 10,000 మర మగ్గాలు ఉండెను. ఈ కాలములోని నేత పరిశ్రమ యొక్క ఆధిక్యతకు పై అంశములన్నియు కారణము లయ్యెను.

పూర్వము మన దేశములో నున్న మగ్గాలు చేతితో నాడిని ఒక ప్రక్కనుండి వేరొక వైపుకు విసరివేయబడేవి. వీనిని 'Throw Shuttle' త్రోపుడు మగ్గాలని వ్యవహరించిరి. ఇంగ్లాండులో 'Fly Shuttle' మర మగ్గము 1773లో కనిపెట్టబడి మన దేశములో కూడ వ్యాపించింది. ఇవి మన రాష్ట్రములో ఇప్పుడు సర్వసాధారణముగా వాడబడుచున్న మగ్గాలే. వీనినే మనము మరమగ్గా లంటున్నాము. మూడవరకము (Power-Loom) పవరు మగ్గాలు. మన దేశములోనున్న 25 లక్షల మగ్గాలల్లో యింకా 62% త్రోపుడుమగ్గా లున్నవని విషయసేకరణ సంఘము (Fact-Finding Committee) వారు లెక్కలువేసిరి. అయితే మన రాష్ట్రములో మాత్రం 81% (Fly Shuttle) మర మగ్గాలున్నవి. మనరాష్ట్రము యీ విషయములో ప్రథమస్థానాన్ని ఆక్రమించింది. ఇట్టి అభివృద్ధికి, మార్పుకు, మన రాష్ట్రము

లోని పారిశ్రామికుల్లో ఉన్న, విద్య, విజ్ఞానము, ప్రచారము, పలుకుబడి కారణము. జస్టిస్ పార్టీ స్థాపకులైన సర్. పిట్టి త్యాగరాయ శెట్టిగారు చేనేత పారిశ్రామికు లైనందున తమకు ప్రభుత్వముతో గల పలుకుబడిని ఉపయోగించి పారిశ్రామికుల అభివృద్ధికై పాటుపడిరి. 1908 వ సంవత్స రములో మద్రాసులో 'All India Weaving Competition, Textile Industrial Exhibition' పెట్టించిరి. తత్ఫలితముగ ఆంధ్రతమిళ దేశములలో పారిశ్రామిక పరికరాలలో సత్వర మార్పులకు కారణమయ్యెను. ఈ పోటీలో ప్రథమబహుమతి నందిన శ్రీ కార్యంపూడి వేంకటకృష్ణకవిగారు, మద్రా సులో ప్రదర్శింపబడిన (Fly Shuttle) మర మగ్గాన్ని, మరా కును (Winding wheel) చూచి వచ్చి కొన్ని మార్పులతో ఆంధ్ర దేశములో ప్రవేశపెట్టిరి. అంతేకాక యితర సాధనా లకుకూడ చాల మార్పులుచేసిరి. వారి కృషి ఫలితాన్నే నే డాంధ్ర దేశము అనుభవించుచున్నది. (వివరములకు పరి కరముల ప్రకరణము చూడనగును.)

## 1914-1918 యుద్ధకాలము :

అసాధారణ పరిస్థితులల్లో మిల్లునూలు సప్లయిపై నాధారపడి యుండుటయే చేనేత పరిశ్రమకు గల గొప్ప బలహీనత. ఈ నూతన విధానములో చేమగ్గాలు సంపూ ర్తిగా, స్వదేశ, విదేశ మిల్లునూలుపై నాధారపడెను. అందువలన చాలవఱకు మిల్లుపరిశ్రమయొక్క ఒడుకు దుడు కులను చేనేత పరిశ్రమకూడ అనుభవించవలసి వచ్చెను.

ఇట్టి అపాయకర పరిస్థితి మొట్టమొదటి పర్యాయము మొదటి ఐరోపా సంగ్రామముననే కలిగెను. విదేశ దిగుమతులు తగ్గెను. దేశములోని బట్టకు గిరాకి అధికమయ్యెను. కనుక మిల్లులు నూలును తామే ఎక్కువగా వాడుకొని చేనేత పరిశ్రమకు చాల తగ్గించి వేసినవి. 1911–12 మొదలు 1915–16 సంవత్సరముల లోపల మిల్లులు 12,970 లక్షల పౌన్లనూలు వాడుకొని 12,480 లక్షల పౌన్లను చేనేత పరిశ్రమకిచ్చినవి. కాని తర్వాత 5 సంవత్సరాలల్లో (1916–17 మొదలు 1920–21 వఱకు) మొత్తమునూలులో 16,440 లక్షల పౌన్లను మిల్లులు వాడుకొని, చేమగ్గాలకు 10,970 లక్షల పౌన్లనిచ్చెను. అందువలన 1914–15 లో తయారైన 10,880 లక్షల గజాలగుడ్డ, 1916–17 లో 5,980 లక్షలకు, 1917–18 లో 7,410 లక్షలకు తగ్గెను. 1919–20 లో 5000 కు తగ్గెను. 1910–11 సంవత్సరము వఱకు మిల్లు ఉత్పత్తికంటె చేనేత వస్త్రం ఉత్పత్తి అధికముగా నుండెను. కొన్ని సంవత్సరాలల్లో రెట్టింపుగా కూడ నుండెను. కాని యుద్ధావకాశాన్ని పురస్కరించుకొని, మిల్లులు ఉత్పత్తిని అధికంచేసి, దేశీయ వ్యాపారాన్ని గుత్త గొననెంచెను. అందువలన చేనేత పరిశ్రమ దెబ్బతినెను. *

చేనేత వస్త్రోత్పత్తి మొత్తంమీద యుద్ధకాలంలో తగ్గిపోయినా, ఇతరవిషయాల్లో పరిశ్రమయొక్క పరిస్థితి

* "The hand- looms were finally beaten, and not only beaten but probably severely crippled for the time being"

*R. D. Bell.*

నిరుత్సాహకరంగా లేదు. మిల్లులు తమ అధికోత్పత్తిని యుద్ధావసారలకు సప్లయిచేస్తున్నా, మిల్లు పరికరాలను అధికం చేసుకోడానికి అవకాశాలు లేవు. చేమగ్గాలు ప్రత్యేకంగా నేయగల రకములను, స్త్రీలకవసరమైన చీరెలను తయారుచేయుటవలన చేనేత పరిశ్రమ మిల్లుపోటీని తట్టుకొని నిలబడ గలిగెను. ఇందువల్ల షోలాపురము, మలెగాన్ అభివృద్ధికి వచ్చెను. ఈ కాలంలోనే కన్ననూరులో మగ్గాల సంఖ్య అధికమయ్యెను. కాని యిట్టి అభివృద్ధి ఇతర కేంద్రాలల్లో కనిపించలేదు. ధరలు పెరిగినప్పుడు మజూరీలు కూడా పెరిగినవి కాని, తగినంత పెరుగలేదు. నూలుయొక్క అధికధరలు, నూలు కొరతవలన, ఇంతవరకు స్వాతంత్ర్యము ననుభవించిన పారిశ్రామికుడు, ఒక మధ్యవర్తియయిన షాహుకారును, పెట్టుబడి ద్రవ్యానికై ఆశ్రయింపవలసి వచ్చెను. అందువలన సాహుకారు ఈ అవకాశాన్ని పురస్కరించుకొని పారిశ్రామికుల లాభాన్ని గుంజుకొనెను. కొందరు కంట్రాక్టు పద్ధతిని, మరికొందరు కార్ఖానాలల్లో కూలీలుగను పనిచేయవలసి వచ్చెను. రంగుల అధిక ధరలు, కొరత కూడ చేనేత పరిశ్రమను తాకెను. యుద్ధానికి పూర్వం సగటున 150 లక్షల పౌన్ల రంగులు దిగుమతియయ్యెను. కాని 1915-16 లో 7 లక్షలకు, తరువాత మూడు సంవత్సరాలకు సగటు 13 లక్షలు వచ్చెను. ఈ కాలంలోనె రంగులు ధరలు 10 రెట్లు పెరిగెను. చీరలకు, కవిళ్లకు, లుంగీలకు, రంగునూలు ఎక్కువగా కావలసిన చేనేత పరిశ్రమ రంగుల కొరతవలన మొదలంట సరుకబడెను.

సరిగా పైన వర్ణింపబడిన పరిస్థితులకు సమానము గను, కొన్ని అంశములలో మరీ అధ్వాన్నముఁగను రెండవ ప్రపంచ సంగ్రామమున కూడ తటస్థించెను.

యుద్ధానంతరము—1918 మొదలు 1926 వఱకు :—

యుద్ధకాలములో దెబ్బతిన్న చేనేతపరిశ్రమ యుద్ధానంతరము తగినంత నూలు సప్లయివలన కోల్కొనెను. యుద్ధకాలములో వృద్ధినందిన మిల్లుపరిశ్రమ యుద్ధానంతరము వివిధములైన కారణముల వలన తగ్గిపోయెను. (1) బొంబాయిలో మిల్లులు నష్టపడెను. (2) కొన్నింటిలో కార్మిక తగాదాలు చాలకాల ముండెను. (3) విదేశపోటీ, కరెన్సీ యిబ్బందుల వలనను బొంబాయిలోని మిల్లులు దుర్భిక్షమును దాటవలసి వచ్చెను. అందువల్ల ఉత్పత్తి తగ్గుటచే స్త్రీల దుస్తుల ఉత్పత్తికి ప్రత్యేకత వహించిన చేనేతపరిశ్రమ ప్రాముఖ్యత వహించెను. అంతేగాక 1922 సంవత్సరమునుండి జర్మనీనుండి దిగుమతియైన చౌకబారు రంగులు చేనేతకు తోడ్పడెను. మద్రాసు, బొంబాయి, ధన్యకాళి, మధోబ్ డిలలో పెక్కు రంగుల చీరెలు ఉత్పత్తి యయ్యెను. వీనిని యువతులు మిక్కిలి ఆదరించిరి. ఈ కాలములోనే రాష్ట్రాలల్లో, పరిశ్రమల శాఖలు (Fly Shuttle) మరమగ్గాలవ్యాప్తికి మిక్కిలి కృషిచేసెను. ఇందువలన పారిశ్రామికుల్లో నిపుణత, ఉత్పత్తివేగము అధికమయ్యెను. పడుగుపోయుట పడుగు సరిచేతలలోను అభివృద్ధి వచ్చెను. ఇందువలన ఉత్పత్తి ఖరీదు తగ్గుటయే

గాక, మొత్తము ఉత్పత్తికూడ అధికమయ్యెను. అందువల్ల యుద్ధకాలములో ఉన్న 8530 లక్షల గజాల సగటు ఉత్పత్తి 1922-23 లో 10,840 లక్షలగజా లయ్యెను.

కాని యిట్టి అనుకూల వాతావరణము ఎక్కువకాల ముండలేదు. వెంటనే కొన్ని ఆర్థిక, రాజకీయ సాంఘిక కారణములు పరిస్థితులను తారుమారుచేసెను. ఈపరిస్థితు లలో మరల మిల్లులు ముందుకు సాగెను. చేమగ్గాలు వెనుకపడెను.

సన్నము, మధ్యరకము నంబర్లల్లో పోటీవచ్చినందున మిల్లులుకూడ చీరెల ఉత్పత్తిని 1925 లో ప్రారంభించెను. ఇంతేగాక, డ్రిల్లుగుడ్డ, లాంగుక్లాతు, షర్టింగులుకూడ తయారగుచుండెను. విదేశములనుండికూడ బట్ట దిగుమతి కాజొచ్చెను. కాని కొన్ని ఆర్థిక, రాజకీయ కారణముల వలన దిగుమతి తగ్గగా, ఆ అవకాశమును స్వదేశమిల్లులు తీసికొనెను.

1926 నుండి, కొన్ని వివిధములైన రాజకీయ, సాంఘిక కారణములవలన మిల్లులు అభివృద్ధి నందెను. 1913-14 లో దిగుమతులు, 3,31,970 లక్షల గజాల నుండి, 1925-26లో 15,640 లక్షల గజాలకు తగ్గిపోయెను.

ఇదే సమయములో స్వదేశమిల్లుల అభివృద్ధి గమ నింపతగినది.

1913-14 లో 11,710 లక్షలగజాలనుండి, 1925-26 లో 19,650 లక్షలగజాలకున్నూ, 1937-38 లో 36,620 లక్షలగజాలకున్నూ పెరిగిపోయెను.

చేనేతపరిశ్రమలో యుద్ధానంతరము కొంచెము వృద్ధికన్పడినా, అది మరల తగ్గిపోయెను.

ఈ కాలములో మిల్లుపరిశ్రమల, చేనేత పరిశ్రమల వృద్ధిక్షయములకు దోహదములైన కారణములుమూడు. (1) సుంకవిధానము (2) స్వదేశీఉద్యమము (3) దుస్తుల విషయములో ప్రజల్లో కలిగిన అభిమతాలమార్పు:—

(1) సుంకవిధానము:— భారత ప్రభుత్వమువారి సుంకవిధానము చేనేతపరిశ్రమ కన్యాయముచేసెను. మిల్లుల కుపకారము కలిగించెను. నూలుపై విధించిన దిగుమతి సుంకమువలన, విదేశనూలు చేనేతకు అందుబాటులో లేకుండపోయెను.

(2) స్వదేశీఉద్యమముకూడ చేనేత పరిశ్రమకు కొంత అపకారమే చేసెను. విదేశ మిల్లునూలుపై కల్పింప బడిన అంతు ఇందులకు ప్రబలకారణము.

(3) ఈ కాలములో బట్టలధారణ విషయములో ప్రజల అభిరుచుల్లో కల్గిన మార్పులుకూడ చేనేతకు నష్టమునే కలిగించెను. దీనికి మిల్లుపోటీ అగ్నికిపోసిన ఆజ్యమయ్యెను.

ఇంతేగాక, విదేశములనుండి కృత్రిమపు పట్టు విశేషముగ దిగుమతియైనందున, స్వదేశములోకూడ కృత్రిమపు పట్టు పరిశ్రమ అభివృద్ధి నందుటవలన, అసలు పట్టు పరిశ్రమ ఈ కాలములో క్షీణించెను.

ఈ కాలములో హిందూదేశమునుండి విదేశాలకు చేనేత బట్టల ఎగుమతులు తగ్గిపోయెను.

దేశములో (Power-looms) పవర్ మగ్గాలవ్యాప్తి కూడ చేనేత పరిశ్రమకు గొడ్డలి పెట్టయ్యెను. చేనేత వస్త్రవ్యాపారము తిన్నదెబ్బవల్ల కలిగిన అవకాశము అంతా దేశీయ మిల్లులకు చెందలేదు. ఈ కాలములోనే, చేనేతకు ప్రత్యర్థియైన (Power-loom) పవర్‌మగ్గము వాడుకలోకి వచ్చెను. గత రెండు మూడు శతాబ్దములలోనే, బొంబాయి, మధ్య పరగణాలు, బీరారు, పంజాబు, హైదరాబాదు, మైసూరులలో వ్యాప్తినందెను. బొంబాయిలో మాత్రము పూర్వము చేనేత మగ్గాలను వాడిన కేంద్రాలల్లోనే పవర్‌మగ్గాలను ప్రవేశపెట్టిరి. సాధారణముగా యివి మిల్లులలో తీసివేసినవి. వీనిని ప్రత్యేకయూనిట్లుగా ఏర్పరచినందున ఉత్పత్తిక్రయము చాల తగ్గినది. అందువల్ల ఇవి చేనేత మగ్గాలకేగాక మిల్లులకుకూడ పోటీయైనవి. ఇట్లు పవరుమగ్గాలు పెరిగిన సూరతు, భివాండి, మాలిగాన్, బరంపూరు, ఇచ్ఛాకరంజి కేంద్రాలల్లో చేమగ్గాలు పూర్తిగ నశించినవి. బొంబాయిలోని కేంద్రాలు సర్వనాశనమైనవి. 1939 లో బొంబాయిలో 2500 పవరు మగ్గా లుండెను. గాని అవి 1941 లో 6400 వఱకు పెరిగెను. ఇండియా మొత్తములో 1941 లో 15,000 పవరు మగ్గా లుండెను. భారతదేశములో ముఖ్యముగా స్త్రీల దుస్తుల్లో వచ్చిన మార్పును గమనించి, ఆ అవకాశాన్ని ఈ నూతనమగ్గాలు ఉపయోగించుకొనెను. అందువల్లకూడా చేమగ్గాలు నశించెను. ఇంతవఱకు పారిశ్రామిక రంగ

ములో త్రికోణంగా ఉన్న యీపోరాటము, పవరుమగ్గాల వ్యాప్తితో నాలుగుమూలల పోరాటమయ్యెను.

## వ్యాపారమాంద్యము: ఆరిక దుర్భిక్షము

1929–30 సంవత్సరపు ప్రపంచ ఆర్థిక దుర్భిక్షంతో చేనేతపరిశ్రమయొక్క కష్టాలన్నియు ఏకమయ్యెను. ఈ దుర్భిక్షము ఈ పరిశ్రమను పెక్కువిధముల బాధించెను.

(1) జనసామాన్యంలో కొనుగోలుశక్తి నశించుట వలన చేనేతబట్టలకు వెంటనే గిరాకి పోయెను.

(2) 1929–30 నుండి ప్రాథమిక వస్తువుల ధరలు పడిపోయెను. సామాన్యప్రజల కొనుగోలుశక్తి నశించుట చేత ఈ ధరలపతనం మఱీ ఎక్కువ యయ్యెను. ముడివస్తువుల ధరలు పడిపోయినంతగా మిల్లుబట్టలధరలు పడిపోక పోయినను చాలావరకు ధరలు తగ్గినవి.

(3) ఇట్టి అసాధారణ దుర్భిక్షమునకు విదేశపోటీ కూడ కారణమయ్యెను. 1931 తర్వాత మారకపు రేటు పడిపోయినందున బట్టలమార్కెటులో ధరలు విపరీతంగా పడిపోయెను. బొంబాయి ధోవతులు, లాంగుక్లాతు ధరలు చాలపడిపోయెను. మిల్లుపరిశ్రమ తమ ఉత్పత్తి ఖర్చులను కొంతవరకు తగ్గించుకొన్నందున విదేశపోటీని కొంత ఎదుర్కొన గలిగెను. కాని చేనేతపరిశ్రమ కట్టి అవకాశము లెవ్వియు లేకపోయెను. నూలుధరలుకూడా పడిపోయినను

దిగుమతి పన్నులవలన ఎక్కువగానే యుంచబడెను. దీని ఫలితంగా చేనేతపరిశ్రమ నాశనమయ్యెను. *

## 1930 తర్వాత చేనేత పారిశ్రామికుల స్థితి

పై నుదహరింపబడిన టారిఫ్‌బోర్డువారి అభిప్రాయమును బలపరచు సమకాలిక సాక్ష్యము చాలకలదు. విదేశమునుంచి దిగుమతియగు నూలుపై సుంకము, మిల్లుపోటీలను గురించి చాల పారిశ్రామికసంఘములు టారిఫ్‌బోర్డునకు మొరబెట్టుకొనెను. ఈ విషయంలో బొంబాయి రాజధాని ఎక్కువకష్టమును భరించెను. ప్రత్యేకరకముల గుడ్డను తయారుచేయు, బెల్గాంమువంటి కేంద్రములలోకూడ 1932న ఒకసాగుకు కూలి 12 అణాలకన్న తగ్గెను. మిల్లు పోటీగల గుడ్డలను తయారుచేయు కేంద్రాలల్లో ఈ పతనం చాలా తీక్షణంగాను, త్వరితంగాను జరిగెను. ధూళియాలో చంద్రకళ అను చీర నేయుటకు 1927లో ఇచ్చిన రు. 1-4-0 మజూరి 4 అణాలకు తగ్గెను. ఇట్లే అన్నిప్రాంతములలోను మజూరీలు తగ్గెను. బరోడా సంస్థానములోనున్న 10,000 మగ్గములకు 5000 మగ్గములు నాశనమయ్యెను.

---

* "The severe trade depression which has prevailed since 1929 has seriously reduced the average earning capacity of the hand-loom weaver. The effect of the depression has been accentuated by the relative increase in the cost of yarn on account of the protective duty. Thus the position of the hand-loom weavers incomparison with the mill industry has considerably deteriorated since 1927".- The Report of the Tariff Board of 1932 (Page 170.)

ఇతర ప్రాంతలల్లోకూడా చాలమంది వృత్తిని త్యజించిరి. మగ్గముల సంఖ్య తగ్గిపోయెను. హైదరాబాదు రాష్ట్రంలోని చేనేత పారిశ్రామికులు బ్రతుకుట దుర్భరమై, బొంబాయిరాష్ట్రంలోని మిల్లు కేంద్రాలకు వలసపోయిరి. మద్రాసు రాష్ట్రంలో పేరెన్నికగన్న కేంద్రాలన్నియు నశించెను. మధుర ధోవతులు, సేలం గుండంచు పంచెలకు గిరాకితగ్గెను. విఖ్యాతిగన్న కొర్నాడు చీరలకుగూడ ఇదేగతి పట్టెను. ఈ సమయంలో జపాను సిల్కుగుడ్డలు దేశాన్ని ముంచివేసెను. దిండిగల్లు, అరుప్పుకోట తలగుడ్డలు నశించెను. బెంగాలులోని శాంతిపూరు, ఢక్కాలలోని పారిశ్రామికులు భిక్షాపాత్రల చేబూనిరి. చాలమంది పారిశ్రామికులు ఈ వృత్తినిమాని వ్యవసాయమునకు దిగిరి.

కొన్ని పట్టణాలల్లో, పట్టణ శోభఅంతా చేనేత పరిశ్రమపై నాధారపడియుండెను. అట్టిచోట్ల పరిశ్రమ క్షీణత వలన పట్టణములే నశించెను. ఢక్కా, ఢోల్కా, కంచి, శాంతిపూర్ పట్టణము లందు కుదాహరణములు.

ఇట్లు 1930 అనంతరము చేనేతపరిశ్రమస్థితి చాల శోచనీయమయ్యెను. నిరుద్యోగసమస్య ప్రబలెను. పనిఉన్న చోటకూడ కూటికి చాలని కూలి ఇయ్యబడెను.

ఇన్నికష్టము లనుభవించినను ఇండియాలో చేనేత ఉత్పత్తి మొత్తముపై పూర్వమునకంటె తగ్గలేదని కొందరు వాదింపవచ్చును. కాని ఈ సందర్భమున మనము కొన్ని విషయములను గమనించవలెను. కొన్ని ప్రత్యేక కులముల వారిచే వంశపారంపర్యముగా నేయబడుచున్న ఈ పరిశ్రమ

విషయమున ఉత్పత్తిలెఖ్ఖలు వాస్తవిక పరిస్థితిని వెల్లడింప జాలవు. లాభము లేకపోయినచో మిల్లు వెంటనే మూత బడును. జీవనభృతికై పారిశ్రామికుడు దానిపైననే ఆధార పడియున్నాడు గనుక లాభములేకపోయినను చేనేత పరిశ్రమ సాగును. *

2. మజూరి తగ్గినపుడు, సంసారమును పోషించు కొనుటకై పారిశ్రామికుడు ఎక్కువకాలము పనిచేయును, ఎక్కువగుడ్డను తయారుచేయును.

3. మరమగ్గముల వాడుక (fly shuttle) కూడ ఉత్పత్తిని అధికంచేసెను. కనుక చేనేతపరిశ్రమ దుస్థితికి, మొత్తము ఉత్పత్తికిని సంబంధములేదు. అతడు సంపాదించిన మజూరినిబట్టియే నిర్ణయించవలెను. మజూరీల విషయమున పారిశ్రామికుని స్థితి దుస్సహముగనుండెను.†

---

* "We have to remember in this connection that production is not safe criterion in the case of an industry like hand-weaving pursued heriditarily by certain classes or castes. Mill will close down if it does not earn a profit, but the hand-loom will go on even if it brings no profit, because the weavers depend on it helplessly for their livelihood." Report of the Fact finding Committee Page 22.

† "Since the hand-loom weaver cannot regulate his production according to the rate of the market without risking starvation for himself and his family the true confession for justifying the position of the hand-loom industry is not the proportion of the quantity of cloth woven on hand-looms to the total production but the wages earned by the hand-loom weaver. Judged by the test, his position on the evidence we have received must be regarded with some concern". Tariff Board Report Page 171 (1932.)

ఈ దుస్థితివలన కలిగిన ఆవేదన ఫలితమే చేనేత పారిశ్రామికోద్యమము. దీనిఫలితంగా, పారిశ్రామికుల్లో కలిగిన ఆందోళన, ప్రచారము, ఆర్థికోన్నతికై చేసినకృషి, జరిపిన మహాసభలు, చేసిన రక్షణయాత్రలు మొదలైన వివరములకు 7 వ అధ్యాయము చూడవలెను.

## రాష్ట్రీయ ప్రభుత్వాలు, సంస్థానాలు అవలంభించిన విధానము

చేనేత పారిశ్రామికులకు సంభవించిన ఈ దుర్భర పరిస్థితి భారత కేంద్ర ప్రభుత్వమును కూడ కదలించెను. పారిశ్రామికసమస్యలపై భారతప్రభుత్వము శ్రద్ధవహించెను. ఇంతకుపూర్వము చేనేతపరిశ్రమ భారత ప్రభుత్వము నాకర్షించలేదు. అప్పుడప్పుడు రాష్ట్రీయప్రభుత్వములు, సంస్థానములుమాత్రము సహాయపడుచుండెను. వివిధ ప్రాంతములలో చేనేతకు జరిగిన తోడ్పాటును కొంత గమనింతము.

1. మద్రాసుప్రభుత్వము చేనేతయెడ మొదటినుండి శ్రద్ధవహించెను. 1906 లోనే సేలంలో మిల్లును స్థాపింప ప్రయత్నించెను. సర్ చాటర్టన్ అన్నివిషయములను సిద్ధపరచెను. కాని స్టేటుసెక్రటరి అనుమతి నివ్వనందున ఆగిపోయెను. మద్రాసు పారిశ్రామికపాఠశాలల్లో శిక్షణను ప్రారంభించెను. నూతనపరికరములను పారిశ్రామిక కేంద్రా

ల్లో ప్రదర్శింపజేసెను. ఇట్టివర్గములు 1913లోను 1922-23 లోను రాష్ట్రములో పనిచేసెను. 1932-33లో ఇది రద్దు చేయబడెను. మద్రాసులో (Textile Institute) నేత పాఠశాలను స్థాపించెను.

2. బొంబాయిలో 9 పారిశ్రామికపాఠశాలలు నెలకొల్పబడెను. "ప్రదర్శనవర్గములు" కూడ పనిచేసెను.

3. మధ్యపరగణాలు, బీరారులలో పరికరముల వ్యాప్తికై ప్రత్యేకసిబ్బంది గ్రామాలల్లో పనిచేసెను.

4. ఇట్లే యితరరాష్ట్రములందును కొంతకృషి ప్రభుత్వములచే జరుపబడినను, అందువలన పరిశ్రమకు తగినంత అభివృద్ధిగాని, పారిశ్రామికుల్లో విజ్ఞానముగాని పెరుగలేదు. ఒక మద్రాసు మాత్రమే, పరికరాలమార్పుల్లోను, విజ్ఞానములోను కొంత ముందడుగువేసెను. ఇప్పటికికూడా మన దేశం మొత్తము పైన మరమగ్గాలు 35%మాత్రమే ఉంటే, మద్రాసులో 81% వరకు ఉన్నవి.

గ్వాలియరు, కాశ్మీరు, తిరువాన్కూరు, కొచ్చిన్ సంస్థానాలల్లోకూడా పైవిధముగానే కొంతకృషి, ప్రచారము జరుపబడెను. తిరువాన్కూరులో మాత్రము కొంతఅభివృద్ధి కన్పించెను. ఇచ్చట ప్రస్తుతము మరమగ్గాలు 89%, ఉన్నవి. హైదరాబాద్‌సంస్థానములో మరమగ్గాలు 34%, చేమగ్గాలు 64%, యున్నవి. మైసూరులో చేమగ్గాలు 78%, ఉన్నవి. అస్సాములో చేమగ్గాలు 97%, బెంగాలులో 32%, ఒరిస్సాలో 85%, పంజాబులో 95% ఉన్నవి.

## ఇండియాప్రభుత్వ ద్రవ్యసహాయము

1930 నుండి చేనేత నాశనానికి కారణమైన అంశాలను నివారించడానికి రాష్ట్రీయ సంస్థాన ప్రభుత్వాల కృషి నిష్ఫలమయ్యెను. చేనేతమార్కెట్లు నశించెను. నశించిన మార్కెట్లను ఉద్ధరించుటకు తమ శక్తికిమించిన పని యనియు, మన దేశానికంతటికీ ఒకే వస్త్రవిధాన ముండవలయుననియు రాష్ట్రీయ ప్రభుత్వములు గ్రహించెను. ఇంతవఱకు వస్త్రవిధానమున కేంద్రప్రభుత్వ జోక్యమును సహించని రాష్ట్రప్రభుత్వములు కేంద్రప్రభుత్వ సహాయము నర్థించెను. తత్ఫలితముగ 1933 జూలై మాసములో పరిశ్రమలసభ జరిగెను. భారత మిల్లునూలుపై సుంకమును విధించుట చేనేతరక్షణకొకమార్గమని మద్రాసు సూచించెను. ఆ డబ్బును చేనేత సహకార సంఘాలవ్యాప్తికి వినియోగింప సూచన గావించబడెను. (Alan Lloyd) ఆలన్ లాయడ్ కేంద్ర ప్రభుత్వాదాయమునుండి ద్రవ్యసహాయమును సూచించెను. ఈ సూచన అంగీకారమును పొందెను. తత్ఫలితముగ 60 నంబరువఱకు దిగుమతియగు నూలుపై పోనుకు కానివంతున విధించిన సుంకమొత్తమును, చేనేత అభివృద్ధికై ఒసంగబడునని 1934-35 బడ్జెట్టులో తెల్పబడెను. ఇట్లు ప్రతిసంవత్సరము వచ్చిన 5 లక్షల మొత్తము ఆయారాష్ట్రములకు, దామాషా ప్రకారము పంచిపెట్టబడెను. అందువలన ఆయా రాష్ట్రములలో చేనేత సహకార

సంఘములు వ్యాప్తియయ్యెను. ఈ ద్రవ్యసహాయము మొదట 1939 వఱకు యివ్వబడెను. తర్వాత 1942 వఱకు పొడిగింపబడెను.

1935 సంవత్సరము వఱకు నిరుత్సాహకరముగ నుండి ఏ మాత్రము వ్యాప్తికలుగనటువంటి, చేనేత సహకార ఉద్యమము ఈ ద్రవ్యసహాయమువలన వ్యాప్తియై విజయవంతమైనది. ఈ కేంద్రప్రభుత్వ ద్రవ్యసహాయము 1942 లో ఆగిపోయినను, యుద్ధపరిస్థితులవలన, ఈ సహకారసంఘాలు వ్యాపారసంస్థలుగా ప్రాముఖ్యతవహించి మార్గదర్శక మైనవి. ఇప్పుడవి మద్రాసులో శాశ్వతమైన ప్రభుత్వశాఖ పర్యవేక్షణక్రింద మన నూలు, నేత వ్యాపారమునంతను గుత్తగొననున్నవి. (వివరములకు 6 వ అధ్యాయము చూడుడు.)

## ఫాక్ట్ ఫైన్డింగు కమిటి (విషయసేకరణ సంఘము)

1937 సంవత్సరములో లాహోరులో సమావేశమైన పరిశ్రమలసభ, చేనేతపరిశ్రమ విషయమును కొంత చర్చించెను. మిల్లులకును, చేమగ్గాలకు క్షేమకరమైన రాజీ ఒడంబడిక జరుగునట్లు చేయుటకై శ్రద్ధవహించునట్లు అధ్యక్షుడు వాగ్దానముచేసెను. ఈ విషయమునకూడ మద్రాసే ముందంజవేసెను. ఒడంబడికకు కొన్ని షరతులను, సౌలభ్యములను కనపరచుచు మద్రాసు ముందుకు వచ్చెను.

మద్రాసు ప్రభుత్వసూచనలు నిష్పాక్షికముగ నున్నను, రాష్ట్రీయ, కేంద్ర ప్రభుత్వముల పరస్పర సహకారము లేనిదే లక్షలమంది చేనేత పారిశ్రామికుల దుస్థితిని తొలగించుట దుస్సాధ్యమయ్యెను. మరల 1939లో పరిశ్రమల సభ, మిల్లు, చేనేత పరిశ్రమలకుగల పరస్పర విరుద్ధవిషయములను చర్చించెను. వెంటనే పై పరిశ్రమలకు గల పరస్పర విరుద్ధ విషయముల నివారణకై అభిప్రాయములను పంపవలసినదిగా, కేంద్రప్రభుత్వము, రాష్ట్రీయ ప్రభుత్వములను, సంస్థానములను, మిల్లుయజమానుల సంఘములను కోరెను. కాని వారుపంపిన యభిప్రాయములలో కొన్ని విపరీతభేదములవలన, 1940 సంవత్సరము డిశంబరు 6, 7 తేదీలలో మిల్లు ప్రతినిధులయొక్కయు, చేనేత ప్రతినిధులయొక్కయు, రాష్ట్రీయప్రభుత్వముల ప్రతినిధులయొక్కయు సభ జరిగెను. అందుజరిగిన రాజీప్రయత్నములకు ముఖ్య విషయములపైన, చేనేతమిల్లు పరిశ్రమలపోటీ లెక్కలు సరియైనవి లేకుండుట చాల నిరోధకమయ్యెను. కనుక చేనేత మిల్లు పరిశ్రమల విషయమై సంపూర్ణ పరిశీలన గావించుటకును, లెక్కలు తయారుచేయుటకును, ముఖ్య పోటీ విషయములపై సలహాల నొసంగుటకును విషయ సేకరణ సంఘము (Fact Finding Committe) నిర్మాణము చేయ నిశ్చయింపబడెను. తత్ఫలితముగ 1941లో ఇండియా ప్రభుత్వ వాణిజ్యశాఖ ఈ సంఘమును నిర్మించెను. ఈ

సంఘమువారు 1941 లో అన్ని ప్రాంతములనుచూచి తమ నివేదికను తయారుచేసిరి.

ఈ సంఘమువారు గావించిన సలహాలయందెల్ల ముఖ్యమైనది భారత చేనేత బోర్డు (Indian Hand-loom Industry Board) నిర్మాణము. ఇట్టిబోర్డు నిర్మాణము జరుగ వలయునని మేము 1938-39 సంవత్సరములలో 'నేత పరిశ్రమ' ద్వారా ఆందోళనచేసితిమి. ఇప్పుడీబోర్డు నిర్మాణముచేయబడి పనిచేయుచున్నది. చేనేత పరిశ్రమాభివృద్ధికై అన్నిశక్తులను కేంద్రీకరించి పనిచేయుటయే దీని ప్రధానోద్దేశము. ఇందు మూడుశాఖలున్నవి. (1) పరిశోధనలు (2) ముడిసరకుల సప్లయి (3) మార్కెటింగు, ఈ మూడుశాఖల నిర్వహణమునకు మూడు ప్రత్యేక కమిటీలు పనిచేయుచున్నవి. చేమగ్గాలకును, మిల్లులకు గల పోటీని తగ్గించుటకు పరస్పర అంగీకారముపై ఒడంబడిక జరుగ వలయుననునది రెండవసలహా. *

---

* ఈ నివేదికానంతరము తీవ్రయుద్ధపరిస్థితులవలన పైకమిటీవారు చర్చించి సూచించిన సలహాలు చాల తారుమారయ్యెను. యుద్ధానంతర పరిస్థితులలో చేనేతపరిశ్రమ నూతనసమస్యల నెదుర్కొనవలసివచ్చెను. దేశములో వ్యాపించిన విపరీత ఆహార, వస్త్ర క్లిష్టపరిస్థితులలో ప్రభుత్వ నిర్వహణమును స్వీకరించిన జాతీయనాయకులు వస్త్రపరిశ్రమ సమస్యను జాతీయదృక్పథమున నివారింప మహాత్ముని నాయకత్వమున, మహాత్ముని సిద్ధాంతముల ననుసరించుచున్నారు, ఇందుకుకూడ మద్రాసు ముందంజ వేసినది. [పూర్తివివరములకు చివరఅధ్యాయము చూడుడు.]

# ప్రత్తి: రాటం



ప్రపంచములో నూలువస్త్రముల వాడుక చాలా అధికం. ధృవప్రాంతంలో ఎస్కిమోలు తోళ్ళతో చేసిన దుస్తులు ధరించినా, శీతలదేశవాసులు కొందఱు ఉన్ని ఉడుపులు వాడినా, అత్యుష్ణదేశవాసుల్లో ఏకొద్దిమందో సిల్కు లుపయోగించినా, జనసామాన్యానికంతా అందుబాటులో ఉన్నవీ, సామాన్య ప్రజలంతా వాడేవి నూలుబట్టలే! ఈ నూలు వస్త్రాలవిషయంలో భారత దేశం అనాదినుండీ స్వయం సమృద్ధమై యుండేది. వేదకాలంనాటికే భారతదేశంలో వస్త్రపరిశ్రమ ప్రసిద్ధికెక్కింది. ఆర్యులు సన్నని నూలు వస్త్రాలను ధరించేవారు. ఆర్యస్త్రీలు తమ గృహాల్లో వస్త్రాలను నేసేవారు. ఆవస్త్రాలకు కావలసిన ప్రత్తినంతా వారే వారి భూముల్లో పండించేవారు. ఆప్రత్తిని శుభ్రపరచి సన్నని నూలు వడికేవారు. ఆనూలుతోనే వారు బట్టలు తయారు చేసేవారు. కనుక ఆనాడు భారతదేశంలో వస్త్రాలను తయారుచేయుట సర్వత్ర వ్యాపించిన సాధారణపరిశ్రమగా ఉండేది. కాని, నేడు భారతభూముల్లో పండిన ప్రత్తి వస్త్రాలుగా తయారై వచ్చేలోపల ఎన్ని యంత్రాలల్లో ఎన్ని మార్పులు చెందుతున్నదో తెలిసికొనుట కది ఒక చిత్ర కథగా నుండును. ఇప్పుడు ఇంత గొప్పయంత్ర పరిశ్రమ నభివృద్ధిచేసి దేశదేశాలను తమ వస్త్రాలతో నింపివేసిన

పాశ్చాత్యులకు 400 సంవత్సరాల క్రిందట ప్రత్తి అంటే ఏమిటో, అది ఎట్లా లభ్యమౌతుందో అన్న విషయంకూడా సరిగా తెలియదు. ఈ విషయం అతిశయోక్తిగా కన్పింపవచ్చు. కాని ఈక్రింది కొన్ని చరిత్రాంశముల వలన పై విషయం రూఢియగును.

ప్రత్తిని గురించి పాశ్చాత్యుల్లో చాల వింత యభిప్రాయాలు వ్యాపించియుండేవి. మధ్యయుగంలో యూరపులో వ్యాపించిన ఈ వింత అభిప్రాయాలే 17 వ శతాబ్దము చివరవరకు నాటుకొనియున్నవి. ఈ విషయాలు చదివేటప్పుడు, ఇవి నిజమా లేక, మనమొక కట్టు కథను చదువుచున్నామా! అని చదువరులు కన్నులు నులుముకొనక తప్పదు.

"భారత దేశంలో ఒక వింతయైన చెట్టు ఉండేది. ఆ చెట్టు పై శిఖరమున ఒక చిన్న గొఱ్ఱె ఉండేది. ఆగొఱ్ఱెకు రక్తము, మాంసము, ఎముకలు ఉండేవి. తోడేళ్లు వాటిని తినేవి. ఆగొఱ్ఱెకు ఆకలివేసినప్పుడు చెట్టు వంగేది. అప్పుడు ఆగొఱ్ఱె ఆచెట్టుచుట్టూ ఉండే మేతమేసేది. ఇట్టి గొఱ్ఱె బొచ్చు తెల్లగా ఉండేది. ఆఉన్నిని కత్తిరించి, ఏకి, వడికి ఇండియా దేశంలో నాజూకు వస్త్రాలు నేసేవారు."

కొంత కాలానికి యీ అభిప్రాయంలో మార్పు వచ్చింది. పైన సూచించిన చెట్టు పువ్వులు పూచి, కాయలు కాచి, కాయలుపండి, పగిలినప్పుడు ఆకాయలలో చిన్నచిన్న గొఱ్ఱెలు ఉండేవనిన్ని ఆ గొఱ్ఱెలపై నుండే బొచ్చు కత్తి

రించి భారతదేశంలో వస్త్రాలు నేసేవారనిన్నీ ఆంగ్ల ప్రజా సామాన్యం చెప్పుకుంటూ ఉండేది.

ఈకథ మూడవ ఎడ్వర్డుకాలంలో జాన్ మాండవిల్ ద్వారా ఇంగ్లాండులో ప్రవేశించింది. ఇతడు క్రీ. శ. 1322 లో తన దేశమును విడిచి 30 సంవత్సరాలకు పైగా యూరేపియాలో తిరిగెను. ఇతడు తన ప్రయాణచరిత్రను వ్రాసెను. అందీ ప్రత్తిచెట్టునుగూర్చిన వింతసమాచారముకూడ వ్రాసెను. ఈతని కథనము నాదేశీయులు అనుమానించక విశ్వసించిరి. ఈతని సమకాలికుడు 'ఒడోరికస్' అను ఇటలీదేశస్తుడుకూడా ఈ గొఱ్ఱె చెట్టు కథనే వ్యాప్తిచేసెను. ఇట్లే ఇతర ప్రయాణికులును గ్రంథ కర్తలును, గతానుగతికులై, ఈ.కథనే నమ్మి వ్యాప్తి చేసిరి.

1641 లో కీర్చర్ అనునతడు ఈకథను ఖండించి, ప్రత్తియొక్క వాస్తవస్వరూపమును వర్ణించి చెప్పెను. తర్వాత 1725 లో బ్రెయన్ అను జర్మనీడాక్టరు ఈగొఱ్ఱె చెట్టుకథ అబద్ధమని రాయల్ సొసైటీవారికి తెలియజేసెను. మధ్యయుగంలో పాశ్చాత్యులింతటి మౌఢ్యమున నున్నారనుటకీ విషయాలు ప్రబలతార్కాణము.

కాని, క్రీస్తుపూర్వమే కొందఱు పాశ్చాత్య చరిత్ర కారులు ప్రత్తినిగుఱించి సరియైన విషయాలే వ్రాసి యుండిరి. వారిలో 'హెరొడోటస్' అను గ్రీకుచరిత్రకారుడు ముఖ్యుడు. క్రీస్తుపూర్వము 484 లో ఇతడు జన్మించెను. ఇతడు తన స్వదేశమును విడచి, యూరేపియా, ఆఫ్రి

కాలలో చాలకాలము తిరిగెను. ఇతడు తాను స్వయముగా చూచినవిషయాలనే గ్రంథములో వ్రాసెను. ఇండియా లోని ప్రత్తిచెట్లనుగుఱించి, ఆత డిట్లు వ్రాసెను. "ఆ దేశము లోని ప్రత్తిచెట్లు ఉన్నికంటె అందమైనట్టియు, శ్రేష్ఠమై నట్టియు దూది నిచ్చును. ఆ దేశీయులు, ఆదూదితో తయారుచేసిన వస్త్రాలను ధరింతురు." ఈజిప్టు నుండి గ్రీసురాజుకు పంపబడిన బహుమతి యొకటి ఇండియా దూదితో పొదుగబడియున్నదనియు, ప్రత్తినుండి గింజలను వేరుచేయుట కొకసాధన మున్నదనియు అతడు వేరొకచోట వ్రాసెను. ప్రత్తిస్వభావము, దూది ఉపయోగములను గుఱించిన సమాచారమంతయు అలెగ్జాండరుతో దండ యాత్రకు వచ్చిన యుద్యోగులు యూరపునకు తీసుక వెళ్లి రనుట నిస్సందేహము. అలెగ్జాండరు సైనికోద్యోగి 'నేర్కసు' ఇండియాలో ప్రత్తి పెంపకమునుగూర్చియు, తల గుడ్డలు, చొక్కాగుడ్డలు, దుప్పట్లు మొదలగు వానిని తయారు చేయుటను గుఱించియు వ్రాసెను. క్రీస్తుకు 5 శతాబ్దము లకు పూర్వమే, 'హిరోడొటస్' మన దేశంలోని ప్రత్తిచెట్లను గూర్చి నిజమైన విషయం వ్రాసెను.

మనుస్మృతిలోకూడా ప్రత్తినిగూర్చిన ఉదాహరణ లున్నవి.

ప్రాచీన నాగరికతగల కొన్ని ఇతర దేశములలోని సంఘటనలుకూడా మన దేశములోని వస్త్రపరిశ్రమయొక్క ప్రాచీనతనే రూఢిపరచుచున్నవి.

పర్షియా దేశపు రాజు 'అహాసేరస్' క్రీ. పూ. 519 లో ఇచ్చిన విందుసందర్భమున ఆకుపచ్చ, బ్లూరంగుల తెరలు వాడబడినవనియు, అవి ఇండియానుండి వచ్చినవనియు, "ఎస్తర్" అను గ్రంథమున వ్రాయబడినది. ఈవిషయం మన దేశంలోని అద్దకపుపరిశ్రమయొక్క ప్రాచీనతకు కూడ చక్కని దృష్టాంతము. గ్రీకులు, రోమనులు ప్రాక్ దేశీయుల ఆచారవ్యవహారములను చూచి సూర్యకిరణముల కష్టుగ గుడ్డతెరలను వాడిరి. సీజరుచక్రవర్తి తన నివాస స్థలము నుండి 'కాపిటోలిక్' కొండవరకు గుడ్డతెరలు కట్టించెను.

ప్రత్తిని గూర్చి వేరొక ప్రాముఖ్యమైన సమస్య కలదు. ప్రత్తిచెట్టు ప్రథమమున ఇండియాలోనే ప్రవర్ధమానమై తర్వాతనే ఈజిప్టు, ఆఫ్రికా, అమెరికాలకు తీసుకపోబడినదా? లేక పై ఇతర దేశములలోకూడ అనాదిగ ఉన్నదా? ప్రత్తిపంట, వస్త్రపరిశ్రమ హిందూదేశమున అతి ప్రాచీనములైనను, ఆఫ్రికా, అమెరికాల యందుకూడా అనాదిగ ప్రత్తి దేశీయమైన పంటయైయున్నట్లు కొన్ని చరిత్రాంశములవలన మనకు తెలియుచున్నది క్రీ. శ. 1492 లో కొలంబస్ బహమాదీవులను చేరినప్పుడా దేశీయులు మారకమునకై, ప్రత్తి, నూలు త్రాళ్లు తెచ్చిరని కొలంబస్ వ్రాసెను. పడమటి ఇండియాదీవులలోనే గాక, మధ్య దక్షిణ అమెరికాలలో ప్రత్తిపెంపకము, ఉపయోగములు నాటికే యున్నవి. మెక్సికోలోని పురాతన నాగరికులు ప్రత్తి నుపయోగించిరి. 1522 లో 'పెరు' రాజ్యమును 'పిజారో' ఆంగ్లేయుల కిచ్చినపుడు, అచ్చట ప్రత్తి, వస్త్ర పరి

శ్రమ విరివిగా వ్యాపించియుండెను. వాస్కోడిగామా తర్వాత ప్రయాణీకులు కొందఱు 1516 లో దక్షిణాఫ్రికాలో దిగినపుడు ఆ దేశీయులు నూలు వస్త్రములను ధరించుటను చూచిరి. కాని ఈజిప్టులో మాత్రము 17 వ శతాబ్దము వరకు ప్రత్తిపంట లేదు. తర్వాతనే అచ్చట ఈపంట ప్రవేశించినది. ఇప్పు డీజిపు ప్రశస్తమైన దూదిని విరివిగా పండించి ఇంగ్లాండుకు పంపుచున్నది. ఇండియావలె పురాతన నాగరికత గల ప్రాక్ దేశములలో చైనాకూడ ప్రత్తిపంట కతి ప్రాచీనమైనదే! క్రీస్తు పూర్వమే చైనీయులకు కాగితములు చేయుటకూడ తెలియును కదా!

ఇప్పు డన్నిచోట్ల ప్రత్తి విరివిగ పండింపబడి, సమస్త పరిశ్రమలయందును, యంత్రాగారముల యందును ఉపయోగింపబడుచున్నది. వివిధములైన శీతోష్ణస్థితులను బట్టియు, నేలస్వభావమును బట్టియు ప్రత్తిలో వివిధములైన రకము లేర్పడినవి. పొట్టిపింజ దూది రకములకన్న పొడుగుపింజ దూదిరకములు సన్ననినూలు తీయుటకు మిక్కిలి అనుకూలములై ప్రశస్తముగా నెంచబడుచున్నవి. డక్కను పీఠభూమిలో విరివిగ పండింపబడుచున్న ప్రత్తికంటె అమెరికా, ఈజిప్టు రకములు చాలశ్రేష్ఠమైనవి. ఇటీవల మన దేశములో కూడ కాంబోడియామాదిరి ఉత్తమరకములు పండించుటకై తగిన ప్రోత్సాహ ప్రయత్నములు చేయబడుచున్నవి. మన దేశంలో కేంద్రప్రత్తి సంఘమువారు, కొన్ని పరిశోధనలు గావించి దానివ్యాప్తికై పాటుపడుచున్నారు.

మిల్లునూలు పరిశ్రమవిషయ మెట్లున్నను, శ్రేష్ఠమైన దూదిని పండించుట, ఖాదీ పరిశ్రమాభివృద్ధికి మిక్కిలి తోడ్పడును. యుద్ధపరిస్థితులు ఖాదీవ్యాప్తికి చాల అనుకూలమును గల్పించెను. రాజకీయ, ఆర్థికదృష్టితో చూచినను, ఖాదీఉత్పత్తిని అధికముచేయుట అత్యవసరము. కాన వినిమయమునకు తగినంత ఉత్పత్తి నధికముచేయుటకై మన మన్నివిధముల ప్రయత్నింపవలయును.

ఖద్దరు నూలు ఉత్పత్తికి అవసరమైన పరికరాలల్లో మొదటిది ప్రత్తిరాటము. దీనితో ప్రత్తిలోని గింజలను వేరు చేయుదురు. మన దేశీయులు పూర్వం నుంచి మన గ్రామాలల్లో వాడే రాటముతో గింజలు విడతీయునప్పుడు దూది కొంత తెగిపోతూఉంది. దూది " ఏసి " (పింజ) తెగిపోతే సన్ననూలుతీయటం కష్టము. పైగా గింజలు తీసేటప్పుడు గింజలు నలిగి కొంతభాగము దూదికిఅంటుకొని పక్కుల రూపంగా బయటికి వస్తూఉంది. దీనివల్ల నూలు సాఫీగా, సన్నగా వడుకుటకు వీలులేదు. అందుచేత ప్రత్తిగింజలు తీసే రాటాన్ని సున్నితంగా పనిజేసేటట్లున్నూ, అతివేగంగా పని జరిగేటట్లు సవరణచేయాలి.

ఏకులుచేయడంలో ఏకు గట్టిగా ఉండకూడదు, అతి మెత్తగాను వదులుగాను ఉండకూడదు. ఏకుల ఉత్పత్తి విధానంలో కూడా తగినంత మార్పు అవసరం. ఏకు సరిగా లేకపోతే తరుచుగా పోగుతెగుతూ ఉంటుంది. కాలం వృథాగా పోతుంది.

మనం నూలువడకటానికి అనాదినుంచీ ఉపయోగించే రాటం యీనాటికీ మన గ్రామాల్లో ఉపయోగిస్తున్నాము. ఈ రాటము ఇంట్లోఉండి వడుకుటకే ఉపయోగపడుతుంది. కదురుదిండు చుట్టుకొలతకన్నా, చక్రంయొక్క చుట్టుకొలత యెంత యెక్కువ ఉంటే అంతవేగం హెచ్చుతుంది. ఈ రాటంలో కదురుపెట్టు చెవులు కొయ్యతో చేసిన వాటికంటె తోలుతోచేయబడిన చెవులు ఉపయోగిస్తే త్వరలో అరిగిపోవు. కదురు వేగంగాతిరుగుటకు సహాయపడును. వార్ధారాటం (పెట్టెరాటం) ప్రయాణంలో మనవెంట తీసికొని వెళ్లుటకు చాలఉపయోగకారి. మనకు ఎక్కడ విశ్రాంతి దొరికితే అక్కడ వడుకుటకు చాల బాగున్నది.

మనకు ఖాదీఉత్పత్తి పెరగాలంటే ప్రత్తిగింజలు తీయటం, ఏకులుచేయుటం, నూలువడకటం వరకు జరిగే ప్రతిపనికి ఉపయోగించేసాధనలు ఉత్తమరకంగాను, వేగాన్ని ఉత్పత్తిని హెచ్చించుటకు వీలుగాను ఉండాలి.

గృహపరిశ్రమగా ఉండి, నూలును వేగంగా వడికి వుత్పత్తిని పెంచుటకు వీలైన రాటము కనిపెట్టినవారికి లక్ష రూపాయలబహుమానం ఇస్తామని గాంధీగారు చాలరోజుల నాడే ప్రకటించారు. కాని మహాత్ముడు సూచించినవిధంగా యింకా రాటం నిర్మాణం జరుగలేదు. మగన్ వాడాలో తయారైనరాటము, హంసరాజ్ తయారుచేసిన రాటములగురించి పత్రికలలో ప్రకటన జరిగిందే గాని, అవి వ్యాప్తికిరాలేదు. మంగళగిరిలో ఒక యువకుడు, 'బార' తీయకుండా ఏకను పట్టుకుంటె పురిపోసుకుంటూనే, నూలు కదురుకు చుట్టుకొనే

ట్లుగా ఒక రాట్నాన్ని తయారుచేసెను. కాని దానికి తగినంత వేగము వచ్చునట్లు చేయవలయును. కదురుచుట్టు యినపచక్రాలు యెక్కువైనందున కటువైనధ్వని కలుగుచున్నది. దానిని తగ్గించవలయును. రాటముయొక్క ఖరీదు సుమారు నూరురూపాయ లగుచున్నది. చాలభాగము ఇనుముకుబదులు, కొయ్యను ఉపయోగించి బరువును, ధరను తగ్గింపవలయును.

మనకు నూలువడుకుటలో వేగాన్ని పెంచే రాటము అవసరము. శాస్త్రజ్ఞులు, పారిశ్రామికవేత్తలు, అఖిలభారత చరఖాసంఘమువారు, అఖిలభారత గ్రామపరిశ్రమల సంఘమువారు త్వరలో తగినకృషి చేయగలరని నమ్ముచున్నాము. ప్రభుత్వము కూడ అట్టి పరిశోధనకు తగిన అవకాశాన్ని, ప్రోత్సాహాన్ని కలిగించవలయును.

---

# చేనేత పరికరములు



భారత దేశంలో చేనేత పరిశ్రమ అతిప్రాచీనమైన దైనా, భారతవస్త్రకారులు డక్కామజ్లిన్లవంటి వలిపము లను, చీని చీనాంబరములను నేసినా, పొందూరులో నూరు, నూటయేబది నంబర్లకు సరిపోవు ప్రశస్తమైన వడుకునూలు తయారైనా, పద్మములనుండి, సాగనారనుండి తంతువులను తీసి వస్త్రకళావేత్తలు చౌకములు నిర్మించినా, బెనారస్ పట్టుచీరెల్లో తరులతా పుష్పశోభితమైన చిత్రసృష్టి సరిగ (జరీ) లో జరిగినా, చేనేత పారిశ్రామికులు సర్వసాధార ణంగా ఉపయోగించే పరికరములు ముప్పదిసంవత్సరాలకు పూర్వం ప్రాచీనమైనవిగానే ఉన్నవి. వానిలో గమనింప తగిన మార్పొద్దియు జరిగినట్లు తెలియదగిన ఆధారములు లేవు. మన దేశంలో అనాదిగా వస్త్రం తయారుచేయ డానికి ఉపయోగించే 'మగ్గం' అనే పరికరము చాల సులభ మైంది. అందులో చిక్కులు ఏవీ లేవు. అది ఒక చక్కని పలకబద్ద. కుటీరాలవంటి మన హిందూగృహాల్లో ఎచ్చోట నైనా ఒకచోట మోకాలిలోతు గుంటత్రవ్వి, దానిపైన ఆపలకను వ్రేలాడగట్టే ఏర్పాటుచేస్తే-అది వస్త్రం తయారు చేసే మగ్గం అవుతుంది. దానికి ముందు 'దోనె' అనబడే ఒక 4 అంగుళముల చౌకంగల 2 గజముల పొడవైన ముక్క అమర్చి, దానికి వెనుకగా రెండు మూడు గజాల ఖాళీస్థలండున్నచో సరిపోతుంది. ఇట్టిసాధారణ పరికరాలతోనే

పూర్వంనుంచీ మన స్త్రీలు వస్త్రాలు తయారు చేస్తూ వచ్చారు. ఇండ్లల్లో స్త్రీలు కుటుంబానికి సరిపొయ్యేనూలు వడికేరోజు లవి. వస్త్రాలను తయారుచెయ్యడం మాత్రం కొందఱికి వృత్తిగ ఏర్పడియుండేది. అట్లు నేతవృత్తిగా ఉండే సంసారాలల్లో పురుషులు, స్త్రీలు, పిల్లలు అందఱు నేతపని చేసేవారు. కృషికి తగిన ఫలితము, అభిమానము, గౌరవాలు ఉండేవి వారి కాలోజుల్లో. కనుక కాలంతో పందెం పడకుండానే, కడుపులో, చల్ల కదలకుండానే వస్త్ర సృష్టి చేసేవాడు నాటి వస్త్రనిర్మాత, అయినా అతనికి పైన వచెప్పిన 'మగ్గం' 'దోనె' అనే పరికరాలేగాక, చిన్న పని ముట్లు చాల అవసరమై యుండేవి. ఇవన్నీ స్వల్పఖరీదు వే. ఐనా, ఇంటినిండా కొయ్యముక్కలు చీకాకుగా ఉండక తప్పదు. అట్టి నేతపరిశ్రమ ఆధునిక యుగంలో యంత్రాల పోటీని ఎదుర్కొనవలసివచ్చింది. అందుచేత పారిశ్రామి కుడు ఎక్కువ కాలము కృషి చేయుటయే గాక, ఎక్కువ వేగంగా నేయవలసివచ్చింది. అందువల్ల పరికరాలల్లో మార్పు తప్పని సరి అయింది. ఈ మార్పు ఎట్లా జరిగిందో ఎంతవరకు జరిగిందో తెలుసుకుందాం. మిల్లుపరిశ్రమతో ప్రత్యక్షపోటీకి నిలువవలసిన ఈవృత్తిలో కృషికి తగిన ప్రతి ఫలం తగ్గుచున్నందున, తక్కువకాలంలో ఎక్కువ నేత నేసి ఎక్కువ ప్రతిఫలం (మజూరి) పొందటానికి తగినట్లు పరికరా లల్లో మార్పు ఇంకా రావలసియున్నది. అట్టిమార్పు రాక పోతే, ఈ చేనేతపరిశ్రమ నేటి పారిశ్రామిక యుగంలో నిలువజాలదు. ఇప్పుడు ముఖ్యంగా నేత కుపకరించేవి.

విధిగా అవసర మయ్యేవి, అగు పరికరాలనే పరిశీలిస్తాము, నేతకు అవసరమయ్యే పనిముట్లు చాల ఉన్నవి. మొదట నూలును 'పడుగు' పోయుటకు 'డబ్బా'ల పైన చుట్టవలెను. పూర్వం 'డబ్బా'లకు బదులు 'పంటె' లుండేవి. ఇప్పుడు రాటాల సహాయంతో డబ్బాలపై చుట్టుచున్నారు.

ఈ చుట్టిన నూలును, మనకెంతపొడవుగుడ్డ కావాలో అంత పొడవున పోయుటకు 'ఆసు' అను చిన్న సాధన ముండేది. దీనిపైన దినమునకు 4 లడ్డీలు (పిల్లు) మాత్రమే ఒకవ్యక్తి పోయగలడు. ఇప్పుడు 'మరాసు' అను పెద్ద చక్రముగల చిన్నయంత్రాన్ని వాడుచున్నారు. దీనివద్ద ఇద్దరు వ్యక్తులు పనిచేస్తే దినానికి 120-160 లడ్డీల నూలును పడుగు పొయ్యగలరు. ఇట్లు తయారైన పడుగులను (Warps) నేతకుపయోగించుటకు ముందు గంజి పట్టించవల యును. దీనిని పడుగుచేయుట (Sizing) అంటారు. సాధా రణంగా ఈ పని వీథులలోనే చేయబడుచుండుట మనకు పరిచయమైన దృశ్యమే. సరిచేయుటకు గంజితొట్లు, లాకలు అనగా పొడవైన వెదురుబద్దలు, గంజిపట్టించిన నూలు నునుపుగ వచ్చునట్లు చేయుటకు 'కుంచె' (Brush) మొద లైనవి అవసరము. ఈ సరిచేయుపని 10 లడ్డీలకు ఇరువురు వ్యక్తులకు నాలుగుగంటలు పట్టును. మండు వేసవియందును, వర్షాకాలములోను, ఈపని వీథులలో చేయుటకు వీలుండదు. కాన వారు పనిలేక నష్టపడుదురు. కనుక పడుగుచేయుటలో తగిన పరికరములు దొరకు ఏర్పాట్లుచేయుట మంచిది. ఇట్లు తయారైన 'పడుగు'ను 'అచ్చు'నకు ఒక్కొక్క పోగు

వంతున అతికించవలయును. దీనినే అచ్చు అతుకు టందురు. ఇది చాల కష్టమైనపని. పదిలక్షల పడుగు అతుకుటకు నేర్పరియైనవానికి 5 లేక 6 గంటలు పట్టును. 'అచ్చు'న కతికించబడిన పడుగును సాపుచేయుటకు 'అల్లు' కట్టుట లేక 'మొల' కట్టుట యందురు. ఈ పని ఇరువురకు 2 లేక 3 గంటలు పట్టును. సిద్ధమైన 'అల్లు'ను మగ్గమునకు తగి లించి నేత ప్రారంభింతురు. ఈ అల్లులో పొడవుగ నున్న పోగులను పడుగందుము. పేకనూలును 'ఊచ'లపై కండెలు చుట్టుదురు. ఈ కండెలను 'నాడి'లో నుంచుదురు. 'అచ్చు'వలన అల్లులోని నూలుపోగు లన్నియు రెండుభాగ ములై 'అని' ఏర్పడును, ఈ 'అని'లోగుండా 'నాడి' ఒక ప్రక్కనుండి వేరొకప్రక్కకు పోవును. అప్పుడాపోగును 'పలక' దట్టించును. మరల 'అని' ఏర్పడిన 'నాడి' రెండవ వైపునకు పోవును. నాడిలోనుండి వచ్చునూలునే 'పేక' యందుము. ఇట్లు పడుగుపేకల కలయికవలన వస్త్రము తయారగుచున్నది.

ఇట్లు సాధారణమైన గుడ్డలను నేసే పరికరమే మగ్గము. అయితే ఇందు వస్త్రనిర్మాత, తన రెండుకాళ్లను మోకాలి లోతుగుంటలో ఉంచి తన రెండుపాదములక్రింద రెండు చెక్కలను ఒకటి మార్చి ఒకటి త్రొక్కుటద్వారా అని ఏర్పడుచున్నది. రెండుచేతులు పనిచేయుటవలన నాడి ఇటు నటు తిరిగి పేక అల్లుకొనుచున్నది. ఇట్లు కాళ్లు, చేతులు, కండ్లు ఒకేపర్యాయము పనిచేయవలయును. ఇట్టి నేత చాలఆలస్యము, దినమునకు రెండుమూడు గజములకంటె

ఎక్కువబట్ట తయారుకాదు. ఇప్పుడు వాడుకలోనికి 'మర మగ్గము' (Fly Shuttle loom) వచ్చినది. ఇందులో నాడి (Shuttle) నిలుచుటకు రెండువైపుల తొట్లుండును. అందు వలన వస్త్రనిర్మాత తన చేతనున్న దారముచేత 'నాడి' నిటునటు పరుగెత్తించును. ఈపని ఎంతవేగముగ జరిగిన అంతఎక్కువగుడ్డ తయారగును. ఈ ఫ్లైషటిల్ మగ్గాలపైన దినమున కెనిమిదిగంటలు పనిచేసినచో 10 గజముల గుడ్డ తయారగును. ఈ మగ్గం 1910 నుండి వ్యాప్తికి వచ్చినది. చట్టముపైనున్న మరమగ్గమును (Frame-loom) మద్రాసులో 1908 సం॥లో జరిగిన అఖిలభారత నేతపందెములు, ప్రదర్శనములో ప్రదర్శించిరి. దీనినే తగినమార్పులతో పిట్‌లూమ్, గుంటమగ్గముగా మార్చి దేశీయు లుపయోగించిరి. మరాను (Warping Machine) కూడ అప్పటినుండియే వాడుకకు వచ్చినది. ఆంధ్రజిల్లాలలో వీనివ్యాప్తికి కీ॥ శే॥ శ్రీ కార్యంపూడి వెంకటకృష్ణకవిగారు చాల పాటుపడిరి. వీరు మద్రాసు నేతపోటీలో ప్రథములుగా నెగ్గి, పతకమును పారితోషికమును పొందిరి. పంటెల వాడుకను పోగొట్టి రాట్నముల వాడుకను వ్యాప్తి చేసిరి. 'డబ్బా'లను బొంగుతో తయారుచేసి, వాని ఉపయోగమును ఇనుమడింపజేసిరి. ఇట్లు వీ రాంధ్రజిల్లాలలో క్రొత్తపరికరాల వ్యాప్తిని తీసుకవచ్చుటకు పడినశ్రమ యింతింత తనరాదు. వారి కృషియొక్క సత్ఫలితమును నేడంతట చూచుచున్నాము. దక్షిణప్రాంతములలో 'కుప్పడము' చాల విరివిగ నున్నది. దట్టి కుప్పడము నేతకు అంచులవద్ద పది సంవత్సరములకు

మించని వయస్సుగల పిల్లలు పనిచేయుదురు. చిన్న పేట్లను (Designs) నేయుటకూడ సర్వత్ర ఉన్నది. కాని యీ పేట్లు (Designs) నేయుటకుకూడ చిన్నపిల్లలసహాయ మవసరము. కాని ఇప్పుడు 'డాబీల' వాడుకవలన ఎంత క్లిష్టమైన పేట్ల నైనను ఇతరుల సహాయములేక ఒక్కవ్యక్తి నేయగలుగు చున్నాడు. నేడు ప్రజల అభిరుచి పేట్లపైన ఎక్కువగ నున్నది. ఈ 'డాబీ'ల పైన సాధ్యముగాని పేట్లకుమాత్రం 'పిల్లవాడులాగు అడ'(Draw boy barness)ల నుపయోగించు చున్నారు. ఇప్పుడు పట్టణములలో మగ్గములకు తగినంత విశాల మైన గృహములు లభించుట కష్టమగుటవలన 'కుఱుచమగ్గ ములు' (Beam-looms) ఏర్పడినవి. ఈ మగ్గమునకు రెండు గజముల స్థలము చాలును. కాని దీనికి ఫ్లైషటిల్ మగ్గమున కంటె వేరొక 'దోనె' అవసరము.

'ఆవిరిపై పనులు చేయుటకై (Sizing) అమల్నాదు గారు (Principal, Textile Institute, Madras) ఒక చిన్న యంత్రమును ఏర్పాటుచేసిరిగాని, అది ముతకనూలునకే ఉపయోగించుచున్నది. అందునను వర్షాధిక్యముచే పని కాటంకములు కలుగు మలబారుప్రాంతములలో కొంత పని చేసినదికాని ఇది సర్వత్ర ఉపయోగమునకు రాలేదు. దీని సంపూర్ణ ఉపయోగమునకై కొన్ని మార్పులు జరుగవల యును. షోలాపురమువంటి చేనేతకేంద్రములలో 'డబ్బా' లపై నూలుచుట్టుటకుకూడ చిన్నయంత్రము లుపయోగ మున నున్నవి. వీనివాడుక యితరచోట్లకూడ ప్రోత్సహింప తగినది.

---

# చేనేత చిత్రకళ

## కళాప్రాశస్త్యము

సీ॥ రామాయణంబు భారతము నేతలలోన
తళుకొత్తనేసిన ధన్యమతులు
పండువెన్నెలకంటె బలుచనౌవస్త్రముల్
తీరుగా నేసిన ధీరవరులు
కులవృత్తి తలదాల్చుకొని మానవుల యభి
మానంబుగాపాడు మనుజమణులు
సూదితో బనిలేక చొక్కాలు కోటులు
మగ్గంబుపై దీర్చు మహితయశులు
గీ॥ పూర్వమున వస్త్రకారక పుణ్యమూర్తు
లలరజేసిన వృత్తివిద్యాదికములు
జీర్ణమైపోవుచున్నవి చివికి చివికి
ఉద్ధరింపుడి యవ్వాని, యోగ్యులార॥

వేదములకంటె ప్రాచీనమైన భారత వస్త్రపరిశ్రమ ఖండాంతరములయందు సహితము మన్ననల నందుటకు భారతవస్త్రకారుని యసమానకళాప్రావీణ్య మొక కారణము. రాజులు, ప్రజలు భారతవస్త్రపరిశ్రమను, కళను ఆదరించి పోషించిన నాటిదినములలో భారత వస్త్రకారుడు తన నిర్మాణశక్తిని, కాలమును, కళాప్రావీణ్యమును నిశ్చింతతో చిత్రకళాసృష్టికై వినియోగించి కృతార్థుడైనాడు.

అఖండ కళావిన్యాసమును వెల్లడించు సాదృశ్యములు పెక్కులు కాలగర్భమున లీనమైపోయినను, కొన్ని ప్రపంచ చరిత్రయందు విద్యుద్దీపములవలె ప్రకాశించుచున్నవి. అతి సున్నితములై, ధరించిన కనబడీ కనబడనట్లుండు ఢక్కా మజ్లిన్లకు దేశాంతరములయందు సహితమున్న ఖ్యాతి, నేటికి ఏ ఇతరవస్త్రమునకైన లేదుకదా! భారతదేశమున నిట్టి చిత్రవస్త్రకళాపరిశ్రమ కాలక్రమమున నెట్లు క్షీణించి నదియును ద్వితీయాధ్యాయములో వివరించితిమి. కాని ఈస్టిండియా కంపెనీవారు తూర్పు సముద్రతీరమున వ్యాపారము సాగించునాటికికూడ భారత వస్త్రకారుడు చిత్ర చిత్రములైన వస్త్రముల సృష్టిచేయుచుండెను. నామమచిలీ పట్టణమునను, దాని పరిసరములలోను తయారుచేయబడు చుండిన కలంకారీ అద్దకములును, ఢక్కా మజ్లిన్లవంటి అతి సున్నితములైన వస్త్రములును పాశ్చాత్యదేశములలోని ధనికవర్గపు స్త్రీలను, రాణులను ఆకర్షించుటచేత, వారు వీనికై విశేషధనమును వ్యయపరచుచుండిరి. కాని పాశ్చాత్యదేశములయందు నేత యంత్రాలయము లభివృద్ధియై, వానితో మన దేశమును ముంచినతర్వాత, క్రమముగా దేశీయపరిశ్రమ ప్రోత్సాహములేక కృశించిపోయినది.

భారతీయులు పాశ్చాత్యనాగరికతా వ్యామోహమునకు దాసులై, మిల్లువస్త్రముల తళుకుబెళుకులకు లొంగి భ్రమపడినందున ఈ శతాబ్దారంభమునాటికి చిత్రవస్త్ర నిర్మాణము పూర్తిగా అదృశ్యమైనను, దేశీయ నేతపరిశ్రమ మాత్రము జీవచ్ఛవమైయున్నది. అయినను దక్షిణహిందూ

దేశమున మాత్రము పారిశ్రామికులయం దచ్చటచ్చట చిత్ర వస్త్ర కళాపరిశ్రమ వెల్లడి యగుచున్నది. ముఖ్యముగ స్త్రీలుధరించు చీరెలకును, పురుషులు ధరించు పంచెలు, ఉత్తరీయములకును రుద్రాక్ష, చేమంతి మొదలైన పుష్పములు అంచులలోను, కమ్ములలోను వచ్చునట్లు పేట్లు పెట్టి నేయుచుండుట నాటినుండి వచ్చుచున్న సంప్రదాయమే! కుప్పడములో పేట్లునేయుట మిక్కిలిగా ఆదరింపబడినది. ఇట్టి పంచెలను, ఉత్తరీయములను, చీరెలను శిష్టులు మిక్కిలి ఆదరించుటచేతనే నేడు ఖాదీలో ఇట్టి అంచులుగల వస్త్రములకు గిరాకి ఎక్కువైనది.

వస్త్రములలో అంచులకు 'పేట్లు' వచ్చునట్లు నేయుటకు రెండుపద్ధతు లుండెడివి. ఒకటి పేటు కట్టులెత్తు పద్ధతి; రెండవది లాగుడు పేటు. ఈ రెండుపద్ధతులయందును, రెండవ వ్యక్తిసహాయ మెల్లప్పుడును అవసరమే. రెండవవ్యక్తి సహాయములేకుండ నేయునప్పుడే 'పేటు' దిగునట్లు నేయుటకే 'డాబి' కనిపెట్టబడినది. ఈ 'డాబి' అనునది కొయ్యముక్కలతో అమర్చబడిన చిన్నయంత్రము. దీనిని మగ్గమునకు పైన నూటిగా మధ్యనుంచి, దానినుండి త్రాళ్లను క్రిందకి తెచ్చి, నేయునప్పుడు 'అని' వచ్చుటకుగా త్రొక్కబడెడు 'పాదుకల'కు కట్టినచో ప్రతి రెండు 'పోగు'ల కొకపర్యాయము పేటుదిగుచుండును, ఆ 'డాబీ'కిని, వస్త్రములోని అంచుపేటునకును కట్టబడెడు త్రాళ్లగుత్తినే 'అడ' యందురు. ఈ 'అడ'ను నిర్మాణముచేయుటకు సునిశితమైన బుద్ధియును, అభ్యాసమును కావలయును. మనము వస్త్ర

ములో నిర్మించవలసిన పేటు (Design)ను ముందుగా గళ్ళ కాగితము (Graph paper) పైన వేసి, స్ఫుటముగా కనబడ వలసిన భాగమునకు చుక్కలు పెట్టి ఆ భాగములుమాత్రమే నేతలో పైకివచ్చునట్లు 'అడ' కట్టవలయును. డిజైను మారుటకు 'అడ' మారవలయును. కాన ఎన్ని డిజైన్లు నేయవలయునన్న అన్ని 'అడ'లను వస్త్రకారుడు కట్టుకొన వలయును. ప్రభుత్వ నేతపాఠశాలలో శిక్షితులైనవారు కూడ క్రొత్తడిజైన్లకు 'అడ'ను స్వయముగా కట్టలేక ప్రావీణ్యముగల స్థానిక నేతపారిశ్రామికునిపై ఆధారపడుచుండుటయే ఇందలి విషయ క్లిష్టతకుతార్కాణము.

ఈ 'జాబీ'లు మనదేశములో వ్యాప్తికి వచ్చి 30 సంవత్సరములుమాత్రమే యైనది. వీనిని మొట్టమొదట మద్రాసుప్రభుత్వమువారు తమ టెక్స్టయిలు శాఖద్వారా ప్రవేశపెట్టిరి. కాని సూక్ష్మబుద్ధిగల పారిశ్రామికులు అనుభవముపై చాలమార్పులు గావించుకొనిరి. ఇటలీ, జపానుల నుండి కృత్రిమపుపట్టు (artificial silk) విరివిగా దిగుమతి యైన రోజులలో, ఈసిల్కులో సుమారు 5 లేక 6 వందల పేట్లు ఉత్పత్తియైనవి. కాని యుద్ధారంభమునుండి సిల్కు ధరలు పెరుగుటచేతను, దిగుమతి ఆగుటచేతను ఈ పేట్ల వస్త్రముల యుత్పత్తి నిలిచిపోయినది. ఆంధ్రదేశములో పనిచేయుచున్న కొన్నివేల 'జాబీ' లన్నియు మూలపడి పోయినవి.

అంచులలో పుష్పములు, లతలు, అక్షరములు, పక్షులు, జంతువులు మొదలైన చిత్రములు వచ్చునట్లు

నేయుటకు పైన వివరింపబడిన 'డాబీ' ఉపయోగించును కాని, చిత్రవిచిత్రమైన నగిషీపనిగల బెనారసు, ఆగ్రా పట్టు చీరెల 'కమ్ములు' నేయుటకు ఈ డాబీలు పనికిరావు. దీనికి లాగుడుపేటే మిక్కిలి ఉపయోగము. ఈలాగుడుపేట్లు మన ఆంధ్రదేశములో మిక్కిలి వ్యాప్తికి వచ్చుటచేత 3 లేక 4 వందలరూపాయల ఖరీదుగల బెనారస్ పట్టుచీరెలలో నిర్మింపబడెడు చిత్రకళను పదిరూపాయలవిలువచేయు కృత్రిమపు పట్టు చీరెలలో నిర్మించి యున్నారు.

పైన వివరించిన పద్ధతులపైన వస్త్రమును తయారు చేయునపుడే చిత్ర సృష్టిచేయుటగాక, తయారైన తెల్లని వస్త్రముపై రంగురంగుల చిత్రములనద్దు పరిశ్రమకూడ మన ఆంధ్రదేశముననే వాసి కెక్కినది. వీనినే బందరు కలంకారీ లందురు. ఈకలంకారీలకు దేశీయ రంగులనే వాడెడివారు. విదేశములలో తయారైన రసాయనిక రంగులు వ్యాప్తికివచ్చిన తర్వాత మన 'చెక్కతొగరు', 'నీలి' మొదలైన దేశీయపక్కారంగులు నశించినవి. ఈకలంకారీ పరిశ్రమకూడ చాల నశించినది. కాని యుద్ధారంభమునుండియు ఇండెన్‌త్రిన్, నెప్తలైను (Indenthrire Nepthaline) వంటి రసాయినికరంగుల దిగుమతి ఆగుట యును, ధరలు 300 % పెరుగుటచేతను, దేశములో రంగులగుడ్డల ధరలు అందుబాటులో లేకుండపోయినవి. ఈ తరుణమున ప్రభుత్వము దేశీయ (నాటు) రంగులకు పూర్తి ప్రోత్సాహము, సహకారము నొసగినచో దేశములోని రంగుల పరిశ్రమ తప్పక అభివృద్ధికి రాగలదు.

తద్వారా చిత్రవస్త్ర నిర్మాణముకూడ అభివృద్ధినందుట కవకాశ మేర్పడును.

## చిత్ర వస్త్ర నిర్మాతలు

మహాత్ముడు 1920 సంవత్సరమున తన స్వరాజ్య శంఖారావమును పూరించుచు వెడలిన ప్రథమ భారతదేశ సంచారమున చీరాల, పేరాలకువచ్చిరి. అప్పుడు ఆంధ్ర రత్న దుగ్గిరాలగోపాలకృష్ణయ్యగారు చీరాలసంరంభమునకు నాయకుడు. చీరాల, పేరాల గొప్పవస్త్ర నిర్మాణ కేంద్రము. అచ్చటి ప్రజలలో మూడువంతులు వస్త్రనిర్మాతలే! అట్టి సమయమున మహాత్మునియెడ వారికి గల భక్తి ప్రేమలను వారెట్లు వెల్లడించిరో చూడుడు. చీరాలలోని వైశ్యులు ధనికులు. వారాంధ్రరత్న నాయకత్వమున వేలు వెచ్చించి, రామనగరున గొప్పవిశాలమైన పందిరిలో మహా వైభవముగ మహాత్ము నాహ్వానించిరి. అప్పుడు పండిత వంశములోనివారును, చీరాల జాతీయ పాఠశాలయందు ఆంధ్రపండితులుగ నున్నవారును, చేనేత సంఘీయులునైన శ్రీ కార్యంపూడి రఘూకాంత కవిగారు సాగనారతో నొక ప్రశస్తమైన చొకమును తయారుచేసి మహాత్మునకు సమర్పించిరి. అందు సంస్కృతాక్షరములతో నొక శ్లోకము నేతలో వచ్చునట్లు నేసిరి.

ఆంధ్రదేశంలో చేనేత పరికరాల నూతన సృష్టికి, వ్యాప్తికి కారకులైన కీ॥ శే॥ శ్రీ కార్యంపూడి వెంకటకృష్ణ శతావధానిగారు మొట్టమొదట 'లాగుడు' ప్లేట్లను వ్యాప్తికి

తెచ్చిరి. మహాత్ముని పేరు కండువాలలో ఒకవైపున తెలుగు లోను మరియొకవైపున సంస్కృతాక్షరములలోను వచ్చునట్లు నేసిరి.

చిత్రవస్త్రనిర్మాతలు అక్షరములను, లతలను అంచులలో వచ్చునట్లు నేయుటయే కాక చౌకములలోను, ఉత్తరీయములలోను నాల్గువైపుల మన యిష్టము వచ్చిన శ్లోకముగాని, పద్యముగాని, వచ్చునట్లు నేయుట దక్షిణదేశమున వ్యాప్తికలదు. వస్త్రము నేయునప్పుడు అక్షరములను గుచ్చితీయకుండ ముందుగనే నూలుపైన 'బొందు' కట్టుపద్ధతిని 'చిత్రవస్త్రకళా ప్రవీణ' శ్రీ పెండెం కేశవులుగారు వ్యాప్తికి తెచ్చిరి.

శ్రీ పెండెం కేశవులుగారు నేతకళయందు ప్రతిభ కలవారు. వారు చేనేతయందు నూతన సృష్టి గావించుటకై తమ సర్వస్వము ధారపోసిరి. వీరు ఖాదీవస్త్రముల అంచులలో సంస్కృత శ్లోకములు వచ్చునట్లు నేసి, వానిని మహాత్మునకు వారి రెండవ పర్యటనమున చీరాలలోనే సమర్పించిరి. మహాత్ముడు వారి నైపుణ్యమున కచ్చెరువందిరి. వీరు చౌకమున, అనేకరంగులు వచ్చునట్టి ఇండియాపటమును 'ఒక్కనాడితో' నేసిరి. ఈ వస్త్రము, 1927 సంవత్సరమున నెల్లూరులో జరిగిన చేనేత వస్త్రప్రదర్శనమున ప్రదర్శింపబడినది. వీరికి అఖిలభారత పద్మశాలి మహాసభవారు 'చిత్రకళాప్రవీణ' బిరుదము నిచ్చి గౌరవించిరి. ఇవిగాక వీరు 'ఏషియాల'నబడు సెల్లాలను ఒక్కనాడితోడనే నేసిరి. వారొక చేనేత విద్యాలయమును స్థాపించి, తాము కని

పెట్టిన వానిని యువకులకు నేర్పవలమునని తలంచిరి. కాని వారు తమ కృషియందే, ఉప్పాడలో ఆకస్మిక మరణము నందిరి.

భట్టిప్రోలులో అందె సుబ్బారాయుడుగారు చేనేత యందు మంచి ప్రవీణులు. వీరు ఖద్దరులో కోటు, షరాయిని, కుట్టులేకుండ మగ్గముపైననే తయారుచేసిరి. ఇది చాల గొప్ప విషయము. అట్టి దుస్తులను నాయకులగు సి. ఆర్. దాస్, గాంధి, జవహర్‌లాల్ నెహ్రూగార్లకిచ్చి వారి మన్ననలపొందిరి. వీరికి చేనేత సభవారు "శిల్పాచార్య" బిరుదమునిచ్చి సత్కరించిరి.

కడపజిల్లా మాధవరమున, కీ। శే। శ్రీ మేరువ వెంకటయ్యగారు, ఒక చీరెయందు భారత రామాయణకథలను చిత్రపటములద్వారా నేయించిరి. ఇటీవల కొందఱు యువకులు, నాయకుల ప్రతిమలను నేతలో తయారుచేసి వస్త్ర కళ, చిత్రలేఖనమున కెందును తీసిపోదని రుజువుచేయుచున్నారు. యువకులు కొందఱు మూడుచెరగుల చీరెలను, పతాకలను తయారుచేసిరి. తగిన ఆదరణ ప్రోత్సాహము లున్నచో ఈవస్త్రపారిశ్రామిక సంఘమునుండి అసమాన చిత్ర కళాప్రావీణ్యమును చూపువ్యక్తులు తప్పక బయలు దేరుదురు. ఇట్టి భారతవర్ష వస్త్రకళాప్రాశస్త్యమును పోషించుట కళారాధకుల కర్తవ్యముగదా!



# చేనేత సహకారసంఘాలు

## సహకారోద్యమ చరిత్ర

మన దేశమున సహకార సంఘోద్యమము ప్రారంభమై ఇప్పటికి ముప్పదియైదు సంవత్సరములు కావచ్చుచున్నది. మొట్టమొదట సహకార సంఘాలు, పరపతి సంఘాలుగానే ఉన్నవి. ఆ పరపతి సంఘాలైనా, పట్టణములలో ఏకొందఱు పలుకుబడిగల వ్యక్తులకో ఉపయోగించినవి. తక్కువ వడ్డీకి అప్పులనిచ్చి, వాయిదాల ప్రకారము అప్పునుతీర్చుకొను కొద్దిపాటి బ్యాంకులుగా ఈ సహకార సంఘా లుపయోగించినవి. పది సంవత్సరముల అనుభవమైన తర్వాత నీ సంఘాలలో పెద్ద మార్పువచ్చినది. పట్టణములలో పలుకుబడికలవారికి మాత్రమే పరపతిని యిచ్చు సంఘాలుగాక, ప్రతిపల్లెలోను, గ్రామములోను ఉన్న వ్యవసాయదారులకు, కార్మికులకు వృత్తియందు పెట్టుబడిద్రవ్యమునకై సహాయముచేయు సంఘములు వ్యాప్తికివచ్చినవి. సిద్ధాంతరీత్యా ఈ సంఘాలు బహుళ ప్రయోజనముకలవిగా కనబడినను, అసలు కేంద్ర సహకార బ్యాంకుల చేతులలోనున్న మూలద్రవ్యమే చాలా స్వల్పమైనందున, కృషీవలులకు, కార్మికులకు నిజమైన సహాయమేదియు కలుగలేదు.

తర్వాత పది సంవత్సరములకు ఈ సహకారోద్యమమున నిజమైన మార్పువచ్చి, ఈ సంఘాలు బహుళప్రయో

జనము కలవై, కృషీవలులను, కార్మికులను, ఉద్యోగస్థులను, భాగ్యవంతులను, భూస్వాములను, పాడిచేయువారిని కూలిచేయువారిని, నేతనేయువారిని, వేయేల, అన్నిరకముల వారిని ఆకర్షించినవి. పరపతిసంఘాలవ్యాప్తి ప్రయోజనము క్షీణించిపోయినవి. రైతుకు నిజమైన సహాయము భూమి తనఖాబ్యాంకుల నిర్మాణమువలన కలిగినది. ప్రజల వివిధోపయోగములకై ప్రత్యేకాదర్శములు గల సంఘములు పని చేసి, ప్రజాదరణ పొందినవి. ఆహారపదార్థముల సహకార కొనుగోలు విక్రయసంఘాలు, పాలు సరఫరా సంఘాలు, ఉన్నత జీవనసంఘాలు (better living societies), కోపరేటివ్ స్టోర్సు, బిల్డింగు సొసైటీలు, వ్యవసాయ సహకార సంఘాలు ప్లీడర్ల ఉపయోగమునకు సంఘాలు, టీచర్ల ఉపయోగమునకు సంఘాలు మొదలైనవి వెల్లివిరిసినవి. ఇట్టి మహోన్నత పరివర్తనములో చేనేతవృత్తిచే జీవించువారుకూడ సహకారోద్యమ నిర్మాతల దృష్టిలోపడక తప్పలేదు.

ఆనాటి చేనేత పారిశ్రామికుల సహకార సంఘాలు కేవలం అప్పులుమాత్రం యిచ్చే సంఘాలు. అందుచేత యీ సంఘాలు చేనేత పారిశ్రామికుల వృద్ధికి తోడ్పడలేదు.

## కేంద్రప్రభుత్వ ద్రవ్యసహాయము

కాని, 1935 సంవత్సరమున చేనేతవృత్తియే జీవనాధారముగా గలవారికి నూతన శకారంభమైనది. హఠాత్తుగా హిందూదేశములో చేనేత పరిశ్రమయొక్క ప్రాముఖ్యమును ప్రభుత్వమువారు గుర్తించినట్లు వెల్లడియయ్యెను.

ఇండియాలోని మిల్లుపరిశ్రమాభివృద్ధిని కాపాడుటకై భారత ప్రభుత్వము విదేశములనుండి దిగుమతియగుచున్న నూలుపై పౌను 1కి 0-0-3 చొ॥ దిగుమతి సుంకమును విధించెను. ప్రభుత్వమునకు లభించిన ఈ అదనపు వరుంబడిలో కొంత భాగమును, మిల్లులపోటీకి అడుగంటుచున్న చేనేత పరిశ్రమాభివృద్ధికై వినియోగించుటకు అంగీకరించిరి. ఆ ద్రవ్యము నాయా రాష్ట్రములకు దామాషా ప్రకార మిచ్చుచు, తగినవిధమున ఖర్చుపెట్టుటకై ఆయారాష్ట్ర ప్రభుత్వములకు సంపూర్ణాధికారము నొసంగిరి. తత్ఫలితముగ వేర్వేరు రాష్ట్రములు, చేనేత పరిశ్రమాభివృద్ధికై వేర్వేరు మార్గముల నవలంబించి, పనిచేయుచున్నవి.

మద్రాసు రాష్ట్రము:—ఇచ్చట రాష్ట్రీయ చేనేతపారిశ్రామికుల సహకార సంఘముచేత నీ ద్రవ్యసహాయము వినియోగించబడినది. దీనికి 15 మంది డైరెక్టర్లు ఉన్నారు. ఈ రాష్ట్రీయసంఘము 1935లో 5 లక్షల పెట్టుబడితో ప్రారంభముచేయబడెను. మొట్టమొదట ఇందు శాఖాసంఘములు 40 మాత్రముండెను. ఇప్పుడు చాల నూతన శాఖా సంఘములతో రాష్ట్రములోని చేనేతపారిశ్రామికులకు తగు సహాయమును కల్పించుచున్నవి. రాష్ట్రమునందు ముఖ్య స్థానములలో ఎంపోరియములు స్థాపించబడినవి. చేనేతసంఘాలలో ఉత్పత్తియైన గుడ్డ విసుదలకు ఇవి చాల సహాయపడుచున్నవి. అచ్చటచ్చట స్థాపింపబడిన అద్దకశాఖలును క్రమముగనే పనిజేయుచున్నవి. రాష్ట్రసంఘమువారు డిజైనర్లను మార్కెటింగు ఆఫీసర్లను, ఇనస్పెక్టర్లను శాఖాసంఘము

లకు సలహాలనిచ్చుటకును, తనిఖీచేయుటకును పంపి, శాఖా సంఘముల అభివృద్ధికై సహాయపడుచున్నారు.

బొంబాయి రాష్ట్రము:—ఇచ్చట పరిశ్రమల డైరెక్టరు, కోపరేటివు రిజిస్ట్రారుగల బోర్డుచేత నిర్వహింపబడినది. వీరికొక సలహాసంఘము కూడ నున్నది. చేనేతబట్టల మార్కెటింగు ఆఫీసరు, పైసంఘమునకు కార్యదర్శి. కొన్ని ముఖ్యకేంద్రములలో తొమ్మిది పారిశ్రామిక సహకార సంఘముల నేర్పాటుచేసిరి. ఆయా కేంద్రములలో ఉత్పత్తి చేయబడిన చేనేతబట్టలు కొంత స్థానికముగను, కొంత బొంబాయినగరములోని సేల్సుడిపో మూలముగను అమ్మ బడుచుండెను. పూలు నేత పనివారికి కూడ మూడుసంఘములు స్థాపింపబడెను.

బెంగాలు రాష్ట్రము:—ఇచ్చట రాష్ట్రీయ పారిశ్రామిక సంఘము కలకత్తానగరములో స్థాపింపబడెను. తొమ్మిది పారిశ్రామిక యూనియన్లు వేరువేరుచోట్ల నెలకొల్పబడెను. ఈ గ్రాంటులో కొంతభాగము (Bengal Textile Institute) బెంగాలు నేతపాఠశాలలో పరిశోధననిమిత్తము మొసంగ బడెను. నేతపారిశ్రామికులకు నేతయందును, అద్దకము నందును నూతన పద్ధతులను నేర్పుట, ప్రజల అభిరుచికి తగినట్లు డిజైన్లు పెట్టుటను నేర్పుట, ముడిసరుకును తక్కువ ధరలకు శ్రామికుల కందునట్లుచేయుట, పై కేంద్రసంఘము యొక్క యుద్దేశములు.

సంయుక్త పరగణాలు:—ఇచ్చట పరిశ్రమలశాఖ దీనిని నిర్వహించుచున్నది. మొదట కొంతగ్రాంటు, చేనేతపరిశ్రమ

విషయసేకరణకు వినియోగింపబడెను. లక్నోలో ఈ పరిశ్రమలశాఖ ఒక ఎంపోరియమును స్థాపించెను. క్రొత్తడిజైన్లు ఉత్పత్తిచేయుటకును, నూతన పరికరములను కనిపెట్టు పరిశోధనలకు ధనము ముఖ్యముగ వినియోగింపబడెను. శాఖా సంఘములకు కూడ కొంత పెట్టుబడిధనముగ నొసంగబడెను. కేంద్రమార్కెటింగు సంఘము స్థాపింప నుద్దేశింపబడెను. గాని, అది జరుగలేదు.

పంజాబు రాష్ట్రము:—మరమగ్గాలు, యితర నూతన సామగ్రిని వాడునట్లుచేయుట, మార్కెటింగు సౌకర్యముల కల్పించుట ఇచ్చటి ముఖ్యోద్దేశములు. పరిశ్రమలశాఖయే ముడి సరకును సప్లయిచేసి, నేతపారిశ్రామికులకు మజూరీలు ముందుగాయిచ్చి, తయారైన సరుకును సేల్సుడిపోలద్వారా ఖర్చు పెట్టుచుండెను. ఇందు అమృతసరములోని డిపో ముఖ్యమైనది. ఈ విధానమున మార్కెటింగు ఆఫీసర్లు కూడ నియమింపబడిరి. ఈశాఖ కొన్ని ప్రదర్శనములను కూడ ఏర్పాటుచేసెను.

బీహారు రాష్ట్రము:—ఇచ్చట పరిశ్రమల డైరెక్టరు నిర్వహించెను. బీహారు గృహపరిశ్రమలు అనబడు చేనేత మార్కెటింగు సంఘము ప్రాముఖ్యమైనది. క్రొత్తరకముల బట్టలు, డిజైన్లు, తనిఖీ, మొదలగు వానికి సహాయము చేయబడెను. గుల్జారిభాగ్‌లోని గృహపరిశ్రమల సంఘమునుండి తయారైన రకములబట్టలు, ఇంగ్లండులోను, ఆస్ట్రేలియా, న్యూజిలాండులలోను అమ్ముడుపోయెను. ఇచ్చట శాఖా సంఘములకు ద్రవ్యసహాయము చేయబడలేదు. శాఖా

సంఘములకు కేంద్రసంఘము, ఉత్తర్వులనొసంగి ఉత్పత్తిని సాగించెను.

సంయుక్తపరగణాలు, బీహారు:—ఇచ్చట కూడ పరిశ్రమలశాఖచేతనే నిర్వహింపబడెను. నాగపురములో కేంద్ర నేత పారిశ్రామిక సహకారసంఘము స్థాపింపబడెను. ఇతరచోట్ల శాఖాసంఘములు స్థాపింపబడెను. నూలు, ముడిసరకులను మొత్తముగాకొని, నేతపారిశ్రామికులకు సరిగ అందునట్లు చేయుట, చేనేతపారిశ్రామికుల సాంఘిక, ఆర్థికాభివృద్ధికి తోడ్పడుట దీని ముఖ్యోద్దేశములు.

సింధురాష్ట్రము:—ఇచ్చట పారిశ్రామికులకు నూతన పరికరములను సప్లయిచేయుటకై గ్రాంటు ఎక్కువగా వినియోగింపబడెను. నూతన రకములు, డిజైన్లు వ్యాప్తి చేయుట, ముడిసరకులను అందించుట మొదలగు పనులు నిర్వహింపబడెను.

మొత్తము అన్నిరాష్ట్రములయందును, ఈ కేంద్ర ప్రభుత్వ ద్రవ్యసహాయము సద్వినియోగముచేయబడినదనుట నిర్వివాదాంశము. ప్రస్తుతము కేంద్రప్రభుత్వ ద్రవ్యసహాయము ఆగిపోయినను, ఆయా రాష్ట్రీయసంఘములు స్వయంపోషకముగనే పనిజేయుచున్నవి. రాష్ట్రములయందు జాతీయ ప్రభుత్వములేర్పడి, అవలంబించుచున్న స్వయంసమృద్ధ వస్త్ర ప్రణాళికలయందును, ఈసహకారసంఘములు చాల తోడ్పడగలవని నమ్ముచున్నాము.



శ్రీ ఆచార్య రంగాగారు, ఎం. ఎల్. ఎ. (సెంట్రల్)
ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘాధ్యక్షులు.

"సంఘక్షేత్రముదున్ని. ప్రశస్తభావ
బీజములనాటి. ప్రీతియై పెంచి వాని
ఫలములను దేశ దేశాల బంచినట్టి
కర్షకాగ్రణి! యిదె నమస్కారశతము!"

తా॥ శ్రీ॥ గారి "సరిక్రొత్తచాపు" నుండి.



శ్రీ దామర్ల రమాకాంతరావుగారు. యం. ఎ.
చెన్నరాష్ట్ర చేనేత కాంగ్రెస్ అధ్యక్షులు.



శ్రీ ప్రగడ కోటయ్యగారు.
చెన్నరాష్ట్ర చేనేత కాంగ్రెస్ కార్యదర్శి.



(శ్రీ) ఆకురాతి రంగనాయకులుగారు

గుంటూరుజిల్లా చేనేత కాంగ్రెస్ అధ్యక్షులు.



(శ్రీ) అక్కల కోటయ్యగారు.

గుంటూరుజిల్లా చేనేత కాంగ్రెస్ కార్యదర్శి.

'చేనేత బుర్రకథ' గ్రంథకర్త.



శ్రీ ప్రెగడ బాలనాగుగారు.
ఆంధ్రరాష్ట్ర చేనేత మహాసభాధ్యక్షులు.
చెన్నరాష్ట్ర చేనేత కాంగ్రెస్ కోశాధికారి.



శ్రీ పెండెం వెంకట్రాములుగారు.
చేనేత పారిశ్రామికోద్యమ జనకులు,
"నేతపరిశ్రమ" గ్రంథకర్త.

# చేనేత ఉద్యమము

## సాంఘికదుస్థితి

నానావిధములగు మతములకును, జాతులకును, కులములకును పుట్టినిల్లయిన మనదేశమున, నేత పారిశ్రామికులు ఒక్కకులమువారు, ఒక్క మతమువారు. కారు. సుమారు 36 కులములవారు చేనేతవృత్తిపై నాధారపడి యున్నారు. ఈకులములవారందరును ఆర్థిక, సాంఘిక, రాజకీయ దుస్థితియందు సమానులుగనే యున్నారు. వీరందరి యందు సర్వసాధారణమైన అవగుణములు, విద్యాశూన్యత, అజ్ఞానము, ఐకమత్యము లేకపోవుట. ఇవి మానవుని ఎంత హీనస్థితికైనను తీసుకరాగలవు. కాన ఈజాతి నేడు నిర్వీర్యమై, జీవచ్ఛవమైయున్నది. తత్ఫలితముగ అనాచారములకు, దుర్భర దారిద్ర్యమునకు ఆలవాలమై యున్నది. వీరి విద్యాశూన్యతను, అజ్ఞానమును పోగొట్టుటకై ప్రబల ప్రయత్నములు జరుగలేదు. విద్యావ్యాప్తికై వెనుకబడ్డ ఇతర జాతులకు ప్రభుత్వమువారిచే కల్పింపబడిన సహాయములు కూడ వీరికి లేవు; ఈసంఘాభివృద్ధికై అప్పుడప్పుడు చిన్న చిన్న జల్లువానలవంటి ప్రయత్నములు జరిగినవేగాని, ఒక్క తుపానుగాలియైనను కొట్టలేదు. వెనుకబడ్డ యితరజాతుల కున్న విద్యాసౌకర్యములనీపారిశ్రామికులకు కల్పించినచో, వారు త్వరలోనే రాజకీయప్రాతినిధ్యమును; హక్కులను

సంపాదించి వారి పారిశ్రామిక ఆర్థికాభివృద్ధికై వారే తీవ్రమైన కృషిసల్పుదురు. ఇప్పుడిప్పుడీపారిశ్రామికసంఘమున ఆత్మవిచారము కలిగి, సర్వతోముఖాభివృద్ధికై తీవ్రకృషి సాగింపబడుచుండుట ముదావహము.

## రాజకీయదుస్థితి

భారతదేశ గృహపరిశ్రమలలో చేనేత పరిశ్రమ ప్రధానస్థాన మాక్రమించుచున్నది. మనదేశమున చేనేత పారిశ్రామికులు రెండుకోట్లమంది యున్నారు. కాని వీరికి, ఏరాజకీయసంస్థయందును, ఏఆర్థికసంఘమునందును, చివరకు వస్త్రపారిశ్రామిక సంఘములయందును యుక్తమైన ప్రాతినిధ్యము లేదు. వీరికి అవకాశము నిచ్చి, వీరి పరిశ్రమకు ప్రోత్సాహమును, హక్కులను, రక్షణలను చూపు సంస్థయే కానరాదు. తగిన ప్రాతినిధ్యమును లభించుట లేదు. భారతవస్త్ర పరిశ్రమాభివృద్ధికై ఏర్పరుపబడుచున్న ప్రతిసంఘమునందును అనుభవశూన్యులైన వారిని నియమించుచున్నారేగాని, అనుభవముగల చేనేత పారిశ్రామికులకు తన కష్టనిష్ఠురముల వెల్లడించుటకు తగిన అవకాశము లేదు. కాన, ప్రభుత్వమువారు వస్త్రపరిశ్రమకు సంబంధించినంతవరకైనను, వివిధసంస్థలయందు, చేనేతవారికి సంపూర్ణప్రాతినిధ్యము నొసంగవలయును.

## ఆర్థికదుస్థితి

పూర్వము మహోన్నతదశ నందిన చేనేతపరిశ్రమ క్షీణించి నేటిశోచనీయస్థితికి వచ్చుటకు బట్టలమిల్లుల

వ్యాప్తియే కారణము. భారతీయ వస్త్రములు పాశ్చాత్య దేశములకు ఎగుమతియగుచున్న స్థితి పోయి, లాంకషైరు మాంచెస్టరులనుండి కోట్లరూప్యముల విలువచేయు బట్టదిగు మతియైనది. మిల్లుతళతళలకు భ్రమసి మన మీస్థితికి వచ్చితిమి. గత నూరుసంవత్సరములలో జరిగిన విధానమువలన మన దేశము నిర్భాగ్యమైనది. చేనేతపరిశ్రమ అదృశ్యమైనది. పారిశ్రామికుడు నల్లపూసయైనాడు. ఇతరవృత్తులకు చేయిచాచినాడు. ఇట్లు మిల్లులదాడివలన శల్యావశిష్టమైయున్న యీ పరిశ్రమపై మహాత్ముని దృష్టి పడినది మొదలు పారిశ్రామికుని ఆర్థికాభివృద్ధికై ప్రయత్నములు జరుగుచున్నవి కాని, అవి భారతీయులలో సంపూర్ణమానసిక పరివర్తనములేక ఫలోన్ముఖము చెందలేదు. విదేశ మిల్లులేగాక, గత యుద్ధానంతరము మన దేశమున బట్టల మిల్లులు అధికవ్యాప్తి నందినవి. 'స్వదేశీ' యనుమిషతో భారతజాతీయసంస్థ వానిని ప్రోత్సహించుటచే స్వదేశీమిల్లు బట్టలతో వైర మెక్కువ యైనది. ఈ స్వదేశీమిల్లుబట్టల దాడికి జీవచ్ఛవమై యున్న చేనేతపరిశ్రమ నుద్ధరించుటకై గత 20 సంవత్సరములలో జరిగిన ఆందోళన, ఉద్యమములు అతి ప్రాముఖ్యములు.

## చేనేత సభలు

యుద్ధానికిపూర్వము మన దేశమున నేతమిల్లులు పెచ్చు పెరిగి మనకు కావలసినదానిలో మూడువంతులబట్టను అవే తయారుచేసి విక్రయించుటచేత, చేనేతపరిశ్రమ మిల్లులపోటీకి

నిలుపజాలక క్షీణించినవిధము లోగడనే వివరించితిమి. చేనేత బట్టకు తగిన గిరాకి, విడుదలలేక నేయువారికి సరియైన మజూరిలేక చేనేతచేజీవించు రెండుకోట్లమంది ప్రజలు అల్లాడి పోయిరి. దినమునకు 10 గంటలు పనిజేసినను కడుపు నిండ దయ్యెను. అట్టి చేనేతవారికి దినమునకు తగిన కనీసపు మజూరియైన గిట్టునట్లుచేయవలయునన్న, ఈ స్వదేశీ మిల్లుల దాడిని ఆపక గత్యంతరములేదని చేనేతవారు గ్రహించిరి. ఇట్టిదాడిని అరికట్టుటకు ప్రభుత్వసహాయము ముఖ్యము. కాన భారతగృహపరిశ్రమలలో ప్రధానమైన ఈ చేనేతను ప్రోత్సహించి మిల్లులపోటీనుండి కాపాడి, చేనేతపరిశ్రమ, చేనేతకళ భారతభూమినుండి అదృశ్యముగాకుండ చేయవలసి నదిగా రాష్ట్రప్రభుత్వములకును, కేంద్రప్రభుత్వమునకు విన్న వించుకొనుటకై చేనేతవారు సభలను ప్రారంభించిరి. తీర్మాన ముల గావించి, ఆయాప్రభుత్వములకు పంపియుండిరి.

జాతీయ స్వాతంత్ర్యోద్యమ సంపర్కముతో యీ సంఘమునకలిగిన చైతన్యము మహాద్భుతము. జాతీయ భావములు కలిగి, స్వసంఘాభివృద్ధికి సర్వము నర్పింప సంసిద్ధులైన యువకులు యీ ఉద్యమమున కంకణము కట్టుకొనిరి. చేనేతపారిశ్రామికులు యెక్కువగ నున్న ప్రతిగ్రామమునకు వెళ్ళి సభలనేర్పాటుచేసి, వారికి ఆనందమైన వర్గచైతన్యమునుకలిగించిరి. ఇట్టిప్రచార ప్రబోధములఫలితముగ చేనేత పారిశ్రామికులు వారిస్థితిని సోదర రైతుసంఘముతో పోల్చుకొని వారు తమఆందోళన, స్వయంకృషి, దీక్షల వలన ఎట్లభివృద్ధికి వచ్చినదియు గ్రహించిరి. చేనేత పారి

శ్రామికులు కూడ తమ సర్వతోముఖాభివృద్ధికై కృషి చేయ నిశ్చయించుకొనిరి. ఇట్టు కలిగిన హృదయాందోళనను ప్రభుత్వములకు ప్రజలకు తెలుపుటకు నేటి రాజ్యవిధానమున సభలు, సభా తీర్మానములు శరణ్యములు కదా!

చేనేతపారిశ్రామికులు భారతదేశమునం దన్నిప్రాంతములలోనున్నారు. మద్రాసురాష్ట్రమున వారిసంఖ్య ఎక్కువ. ఇక్కడి పారిశ్రామికులు విజ్ఞానంలో యితరరాష్ట్ర పారిశ్రామికులకంటె ముందంజవేసిరి. అందు ముఖ్యముగ యీ ఆత్మవిచారము. ఆందోళన ఆంధ్రదేశమున ప్రారంభమైనవి. భారత రైతు ఉద్యమ జనకులైన శ్రీ ఆచార్య రంగాగారు ఆంధ్రదేశములోని చేనేతవారి ఆర్థికదుస్థితిని గాంచి, వీరి సముద్ధరణకు తగినకృషి గావించుటకై జాతీయాభిమానులగు చేనేత యువకులలో ఈ ఉద్దేశముల నాటిరి. వారి సదుపదేశమును శిరసావహించి చేనేతయువకులు సంఘ సేవాభిలాషులు పెక్కురు కార్యరంగమున దూకిరి. వీరిలో అగ్రతాంబూలము శ్రీ పెండెం వెంకట్రాములుగారిది. వారు దేశసేవకై, సంఘసేవకై దరిద్రదేవత నాలింగనము చేసిరి. మృత్యుగహ్వరమున పడనున్న తరినికూడ, చేనేత పంచాక్షరీ మంత్రపారాయణచేసి మృత్యుముఖమునుండి తప్పించుకొనిరి.

ఆంధ్రరాష్ట్ర చేనేతవారి ప్రథమ సభ 1936 సం॥రం జూలై నెలలో గోదావరిజిల్లా- ఉప్పాడలో సమావేశమైనది. సన్నని విలువగల జరీబట్టలనేతకు ఉప్పాడ ప్రసిద్ధి జెందినది. తండోపతండములుగ చేనేతప్రజలు సభకు హాజరైరి. చేనేత

పారిశ్రామికుల ఉత్సాహము వెల్లివిరిసినది. నాయకుల కార్యదీక్ష యెక్కువైనది. చేనేతదుస్థితిని చర్చించి తదభివృద్ధికై అవసరమనితోచిన ముఖ్యతీర్మానముల చేసిరి. శ్రీ పెండెం వెంకట్రాములుగారు ప్రధానకార్యదర్శిగ సంఘమొకటి ఏర్పాటుచేయబడినది.

తరువాత సంవత్సరములో రెండవసభ జరుగులోపల 4 జిల్లాసభలు, కొన్ని తాలూకాసభలు జరిగినవి. ఉత్సాహపూరితముగ కార్యక్రమము జరిగినది.

చేనేతవారి ఆంధ్రరాష్ట్రద్వితీయసభ, కర్నూలుజిల్లా నంద్యాలగ్రామమున జరిగినది. దీనిని గా॥ శ్రీ వి రామదాసు పంతులుగారు ప్రారంభించిరి. ఇప్పటి చెన్నరాష్ట్ర చేనేత కాంగ్రెస్ కోశాధికారి శ్రీ ప్రెగడబాలనాగుగారుసభాధ్యక్షత వహించిరి. చేనేతమగ్గములకును, స్వదేశీమిల్లులకును అన్యోన్యంగా వ్యాపారము వృద్ధియగునట్లు కట్టుదిట్టము చేయవలసిన అవసరమును వారునొక్కి చెప్పియున్నారు. మహాత్ముని ఖాదీసిద్ధాంతముకూడ తర్కింపబడినది. కోటాపద్ధతిని కోరుచు మొదటితీర్మానము గావించబడినది. మరికొన్ని ముఖ్యమైన యితరతీర్మానములు జేయబడినవి. ఈ రెండుసంవత్సరముల లోపల చేనేతప్రజలయందు చైతన్య మెక్కువైనది. స్వసంఘాభివృద్ధికి ఆత్మవిశ్వాసము, స్వయంకృషి, ఆందోళన ముఖ్యములను విషయము అందరిమనస్సులలో నాటుకొన్నది. ఎనిమిదిరాష్ట్రములలో కాంగ్రెసుమంత్రులు ప్రభుత్వమునకు వచ్చిరి. "సత్యము, అహింస, ఖద్దరు"లపై నాధారపడియున్న కాంగ్రెసుప్రభుత్వమున తప్పక, ఖద్దరునకు తద్వారా

చేనేతకు తగిన ప్రోత్సాహము, సహాయము లభించునని చేనేత పారిశ్రామికులు ఆశించిరి. కాని "అడుగనిది అమ్మయైనను పెట్ట" దని తమ కష్టపరంపరల చెప్పుకొననిచో తగినలాభ ముండదని, సభలద్వారా, తీర్మానములద్వారా చేనేతప్రజలు సక్రమాందోళన ప్రారంభించిరి.

ఇట్టి రాజకీయవాతావరణమున చేనేతవారి మూడవ ఆంధ్రరాష్ట్ర సభ బళ్ళారి జిల్లాలోని తుంగభద్రలో 1938 ఏప్రిల్ నెలలో జరిగినది. అతి ప్రాముఖ్యములగు తీర్మానములు చేయబడినవి.

బాధ్యతగల ప్రజాప్రభుత్వములు పనిజేయుచున్న రాష్ట్రములయందే గాక, ఈ ఉద్యమము, చేనేత ప్రజలు విరివిగనున్న సంస్థానములలోనికి కూడ ప్రాకినది. నైజాము రాజ్యమున తెలుగు మాట్లాడు చేనేత పారిశ్రామికులు కొన్ని లక్షలమంది గలరు. అచ్చట వారిస్థితి చాల శోచనీయముగ నున్నది. రాష్ట్రముల యందున్న చేనేతవారి కంటె అచ్చట వారన్ని విషయములయందును చాల వెనుకబడి యున్నారు. అచ్చట నైజాం ఉద్యోగస్థులు, పేదలగు చేనేతవారిని పెట్టు కష్టములు, బాధలు, వర్ణనాతీతములు హృదయ విదారకములు. వీరివలన నైజాం ప్రభుత్వోద్యోగులు, వెట్టిచాకిరి చేయించుకొందురు. వెట్టిచాకిరి అనగా కూలితీసుకొనకయే పనిచేయుట! ఇంటివద్ద పెండ్లాము బిడ్డలు పస్తున్నను, వీరు ఊరకనే ఉద్యోగస్థుల సేవజేయవలయును. ఎవరైనను నిరాకరించినచో, వారు నోరెత్తకుండ యమ బాధలు పెట్టుదురు. వారి స్త్రీలను పిల్లలను కూడ హింసిం

చెదరట. ఇట్టి దారుణకృత్యములు ఈ 20 వ. శతాబ్దమున కూడ స్వదేశసంస్థానములలో జరుగుచుండుట శోచనీయము.

నిజాం రాజ్యములోని చేనేతవారి కష్టములను నైజాం ప్రభువుకు తెల్పి, నివారణ చేయించుకొనుటకై, నిజాంరాజ్య చేనేతవారి సభ, నిజామాబాదున 1937 డిసెంబరులో శ్రీ వసంక్రిష్ణమూర్తి, హైకోర్టు వకీలుగారి అధ్యక్షతను జరిగినది. ఆ సభలో నిజాం రాజ్యములోని చేనేత సంఘమునకు చెందిన విద్యాధికులు పలుకుబడిగల ప్రముఖులు పాల్గొనిరి. ఆ రాజ్యములోని చేనేతవారి ప్రత్యేక సమస్యలను, కష్టములను వెల్లడించుచు కొన్ని ముఖ్య తీర్మానములు చేసిరి. బొంబాయి రాష్ట్రములో షోలాపూరు, పూనా అహమదాబాద్ నగరములలో అసంఖ్యాకులగు చేనేతవారున్నారు. వీరి స్థితిగూడ చాల దైన్యముగనే యున్నది. అక్కడి పారిశ్రామికులలో కూడ చైతన్యము బయలుదేరి, బొంబాయి, పూనాలలో రాష్ట్రీయ చేనేత పారిశ్రామిక సభలు జరిపి యుద్యమము ప్రారంభించిరి.

ఈ లోపలనే, ఇండియా ప్రభుత్వమువారి ద్రవ్యసహాయముతో చేనేత సహకార సంఘములు, అన్ని రాష్ట్రములలో పనిని ప్రారంభించినవి. అట్టి సంఘము మద్రాసు రాష్ట్రమునకును, మద్రాసు నగరమున స్థాపింపబడి, పనిని సాగించినది. చేనేత ప్రజలు విరివిగనున్న గ్రామములయందు చేనేత సహకార శాఖా సంఘములు స్థాపింపబడి, సహకార పద్ధతులపై ప్రభుత్వము నూలు సహాయముచేసి

చేనేతబట్టల ఉత్పత్తి, విక్రయము విరివిగ సాగింప ప్రయత్న ములు జరిగినవి. చేనేత సహకార సంఘములయందుత్పత్తి యైన, చేనేత వస్త్రములను అభిమానించవలసినదిగ కోరుచు, రాష్ట్ర ప్రభుత్వమునకు విన్నపములను పంపిరి. కాంగ్రెసు ప్రభుత్వము ఖద్దరు వ్యాప్తికై 2 లక్షలు విరాళ మొసగినది. చేనేత వస్త్రములనే ఉద్యోగులు అభిమానించి కొనవలయు నని ప్రభుత్వము హెచ్చరించెను. చేనేతబట్టల వ్యాప్తికి విక్రేతలకు వస్త్ర విక్రయ చట్టమును గావించి, తద్వారా మిల్లువస్త్రము లమ్మువారికి లైసెన్సు రుసుము విధించి, చేనేతను ప్రభుత్వము కొంత ప్రోత్సహించినది కాని, ఇందు వలన కోరినంత సహాయము జరగ లేదు.

ఇట్టి సమయమున మద్రాసు ప్రధానామాత్యులైన శ్రీ రాజగోపాలాచారిగారు ప్రథమ ఆంధ్ర దేశ పర్యటనము గావించిరి.

కడపలో చేనేతవారి తరఫున శ్రీ నాగేంద్రుడు గారు చేనేతవారి సమస్యలను తెల్పి కాంగ్రెసు సహాయమును కోరిరి. ప్రధాన మంత్రి సంపూర్ణ సానుభూతిని జూపిరి. తదుపరి గుంటూరు పురమున 1938, జూలై 16 తేదీన చెన్నరాష్ట్ర చేనేత ప్రథమ సభ మహా వైభవముగ జరిగినది. దానిని ప్రధానమంత్రియే ప్రారంభించిరి. అప్పుడు వారికి, చేనేతవారి దుస్థితి బాగుగ దెలిసినది. సంపూర్ణ సహాయమును వాగ్దానము జేసిరి. తత్సబాధ్యక్షులైన శ్రీ హరి సర్వోత్తమరావుగారు చేనేత అభివృద్ధికి, రక్షణ శాసనము, కోటా పద్ధతి అత్యవసరములని తెల్పిరి.

ఈ సభలో రాష్ట్రమునకు సంబంధించిన చేనేతవారి సమస్యలపై తీర్మానములు గావించబడెను. శ్రీ రామనాథం రామదాసుగారు అధ్యక్షులుగను శ్రీ రమాకాంత రావుగారు కార్యదర్శిగను ఒక కార్యనిర్వాహక సంఘము ఏర్పడెను.

రాష్ట్రీయ సభకు నెలదినముల క్రిందటనే గుంటూరు జిల్లా చేనేత సభ నిడుబ్రోలు గ్రామమున జరిగినది. దీనికి శ్రీ కంఠముగారు అధ్యక్షత వహించిరి. శ్రీ ఆచార్య రంగాగారు సభను ప్రారంభించిరి. శ్రీ రమాకాంతరావు గారు జెండా నెగురవేసిరి. 'పద్మశాలి' 'సంస్కారి' పత్రికల సంపాదకులు శ్రీ కాశీపర్తి శ్రీరాములుగారు ఆచార్యరంగా గారికి "సరిక్రొత్త చాపు"ను సమర్పించిరి. సభానిర్వాహణమునకై మిక్కిలి కృషిజేయుటయే గాక, సభానివేదిక నూతనశోభతో వెలువడుటకు వీరు చాలతోడ్పడిరి. తదితర చేనేత ప్రముఖులు పాల్గొనిరి. అతి ప్రాముఖ్యములగు తీర్మానముల గావించిరి. భారతదేశంలో కెల్ల మొట్ట మొదటిసారిగా, ఈ జిల్లాలో ప్రథమ రక్షణ యాత్రను సాగించి తద్వారా సభాసందేశములను మూలమూలలకు, పల్లెపల్లెలకు జాటిరి. అన్ని ఆంధ్రజిల్లాలలోకంటె, చేనేత ప్రజలు ఎక్కువగనున్న ఈ జిల్లాలో చేనేత సభల వృత్తాంతము ప్రతివారి చెవులకు సోకినది.

రాష్ట్రీయ చేనేత ప్రజలకు సంబంధించిన సమస్యలేగాక, అఖిల భారత చేనేత ప్రజకు సంబంధించిన విషయములయెడ శ్రద్ధవహించుటకు, అఖిల భారత చేనేత సంఘా

ప్రత్యేకతను గమనించిన, చేనేత నాయకులు అన్ని రాష్ట్రముల ప్రాతినిధ్యముగల, భారత చేనేతసంఘమును ఏర్పాటు గావింప కృషిచేసిరి. అట్టి సమావేశము, కర్నూలు జిల్లాలో అహోబిలక్షేత్రమున 3-3-39 తేదిన జరిగినది. ఇందు ఆంధ్ర తమిళ, నైజాం బొంబాయిరాష్ట్ర చేనేత పారిశ్రామిక ప్రతినిధులు పాల్గొనిరి. దీనికి శ్రీ॥ శ్రీ కంఠం గారు అధ్యక్షత వహించిరి. "నేత పరిశ్రమ" సంపాదకులు శ్రీ॥ నాగేంద్రుడుగారు సభను ప్రారంభించిరి. ప్రారంభోపన్యాసమున ఖాదీసిద్ధాంతము ఎట్లు ఆచరణయందు వెనుకపడినదియు చేనేతవస్త్రము ప్రజాసామాన్యము కెట్లు శరణ్యమైనదియు వస్త్రోత్పత్తి లెక్కలప్రకారము వివరించిరి. అన్నిరాష్ట్రములకు సంబంధించిన ముఖ్యతీర్మానములు గావింపబడినవి.

ఈ సభానంతరము ఒకనెల లోపలనే, మద్రాసు ప్రభుత్వమువారు మద్యనిషేధమువలన కలిగిన, లోటును పూడ్చుటకై, విక్రయపన్ను చట్టమునుగావింప తీర్మానించి దాని చిత్తుబిల్లును ప్రకటించిరి. ఈ చట్టమువలన, దెబ్బ తగిలి నశింపవచ్చునని తోచిన కొన్ని పరిశ్రమలను ఈ చట్టమునుండి మినహాయింప నుద్దేశించి ప్రత్తి, బంగారు వ్యాపారములను మినహాయించిరి. కాని మిల్లుపోటీవలన కృశించి, జీవచ్ఛవమైయున్న చేనేత పరిశ్రమను మినహాయింపలేదు. అంత "నేత పరిశ్రమ" సంపాదకు లీ విషయమును గమనించి జరిగిన పొరబాటును, చేనేత ప్రజల కెల్లరకు తమ పత్రికలద్వారా తెలియపరచి, అన్ని ప్రాతం

ములలోను సభలగావించి, చేనేత వస్త్రములను, విక్రయ చట్టమునుండి మినహాయింపవలసినదిగ తీర్మానములజేసి ప్రభుత్వమునకు పంపగోరిరి. అంతియేగాక ప్రధానమంత్రి గారికి ప్రత్యేకముగ విజ్ఞాపనను 12-4-39 న పంపిరి. రాష్ట్రములోని పలుతావులలోని పారిశ్రామికులు చేనేత వస్త్రములను, అమ్మకం పన్నునుండి మినహాయింపవలసినదిగ ప్రభుత్వమును గోరిరి. తత్ఫలితముగ చేనేత వస్త్రములు విక్రయచట్టమునుండి మినహాయింపబడినవి. అందువలన కొంతవరకు చేనేత వ్యాపారాభివృద్ధికి ప్రోత్సాహము కల్గినది.

యుద్ధపరిస్థితివల్ల యేర్పడిన సంఘటనలచే చెన్నరాష్ట్ర చేనేత పారిశ్రామికసభను తిరిగి యేర్పాటు చేయుటకు వీలుగాకపోయినది. అందుచేత కార్యనిర్వాహక వర్గమువారు 30-1-1942 న మదరాసులో సమావేశమై అప్పటివరకు రాష్ట్ర సంఘ కార్యదర్శిగానున్న శ్రీ రమాకాంతరావుగారిని అధ్యక్షులుగను, శ్రీ ప్రెగడ కోటయ్య గారిని కార్యదర్శిగను ఎన్నుకొనిరి. వారిరువురును అప్పటి కేర్పడిన సమస్యలపై ప్రత్యేకశ్రద్ధతో కృషిజేసిరి. వారి ప్రచార కార్యక్రమంలో శ్రీ అక్కల కోటయ్యగారు చాల తోడ్పడిరి. వీరుముగ్గురు నాయకులయొక్క తీవ్రతరమైన సంచలనముతో పారిశ్రామికులలో చైతన్యము ప్రబలినది. 1945 సం॥ ఏప్రిల్ నెలలో మండపేటలో ద్వితీయ చెన్న రాష్ట్ర చేనేతసభ బ్రహ్మాండమగు యేర్పాట్లతో జరుపబడినది. గాంధీ ప్రణాళికా రచయిత శ్రీమన్నారాయణ

అగర్వాలా సభా ప్రారంభోత్సవం జరిపిరి. గ్రామ స్వయం సంపూర్ణత్వమునకు ఖాదీయుత్పత్తియొక్క ప్రాముఖ్యతను గూర్చి విపులంగా వివరించిరి. అధ్యక్షులగు శ్రీ రమాకాంత రావుగారు పారిశ్రామికులు నూలుకొరకు మిల్లులపై నాధార పడకుండ ఖద్దరుకూలుపైన ఆధారపడవలయుననియు, పారిశ్రామికులు సహకారసంఘాలలో విరివిగాజేరి తమ భవిష్యత్తు నభివృద్ధిపరచు కొనవలయుననియు, మదరాసు ప్రభుత్వమువారు రాష్ట్రంలో క్రొత్త బట్టలమిల్లుల స్థాపించకుండా చేయువలయుననియు, సూచించిరి. శ్రీ ప్రగట కోటయ్యగారు తిరిగి కార్యదర్శిగ నెన్నుకొనబడిరి.

## నూలుకొరత ; రేషనుపద్ధతి

యుద్ధపరిస్థితివల్ల యేర్పడిన నూలుకొరత దీర్చుటకై మదరాసు ప్రభుత్వమువారు 1942 సం॥ ఆగష్టునెలలో నూలువ్యాపారుల లైసెన్సుచట్టమును జేసి అమలు పరచిరి. దానివల్ల నూలుధరలు తగ్గలేదు 1943 లో నూలు ధరలు ఆకాశాన్ని అంటినవి. పారిశ్రామికులకు సక్రమంగా నూలు అందలేదు. నూలుసమస్య చాల క్లిష్టమై పారిశ్రామికులకు చాల చిక్కువచ్చినది. మన సంఘాలుచేసిన తీవ్రమగు ఆందోళన ఫలితంగా కేంద్ర ప్రభుత్వము నూలు ధరలను కంట్రోలుచేసింది. ధరలు కంట్రోలుచేయబడినా, కంట్రోలు ధరలకు నూలు అందకుండా పోయింది.

ప్రతి పారిశ్రామికునకు రేషన్ కార్డు యిచ్చుటవల్ల నూలుసమస్యను పరిష్కారము చేయవచ్చునని ప్రభుత్వము

వారు నిశ్చయించిరి. ఇండియాలో మొట్టమొదటిసారిగా నూలు రేషన్ విధానం గుంటూరుజిల్లాలో 1944 సెప్టెంబరు మొదటివారంలో ప్రారంభించబడింది. గుంటూరుజిల్లా నూలు రేషన్ కార్డుల పంపకవిషయంలో జిల్లా సంఘాధ్యక్షులు శ్రీ ఆకురాతి రంగనాయకులుగారు,* కార్యదర్శి శ్రీ అక్కల కోటయ్యగారు చేసినకృషి శ్లాఘాపాత్రము.

తరువాత శ్రీ ప్రగడ కోటయ్య, అక్కల కోటయ్య గార్ల తీవ్రమైన ప్రచార ఫలితముగా యితర జిల్లాలలో కూడా, స్థానిక పారిశ్రామికుల సహాయంతో నూలురేషన్ విధానం ప్రవేశపెట్టబడింది. కోటయ్యగార్లిరువురు రాష్ట్రములో అనేక ప్రాంతములకేగి చేనేత పారిశ్రామికుల ఆర్థిక, సాంఘిక, పారిశ్రామిక, రాజకీయాది సమస్యలపై బ్రహ్మాండమైన ప్రబోధము గావించిరి.

## అఖిలభారత నూలుపంపక విధానము

1945 సంవత్సరంలో కేంద్రప్రభుత్వము నూలు

---

* శ్రీ ఆకురాతి రంగనాయకులుగారు వయోవృద్ధులైనను, కార్యరంగమున యువకులను మించిన ఉత్సాహంతో స్వసంఘాభివృద్ధికై పనిచేస్తున్నారు. వీరు అఖిలభారత ప్రథమ పద్మశాలి మహాజన సభాధ్యక్షులు. వీరు తమ కాలాన్నంతా పద్మశాలి సంఘసంస్కారానికి చేనేత పారిశ్రామికుల ఆర్థికాభ్యుదయమునకు వినియోగిస్తున్నారు. వీరి షష్ఠిపూర్త్యుత్సవమును పద్మశాలి సంఘీయులు భట్టిప్రోలులో అతి వైభవంగా జరిపిరి. ఆ సందర్భమున 'ఆకురాయి' అను గ్రంథమును సమర్పించిరి. ప్రస్తుతము వారు ప్రజానీక కార్యములయందు యువకులకు మార్గదర్శకులై కృషిచేయుచున్నారు. చెన్నరాష్ట్ర చేనేత కాంగ్రెసు కార్యవర్గమునకు వీరు చుక్కానివంటివారు. ప్రథమ అఖిలభారత చేనేత సభా నిర్వహణమున వీరు చాల చేయూత నొసంగిరి.

పంపక విధానమును ప్రవేశపెట్టెను. తత్ఫలితంగా మన రాష్ట్రంలో ఉత్పత్తియగుచున్న నూలునుండి కొంత యితర రాష్ట్రములకు వెళ్లుచుండుటచేత మన పారిశ్రామికులకు నూలుకొరత ఏర్పడినది. మరికొంత యుద్ధావసరాలకు, మిల్లు నేతకు పోవుచున్నది. ఉత్పత్తిఅయ్యే 50 వేల బేళ్లలో అన్నితరుగులుపోను 15 వేల బేళ్లుమాత్రమే మన పరిశ్రమకు ఇచ్చుచున్నందున. నెలలో 10 రోజులపనికి సరిపోయే నూలుమాత్రమే వస్తున్నది.

## చేనేతబట్టల ధరల కంట్రోలు

కేంద్రప్రభుత్వము 1945 ఆగష్టులో చేనేతబట్టల ధరలను, చేనేత మజూరీలను కంట్రోలు చేయుటకు ప్రయత్నించింది. నాగపూరులో చేనేతబోర్డు సమావేశమగుచున్న సమయముననే ద్వితీయ అఖిలభారత చేనేతసభ శ్రీ ఆచార్య రంగాగారి అధ్యక్షతను నాగపూరులోనే జరుపబడెను. ధరల కంట్రోలు విషయమున వెల్లడింపబడిన వ్యతిరేకతవల్లను, జపాను యుద్ధము ఆకస్మికముగ అంతమగుటచేతను, ఆ అభిప్రాయమును భారత ప్రభుత్వము విరమించెను. కాని 1946 సంవత్సరము సెప్టెంబరునుండి, మన రాష్ట్రంలోమాత్రం చేనేతగుడ్డల ధరల కంట్రోలు అమలుపరచబడినది. అయినను పారిశ్రామికులకు నెలంతా పనిలేనందున మజురీలు కంట్రోలు చేయబడలేదు. ఇందువలన కలిగిన ఫలితమును ముస్ముందు పరిశీలింపవలసి యున్నది.

---

# చేనేత రక్షణయాత్రలు

"నేతపరిశ్రమ నిల్పుటకొరకు
సభలతోనే మాకు సంతృప్తిలేదు
సభమాట వింటింట పాటంగవలయు
నడుము బిగింపుడో నాయకులారా."

తాడిపత్రి శ్రీరాములు

చేనేత పారిశ్రామిక సంఘమున సంచలనము ప్రబోధము గావించుటకు ప్రతిజిల్లాయందును చేనేత రక్షణ యాత్రలు సాగించుట మిక్కిలి సహాయమని యెంచి గుంటూరుజిల్లాలో చేనేత ప్రజలు ఎక్కువగనున్న గ్రామములలో రక్షణయాత్ర సాగింప జిల్లాసభవారు తీర్మానించిరి. చేనేత ప్రజానీకములో ఈప్రచారము చక్కని ప్రబోధం కలిగించింది. వారు స్వసంఘోద్ధరణకు బద్ధకంకణులైరి. చేనేత రక్షణయాత్రలు సాగించుటకు ఆచార్య రంగాగారే మార్గదర్శకులు.

## రేపల్లె తాలూకాలో రక్షణయాత్ర

ప్రథమమున రేపల్లెతాలూకాలో యాత్రసాగించిరి. చేనేత ఉద్యమమున నిరంతరకృషి గావించిన కీ॥ శే॥ తాడిపత్రి శ్రీరాములుగారు, శిల్పాచార్య శ్రీ అందె సుబ్బరాయుడు గారు, శ్రీ అక్కల కోటయ్యగారు యాత్రను చెఱుకుపల్లిలో ది 25-5-38 న ప్రారంభము గావించి 1-6-38 వరకు గుళ్లపల్లి, రాజోలు, కనగాల, ధూళిపూడి, ఇసుకపల్లె, పేటేరు, రేపల్లె వగైరా 12 గ్రామములలో సభలగావించి చేనేత

ప్రజల దుస్థితిని, ఉద్ధరణకు మార్గములను వివరించి గొప్ప ప్రబోధము గావించిరి.

## బాపట్లతాలూకాలో రక్షణయాత్ర

రేపల్లెతాలూకాలో వారముదినములుచేసిన సంచారమువలన కలిగిన ఫలితము చాల ప్రోత్సాహకరముగ నుండెను. ఈసభల వృత్తాంతములను, యాత్రావివరములను విన్న, ఇతర తాలూకాలయందలి చేనేత పారిశ్రామికులు, తమ తాలూకాలయందును ప్రబోధమును గావింప కోరినందున, లోగడ రక్షణయాత్రను సాగించిన ప్రముఖులే బాపట్లతాలూకాలో, బాపట్ల, ఈపూరుపాలెము, పేరాల, చీరాల, రామకృష్ణాపురము, జాండ్రపేట, వేటపాలెము మొదలగు చేనేత పారిశ్రామిక కేంద్ర గ్రామములలో సభలు గావించి గ్రామసంఘములను స్థాపించిరి. ఈ సందర్భమున శిల్పాచార్యుని పట్టుదల, శ్రీ అక్కల కోటయ్యగారి గంభీరోపన్యాసశక్తి, మధుర గేయరచన, గానశక్తి యీ యాత్ర మిక్కిలి జయప్రదమగుటకు కారణములయ్యెను. చేనేతవారి హృదయముల ద్రవింపజేసి, కార్యోత్సాహమును కలిగించు కీర్తనలను ప్రబోధమునకై శ్రీ కోటయ్యగారు రచించిరి. *

---

* శ్రీ అక్కల కోటయ్యగారు చేనేత పారిశ్రామికోద్యమ ప్రచారమునకై మృదుమధుర శైలిని గేయములను పద్యములను రచించుటయే గాక చేనేత చరిత్రను యక్షగాన ఫణితిని జంగం కథ రచించిరి. ఆ బుర్రకథను శ్రీ కోటయ్యగారే పాడగా కవిసామ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు విని 'ఈయన అధునాతన కాలంలో యక్షగాన కవి చక్రవర్తియా! అనిపించేటట్లు వీరి రచన ఉన్నది' అని నుడివిరి.

# కడపజిల్లా రక్షణయాత్ర

సర్కారులయందు గుంటూరుజిల్లా చేనేత ప్రజల కెట్లు ప్రసిద్ధమైనదో, అట్లే రాయలసీమయందు కడపజిల్లా చేనేతపరిశ్రమకు ప్రసిద్ధినందినది. రాజంపేట తాలూకాలోని పుల్లంపేట, అప్పయ్యరాజుపేట, పుత్తనవారిపల్లె, క్రొత్తపేట, సిద్ధవటం తాలూకాలోని మాధవరము, ఉప్పరపల్లె, నాగాయపేట, సింగారెడ్డిపల్లె, జమ్మలమడుగు తాలూకాలో జమ్మలమడుగు చేనేతవస్త్రముల ఉత్పత్తికి చాల పూర్వమునుండి ప్రసిద్ధినందినవి. పుల్లంపేట, మాధవరములు సన్నజరిబట్టల ఉత్పత్తికి, కళాప్రావీణ్యతకు పేరుగాంచినవి. ఈ జిల్లాలో 12 వేల మగ్గము లుండెను. ఈ ప్రజలకు చేనేతసభల శుభ సందేశమును వినిపింప "నేతపరిశ్రమ" సంపాదకులు శ్రీనాగేంద్రుడుగారి ప్రోత్సాహమున కడపజిల్లా చేనేత రక్షణయాత్ర సాగింపబడెను. రక్షణయాత్రను 17-7-38న పుల్లంపేటనుండి, ప్రారంభించిరి. శ్రీ సేపూరి లక్ష్మీనరసయ్యం, ఏ., యల్, టి., గారు ప్రారంభోత్సవమును జరిపిరి. సీతారాంపేట, అప్పయ్యరాజుపేట, క్రొత్తపేట, పుత్తనవారిపల్లె, మాధవరము, ఉప్పరపల్లె, బోయనపల్లె, కొండమాచుపల్లె, నాగాయపేట, సింగారెడ్డిపల్లె మొదలగు గ్రామములలో సాగించి, సభలు జరిపి గ్రామసంఘములను స్థాపించి ది 22-7-38 న పూర్తిజేసిరి. ఈ యాత్ర జయప్రదముగ ముగియుటకు శ్రీయుతులు బద్దిఓబయ్య, ఉక్కడాల వెంకట్రామయ్యగార్లు మిక్కిలి కృషిసల్పిరి.

## ''నేతపరిశ్రమ'' పత్రిక

ఎన్నిసభలు చేసినా, ఎన్ని రక్షణయాత్రలు సాగించినా, చేనేతప్రజల ఆందోళన, సభాతీర్మానములు సరిగ ప్రభుత్వ మున కందుటకును, ప్రత్యేకశ్రద్ధతో చేనేతసమస్యల పరిశీలించి, విషయముల వెల్లడిచేయుటకును ప్రత్యేక పత్రిక ఆవశ్యకమయ్యెను. చేనేతసభల వృత్తాంతములను, తీర్మానములను, యాత్రలవివరములను 'ఆంధ్ర' వంటి దైనికపత్రికలు ప్రకటింపలేదు. 'జనవాణి' దినపత్రికయు, వాహిని, ఆంధ్ర వారపత్రిక, ప్రభాతం, నవశక్తివంటి పత్రికలు, చేనేత వార్తలను వ్యాసములను ప్రకటించి ఉద్యమమునకు తోడ్పడినవి. పద్మశాలి, పత్రిక చేనేతసమస్యలకు ప్రాధాన్యత నిచ్చినది.

ఉద్యమవ్యాప్తికిగల యాటంకమును తీర్చుటకై ''నేత పరిశ్రమ'' పత్రిక 1938 మే నెలలో పుల్లంపేటనుండి శ్రీ నాగేంద్రుడుగారి సంపాదకత్వమున వెలువడినది. పత్రికా ప్రాముఖ్యమును గ్రహింపజాలని సంఘమున ఇట్టి మాస పత్రికను నిర్వహించుట చాల కష్టమయ్యెను. అన్నిశ్రమల కోర్చి, ధనాభావమును ఎదుర్కొని సంపాదకులు పత్రిక నొక్కసంవత్సరము సక్రమముగ నడిపిరి. పత్రికానిర్వహణము ధనసంపాదనమున నేగాక, చేనేత విషయముల సంగ్రహించుటయందును; సమస్యలపాఠకులకు సులభముగ గ్రాహ్యమగునట్లు ప్రకటించుటయందును, పత్రికను ఆకర్షణీయముగ చేయుటయందును, సంపాదకులు చాల కృషిచేసిరి.

# చేనేత విద్యాలయములు

చేనేత పారిశ్రామికులలో పారిశ్రామిక రాజకీయ ఆర్థిక వైజ్ఞానికాది విషయపరిజ్ఞానము కలిగించుట అవసరమని నాయకులు ప్రబోధించిరి. మొట్టమొదట చీరాలలో శ్రీ పెండెం వెంకటరాములుగారు చేనేత వయోజన విద్యాలయమును ప్రారంభించిరి. కొంతకాలము నిర్వహించిరి. చేనేత పారిశ్రామికోద్యమ వ్యాప్తికై ప్రచారకులను తర్ఫీదు చేయుటకుగాను చెన్నరాష్ట్ర చేనేత పారిశ్రామికసంఘము వారు 1945 నవంబరు–డిశంబరు నెలలో మంగళగిరిలో చేనేత విద్యాలయమును నడపిరి. డాక్టరు పట్టాభిసీతారామయ్యగారు ప్రారంభోత్సవము జరిపిరి. ఆంధ్రదేశంలోని వివిధ ప్రాంతములనుంచి చేనేత పారిశ్రామిక యువకులు సుమారు నూరు మంది శిక్షణపొందిరి.

శ్రీ ఆచార్యరంగా, సర్దార్ శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రి, శ్రీ కళావెంకట్రావు, శ్రీ విశ్వనాధ సత్యనారాయణ, శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు శ్రీ శరణు రామస్వామి చౌదరి, శ్రీ తాడిపత్రి శ్రీ కంఠం, శ్రీ దామర్ల రామాకాంతరావు, శ్రీ పెగడ కోటయ్య, శ్రీ అక్కల కోటయ్యగార్లు వివిధసమస్యలపై విద్యార్థులకు ఉపన్యాసములనొసంగిరి.

---

# మద్రాసు ప్రభుత్వ వస్త్రప్రణాళిక

"Gandhi's campaign for the development of home made Cloth Industry is no mere fad of a romantic eager to revive the past, but a practical attempt to relieve the poverty and uplift the standard of the village."

G. D. H. COLE.

*"A Guide to Modern Politics" Page 290*

## ఖాదీ తత్త్వము

భారత రాజకీయరంగమున మహాత్ముఁడు ప్రవేశించినతర్వాతనే జాతీయస్వాతంత్ర్య సంరంభము నూతన మార్గము ననుసరించినది. సత్యము, అహింస ఖద్దరు అను మూఁడుసూత్రములపై మహాత్ముఁడు తన జాతీయ స్వాతంత్ర్య సిద్ధాంతమును నిర్మించెను. భారతజాతీయ స్వాతంత్ర్యవీరుడైన సత్యాగ్రహికి ఖద్దరు బాహ్యచిహ్నము. భారత స్వాతంత్ర్య సమరమునకు రాట్నము ముఖ్యాయుధము. సత్యము, అహింస, ఖద్దరుధారణము భారతస్వాతంత్ర్య వీరునకు నిత్యానుష్ఠానములు.

ఖాదీ మహాత్ముని సృష్టి. ఖద్దరుతోడనే మహాత్ముఁడు ప్రథమ స్వాతంత్ర్యసమరమును ప్రారంభించెను. ఖద్దరు వలన నెట్లు భారతదేశ రాజకీయ, ఆర్థిక దాస్యవిముక్తి కలుగునదియు, మహాత్ముఁడు భారతప్రజానీకమునకు కరతలామలకము గావించెను. భారతస్వాతంత్ర్య సంపాదనకు

వక్తైకసాధనమని తాను త్రికరణశుద్ధిగ నమ్మిన ఖాదీ ఉత్పత్తిని అధికముచేయుటకై ప్రత్యేకముగ అఖిలభారత చరఖాసంఘమును ఏర్పరచి గత 25 సంవత్సరములలో అఖండమైన ప్రచారమును కృషిని గావించియుండెను. మహాత్ముని అసాధారణ కృషిఫలితముగ, భారతదేశమునందసమానమైన మార్పు, అభివృద్ధి ప్రత్యక్షమగుచున్నవి. భారతప్రజల జీవనవిధానమునందే గాక, మానసిక పరివర్తనమునందును మహాత్ముని సిద్ధాంతప్రభావములు ద్యోతకమగుచున్నవి. గాంధేయులయందు అహింస ఒక మతముగుటయే గాక, సామ్యజీవనము, ఉత్తమమైన ఆలోచన (Simple living and high thinking) అను సూత్రమును, విదేశవస్తు బహిష్కారణము, స్వదేశవస్తు స్వీకరణము, గ్రామపునర్నిర్మాణము మొదలగు కార్యక్రమములును, గాంధేయులకు జీవనవిధానముగా పరిణమించినవి. గాంధేయులయందు మహాత్ముని ముఖ్యసిద్ధాంతములయెడ అకుంఠిత భక్తివిశ్వాసములు మెండు. అచంచలమైన విశ్వాసమే కార్యసాధన కుపకరణమై సత్ఫలముల నొసంగును. మహాత్ముని సందేశమును అసాధారణ భక్తివిశ్వాసములతో నిర్వహించుటకు తమ సర్వస్వమును ధారబోసిన, పోయుచున్న వారి సంఖ్య బహుళము. గాంధేయులు అచంచల భక్తివిశ్వాసములు, కేవల స్వార్థపరత్వవలనగాని, ఇతర తాత్కాలికప్రయోజనములవలనగాని జనించినవని నుడువుట మిగుల హాస్యాస్పదమగుటయే గాక, చిత్తశుద్ధినికూడ ప్రకటించదు.

భారతీయులు మహాత్ముని నాయకత్వమున మూడు పర్యాయములు స్వాతంత్ర్యసంరంభమును నడిపిరి. గత పాతికసంవత్సరముల యనుభవమువలన మహాత్మునికి తన ఖాదీసిద్ధాంతమునందు విశ్వాసమధికమైనది. భారతావని యందలి గ్రామసీమలు, నిత్యకళ్యాణము, పచ్చతోరణ మునై కళకళలాడవలయునన్న రాట్నలక్ష్మి గ్రామకుటీర ములయందు నిత్యము నాట్యమునల్పుటయే శరణ్య మని మహాత్ముఁడు నిరూపించుచున్నాడు. అధునాతన భారత జాతికి చిహ్నమైన త్రివర్ణపతాకమును ఖాదీఉత్పత్తికి సాధన మైన రాట్నము అధిష్ఠించుటయే మహాత్ముని ఖాదీతత్త్వాధి క్యతను, పవిత్రతను నిరూపించుచున్నది. రాటముపై తీయ బడు ప్రతి బారెడు ఖద్దరునూలునందును భారతపారతంత్ర్య మును పారదోలు ఆత్మారాముని కళ్యాణనృత్యమే తనకు నిత్యగోచర మగుచున్నదని మహాత్ముఁడు వెల్లడించియుం డెను. కనుక మహాత్ముడే ఖాదీ; ఖాదీయే మహాత్ముడు. ఇదియే మహాత్మునకు, ఖద్దరునకు గల అవినాభావ సంబంధము.

ఈ అనంతకాలచక్రమున చారిత్రక సంఘటనలు తిరిగి సంభవించుచుండును. మూడవ జాతీయస్వాతంత్ర్య సమరము నూత్నపథమున నడుపబడెనుకదా! 53-వ రాంఘర్ కాంగ్రెస్ సమావేశమున సమస్త భారతప్రతి నిధులు మహాత్ముని తమ సమరమునకు ఏకైకనాయకునిగా నెన్నుకొనిరి. స్వాతంత్ర్య స్వయంనిర్ణయాధికారమును నిర్వ చించు ఒక్కటేతీర్మాన మేకగ్రీవముగ నంగీకరింపబడెను.

స్వాతంత్ర్యసమరమును సత్వరముగ ప్రారంభింపవలసినదిగ భారతీయులు మహాత్ముని కోరినసందర్భమున, మహాత్ముడు భారతప్రతినిధుల కోర్కెను అంగీకరించుచూ, తాను సర్వసైన్యాధ్యక్షునివలె సమరమును నడుపుటకు. తన భారతీయ సత్యాగ్రహ సైనికులు తన షరతులను మారుమాట్లాడక అనుసరింపగోరెను. సత్యము, అహింస, ఖాదీ అను నీ మూడును మహాత్ముని షరతులు. భారతీయులు మహాత్ముని తమ నాయకునిగా వరించినతర్వాత మహాత్ముడు కాంగ్రెసు సభలో ఇట్లుపన్యసించెను. "సత్యము, అహింస సిద్ధాంతములపై భారతీయులకు సంపూర్ణవిశ్వాసమున్నను, ఖద్దరుపై నంత విశ్వాసములేనట్లు తోచుచున్నది. అట్టి విశ్వాసము లేని సైనికులతో పోరాటమును ప్రారంభించుట అపజయమునకు కారణము. కనుక ప్రతి కాంగ్రెసుసభ్యుడును నిత్యము ఖద్దరు వడకవలయును, ఖాదీని నిత్యము వ్రతముగ ధరింపవలయును. ఖాదీసిద్ధాంతముపై నమ్మకములేని లక్షలమంది కాంగ్రెసుసభ్యులకంటె, నాయకుని సిద్ధాంతముల నమ్మి ఆచరించు సభ్యులు పదిమందియైన చాలు. కనుక కాంగ్రెసు సభ్యులు నిర్మాణ కార్యక్రమమునందును, శిక్షణయందును నాకు సంపూర్ణవిశ్వాసము కలిగించునంతవరకు సంరంభమును ప్రారంభింపను" ఇది మహాత్ముని ఉపదేశసారము.

పైన వివరించినవిధమున దేశస్వాతంత్ర్యమునకును, ఖాదీకిని సంబంధమును మహాత్ముడు కల్పించినను, కాంగ్రెసువాదులు మహాత్ముని సిద్ధాంతమును ఆచరించుటయందు వెనుకబడుచున్నందుననే మహాత్ముడు నాటికాంగ్రెసు సమా

వేశమునం దట్లు ఉపన్యసించుట తటస్థించినది. మహాత్ముని వ్యక్తిత్వమునకును, నైతికశక్తికిని లొంగి, మహాత్ముని ఖాదీసిద్ధాంతమును చాలమంది విశ్వసించుచున్నారేగాని త్రికరణశుద్ధిగ ఆచరించుటలేదని గత పాతికసంవత్సరముల లోని ఖాదీవ్యాప్తిని సింహావలోకనము చేసిన తెలియనగు చున్నది. ఖాదీసిద్ధాంతముపై గాంధేయులయందు అచంచల విశ్వాసమున్నను. సామాన్య కాంగ్రెసుసభ్యులందరియం దింతను ఇట్టివిశ్వాసము నేటికిని ద్యోతక మగుటలేదు. అంతే గాక కాంగ్రెసు టిక్కెట్టుపై శాసనసభల నలంకరించిన వ్యక్తులుకూడ కొందరికను ఖాదీప్రణాళికకు తమ వ్యతిరేకతను ప్రకటించుచుండుట చాల వింతయైన విషయము. తాము ఖాదీప్రణాళికతో నేకీభవింపజాలనిచో, తమస్థానములకు రాజీనామాలనిచ్చి మరల తమ స్వంతసిద్ధాంతములపై సభ్యత్వమును పొందవలయునేగాని, కాంగ్రెసు ముద్రను ధరించుచు, వ్యతిరేకతను ప్రకటించుట లక్షణము కాదు. పెద్దవారివిషయమే యిట్లుండ అజ్ఞానమున మునింగి యున్న సామాన్యప్రజలవిషయము వేరుగ చెప్పవలయునా! సామాన్యప్రజలు, అజ్ఞానమువలననేమి, ఆర్థికదార్బల్యము వలననేమి మార్కెట్టులో చౌకగ లభించు వస్త్రమునే కొని వాడుకొనకతప్పదుకదా! కనుక భారతావనియందు ఖద్దరుధారణము సర్వసాధారణము కావలయునన్న వట్టి ప్రచారములతో ప్రయోజనము లేదనియు, ఖద్దరు ఉత్పత్తికి అవసరమైన పరికరములు, అవకాశములు కల్పింపబడ వలయుననియు, కల్పించిన అవకాశములను, చేసిన పరికర

సహాయ్యమును వినియోగించుకొను మానసికపరిణామము కూడ ప్రజానీకమున కలుగునట్టి ఏర్పాట్లను గావించు జాతీయప్రభుత్వ మేర్పడుటయే శరణ్యమనియు వెల్లడియగు చున్నది. నేటి మనజాతీయప్రభుత్వ ప్రధాని శ్రీ టంగుటూరి ప్రకాశంగారు మనకట్టి అనుకూలవాతావరణమును కల్పింప సంసిద్ధులై యున్నారు. ప్రభుత్వ వస్త్రప్రణాళికను మహాత్ముని జన్మదినోత్సవసందర్భమున ప్రారంభించుచు ఎర్రగొండపాలెంలో వారిట్లుపన్యసించిరి.

"ఈనాడు గాంధీ జన్మదినోత్సవం. అందరు ఈ పర్వదినం జరుపుతారు. గత 25 సంవత్సరములుగా రాట్నం కొరకు ఆయన చేసినకృషి చెప్పశక్యంకాదు. మొదటి నుండి రాట్నమే పనిచేస్తూఉంటే, మన మీదుస్థితికి రాము.

గాంధీమహాత్ముని జన్మదినోత్సవంనాడు వారికి చేసిన వాగ్దానంమేరకు నేనీ రాష్ట్రప్రధానిగా ఉండి ప్రభుత్వం తరఫున ఈ రాష్ట్రానికంతకు ఈ ప్రారంభోత్సవం జరుపుతున్నాను.

చర్ఖా అభివృద్ధికి మిల్లులపోటీ పెద్దఆటంకం. కొందరు మిల్లులు, అందు తయారయ్యే గుడ్డ లేకుంటే బ్రతుకు తెరువులుపోతవనే అభిప్రాయంతో నున్నారు. కాని, అవి పెట్టుబడిదార్ల ఉపయోగముననేగాని, ప్రజలఉపయోగానికి కాదు. ఖాదిపరిశ్రమ అభివృద్ధి కావలెనంటే ప్రభుత్వ సహకారం ఉండవలెను. ఇకముందు మిల్లులకు ప్రభుత్వ సహకారం ఉండదు. క్రొత్తమిల్లులు మంజూరుచేయబడవు.

చెరువులు, తదితర జలాధారములు త్వరలో కూర్చు యేర్పాట్లు చేయుచున్నాము. అప్పయినాచేసి త్వరలో తగు యేర్పాట్లు చేస్తున్నాము. కొంత ఓపికచూపడం అవసరం.

ఇకముందు మద్రాసుకు యితరగ్రామములకు యేలాటి తేడా లుండవు. మద్రాసులో చెప్పులుకుట్టేవాడు యెంత చక్కగా తయారుచేస్తాడో, పల్లెలలోకూడా ఆలాగే తయారుచేయగల విద్యలు నేర్పుతాము.''

మన దేశములోని జనులందరు ఖద్దరు వస్త్రధారణ సిద్ధాంతము నంగీకరించి, అందుకు తగిన ఉత్పత్తిని సాగించియున్నచో, యుద్ధకాలమునందలి అసాధారణపరిస్థితులవలన నేటి యుద్ధానంతరకాలమున నేర్పడిన ఈ వస్త్రసమస్య (కరువు) వచ్చెడిది కాదనుట నిర్వివాదము. మహాత్ముడు, కాంగ్రెసువాదులు పెద్దపెద్ద మిల్లులస్థాపనకు వ్యతిరేకులేగాని, కుటీరపరిశ్రమలయందు, పారిశ్రామికుల శ్రమను తగ్గించుసాధనముల ఉపయోగమునకు ఎన్నడును ప్రతికూలురుకారు. కనుక రాట్ననిర్మాణమునం దభివృద్ధిని కల్పించుట వడుకునూలు ఎక్కువగుటకేకదా! కుటీరపరిశ్రమలయందు విద్యుచ్ఛక్తి వినియోగమునుకూడ మహాత్ముడంగీకరించుచున్నాడు. ''ప్రతికుటీరంలోను విద్యుచ్ఛక్తిని ఉంచుకొనగలిగినట్లయితే గ్రామస్థులు, తమసాధనాలను విద్యుత్సహాయంతో నడిపించుకొన్నప్పటికి నాకేమి అభ్యంతరములేదు'' అని హరిజన్ (22-6-35) లో లోగడనే మహాత్ముడు వ్రాసియున్నాడు.

---

## ఖాదీ ఆర్థిక సిద్ధాంతము

"మిల్లుగుడ్డతో పోటీచేయగల నాజూకైన ఖాదీని పట్టణవాసులకు సప్లయిచేసి తదితర పరిశ్రమలలోవలెనే, రోజు కొన్నిగంటలు పనివాళ్లకు పనికల్పించడం ఖాదీపరిశ్రమయొక్క ముఖ్యోద్దేశం కాదు. ఇది వ్యవసాయకుల కొరకు ఉత్పత్తికావాలి. అందుకోసమది స్వయంపోషకమై గ్రామాలలో వ్యాపించాలి. గ్రామస్థులు తాము భుజించే ఆహారమును తాము వండుకున్నట్లే తాము కట్టుకునే బట్టనుకూడ తామే తయారుచేసుకోవాలి. తమకుకాగా ఏమైనా మిగిలితే అమ్ముకోవచ్చును." (Economics of khadi)

ప్రతి భారతీయుడును తనకు సరిపోవు ఖద్దరును వడికి ధరింపవలయుననియే మహాత్ముని కోర్కె. అట్టిఖాదీవ్యాప్తితో స్వయంసంపూర్ణమైన భారతస్వరాజ్యమునే మహాత్ముడు కాంక్షించునది. శ్రీ అగర్ వాలాగారిచే తయారుచేయబడిన గాంధీ ప్రణాళిక ఖాదీ ఉత్పత్తినిగూర్చి యిట్లు వ్రాయుచున్నది. "ఖాదీ ఉత్పత్తిని పునరుజ్జీవింపజేయడంలో విరామమెఱుంగని గాంధీజీయొక్క నిరంతరకృషిని ఎంతైనా అభినందించవలసి ఉంది. ఈ సందర్భములో అఖిలభారత చరఖాసంఘమువారు చేస్తున్నపని చాలా ఉపయోగకరంగాను, శ్లాఘనీయంగాను ఉంటున్నది. 13,450 గ్రామాలలో నివసిస్తున్న 2,75,000 మంది వడికేవారు, నేసేవారు 95,51,478 గజాలఖాదీని ఉత్పత్తిచేసినట్లు అ. భా. చ. సంఘమువారి 1940 సంవత్సరపు నివేదికనుబట్టి తెలుస్తు

స్నది. వడికేవారికిగాని, నేసేవారికిగాని ఆ సంవత్సరం మజూరీక్రింద ముట్టినమొత్తం రూ. 34,85,609.''

పై ప్రణాళికనుబట్టి, మహాత్ముని విరామమెఱుంగని నిరంతర కృషి ఫలితంగా తయారైన ఖాదీబట్ట సుమారు ఒక కోటి గజాలు అని స్పష్టమగుచున్నది. ఈ గొప్ప మొత్తము, మనము యుద్ధానికి పూర్వము 1937 సంవత్సరంలో వాడిన గుడ్డల వివరములను పరిశీలించినచో, మనకు కావలసిన మొత్తములో ఎంత స్వల్పమో తప్పక తెలియ గలదు.

1937 సంవత్సరములో

| | | |
|---|---|---|
| విదేశ మిల్లుబట్టలు | 65 | కోట్లగజాలు. |
| స్వదేశి మిల్లుబట్టలు | 370 | ,, |
| చేనేత బట్టలు | 185 | ,, |
| మొత్తం | 620 | ,, |

ఒక కోటి గజాల ఖద్దరు చేనేతబట్టలోనే చేరింది.

మనదేశమునకు కావలసిన మొత్తము బట్టలో 1/3 వంతు చేనేతబట్ట (అనగా మిల్లునూలుతో చేమగ్గాలపై తయారైనబట్ట). అ. భా. చ. సంఘమువారి లెక్కలలో చేరని ఇతరసంస్థలచేతను, ప్రత్యేకవ్యక్తులచేతను వడికి తయారుచేయబడిన ఖద్దరువస్త్రాలు అదనంగా ఒక అర్ధకోటి గజాలు ఉండవచ్చునని మదింపువేసినను, మొత్తం ఖద్దరు ఉత్పత్తి, చేనేతబట్టలో నూరవవంతుమాత్రమే! అంటే

మొత్తం బట్టలో 1/400 వంతు. మహాత్ముని నాయకత్వమున, 20 సంవత్సరములు నిరంతరకృషిఫలితంగా మనకు కావలసిన మొత్తం బట్టలో నన్నూరవవంతుమాత్రమే ఖాదీఉత్పత్తి యైనదంటే, మనకు కావలసిన మొత్తం 640 కోట్ల గజాల ఖద్దరు ఉత్పత్తియగుటకు, ఇప్పుడు మనము చేయుచున్న కృషికంటె 400 రెట్లు ఎక్కువకృషి జరుగవలయునుకదా! అని శంకింప పనిలేదు. మనదేశమున తగినంత దూది ఉన్నది. కావలసినంతమంది మనుష్యులు ఉన్నారు. కావలసినది వానిని సక్రమమార్గమున పెట్టు విధానమే! అది జరిగినప్పుడే మహాత్ముని సిద్ధాంతము సఫలమగును. మహాత్ముని సిద్ధాంతమున కట్టి అఖండవిజయమును సంపాదింపవలయునన్న నిర్మాణకార్యక్రమమును అమలు జరుపుటయందు అచంచల భక్తివిశ్వాసములుగల జాతీయప్రభుత్వమునకు తప్ప వేరొక్కసంస్థకు సాధ్యము కానేరదు. రాష్ట్రములయందు జాతీయప్రభుత్వము లేర్పడియుండ ఆహారము, బట్టలవిషయమున నేడేర్పడిన క్లిష్ట వాతావరణమే మహాత్ముని ఖాదీసిద్ధాంతవిజయమునకు చాల అనుకూలమైనదని నిశ్చయమగుచున్నది.

ఇట్టి వాతావరణమును పురస్కరించుకొనియే, మద్రాసు ప్రధాని శ్రీ ప్రకాశంగారు అఖిలభారత చరఖా సంఘమువారి సహాయంతో ఒక స్వయంసంపూర్ణమైన ఖాదీఉత్పత్తి ప్రణాళికను మద్రాసు రాష్ట్రమునకు సిద్ధము చేయించగలిగిరి. శ్రీ ప్రకాశంగారు గాంధేయులలో ప్రథమగణ్యుడు. అఖండమేధావి. అతిసాహసవంతుడు. తాను

నమ్మిన విషయమును, అతిసాహసముతో కార్యరూపమున బెట్టు కర్మయోగి. అందువల్లనే కాంగ్రెసు ఎన్నికలవాగ్దానమును నిర్వహించుటకై కంకణము కట్టుకున్నాడు. తాను ప్రవేశపెట్టనున్న స్వయంసంపూర్ణ సమగ్రప్రణాళికకు మహాత్ముని శుభాశీస్సులు పొందినాడు. భారతదేశమునందలి యితర రాష్ట్రములకంటె ఖద్దరు ఉత్పత్తివిషయమున సింహమువలె హుంకరించి ముందంజవేసి ఇతర రాష్ట్రములకు మార్గదర్శకుడైనాడు. ఇతర రాష్ట్రములకంటె మద్రాసు పురోగామి యగుటకు మద్రాసు రాష్ట్రములోని చేనేత పరిశ్రమయొక్కయు, పారిశ్రామికులయొక్కయు, స్థితిగతులు కూడ, కొంతవరకు దోహద మొసంగినవనుటకు సందేహము లేదు. (మద్రాసు రాష్ట్రములోని చేనేత పారిశ్రామికోద్యమమును గురించి విపులముగ లోగడ అధ్యాయములయందు వివరింపబడెను). యుద్ధానంతర పరిస్థితులయందు మిల్లునూలు పంపకవిషయమున భారతప్రభుత్వము అవలంబించుచున్న విధానమువలన మద్రాసు రాష్ట్రములోని 5లక్షల చేనేత మగ్గములకు, నెలకంతా సరిపోవు నూలు సప్లయి కాక, నెలలో ప్రతి పారిశ్రామికునకు 20 దినములు పనిలేక ఉండుటయు, తత్ఫలితముగ చేనేతబట్టల ధరలు విపరీతముగ పెరుగుటయు, మిల్లుబట్టలకోటా మద్రాసుకు తగ్గింపబడుటయు, ఆ తక్కువ కోటాకూడా సకాలమున సక్రమముగ అందకపోవుటచేతను ప్రజలలో బట్టలకై ఒక విధమైన గగ్గోలు ప్రారంభమయ్యెను. కనుక ఇట్టి బట్టల కృత్రిమ కొరతను నిర్మూలించుటకు 5 లక్షల చేనేతమగ్గములున్న

మద్రాసురాష్ట్రంలోనే సాధ్యముకాకున్న, చేనేతమగ్గములు ఎక్కువగ లేని ఇతరరాష్ట్రములయందు సంపూర్ణ ఖద్దరుఉత్పత్తి సాధ్యమగునా! ఖద్దరునూలు ఉత్పత్తి సప్లయిల విషయమున సరియైన విధానములేని దినములలో మిల్లునూలునే వాడు చుండిన 5 లక్షల చేనేతపారిశ్రామికులున్నూ, ఖద్దరు నూలు ఉత్పత్తికై సరియైన ప్రణాళిక అమలు జరుపబడినచో ఖద్దరు నేయుటకు సంసిద్ధులై శ్రీ ప్రకాశం మంత్రిగారికి బాసటలై నిల్చిరి. కనుక పైన వివరింపబడినట్లు మద్రాసురాష్ట్రంలోని ప్రత్యేక అనుకూల వాతావరణమే, శ్రీ ప్రకాశం ప్రధాని ముందడుగు వేయునట్లు చేసినది. అంటే ప్రణాళికపై వ్యతిరేక వాతావరణంగాని, ప్రతికూలవిమర్శ ప్రచారములు గాని ఈరాష్ట్రంలో బొత్తుగ లేవని మా యుద్దేశ్యం కాదు. శ్రీ ప్రకాశంగారి ప్రణాళికకు వ్యతిరేక వాతావరణంగాని, ప్రతికూలవిమర్శ ప్రచారములుగాని గత రెండు నెలల్లో చెల రేగిన వన్నచో వానికి ప్రత్యేకదృక్పథము, స్వార్థపరతగల కొన్నిసంస్థలును, పూంజీదారులును ముఖ్యకారణము. అంతే గాని ప్రణాళికాతత్త్వమును ఏమాత్రమైనను గ్రహింపగలిగిన ప్రజాసామాన్యమంతయు శ్రీ ప్రధాని ప్రకాశంగారికి బాసటయై నిలువగలదనుటలో అతిశయోక్తి లేదు.

సమగ్రమైన ప్రణాళికను ప్రభుత్వములు అమలు జరిపినచో, ఖాదీఉత్పత్తి విషయంలో మన గ్రామాలు స్వయంసంపూర్ణములుగా నుండుటయేగాక పట్టణములకు కూడ ఎగుమతి చేయగలిగిన స్థితిలోనున్నవని అఖిలభారత చరఖాసంఘమువారి అంచనా అంకెలవలన స్పష్టమగు

చున్నది. "ఇండియాలోని గ్రామంయొక్క సగటు జనసంఖ్య 500. సంవత్సరానికి మనిషికి 20 గజాలవంతున గ్రామానికి 10,000 గజాలు ఖాదీ కావలసిఉంటుంది. ఒకచదరపు గజం నేయడానికి నాలుగు చిలపలు (Hanks) నూలు కావాలి, కాబట్టి ఒక గ్రామానికి కావలసిన బట్ట నేయడానికి 40,000 చిలపలనూలు కావలసివస్తుంది. సాధారణంగా ఒకమనిషి. 16 వ నెంబరునూలు ఒకచిలప వడకడానికి మూడుగంటలు పడుతుంది. కాబట్టి గ్రామంలోని వారందరూ 120,000 గంటలు పనిచేయవలసి ఉంటుంది. ఆ లెక్కకంటె తక్కువ వయస్సుగల పిల్లలు, వృద్ధులు, బలహీనులు, వికలాంగులు మొదలైనవారందరు కలిసి గ్రామంలో నాలుగోవంతు ఉండ వచ్చుననుకొంటె ఇక 375 మంది మాత్రమే గ్రామస్థుల-దరి కోసం వడకవలసివస్తుంది. కాబట్టి ఒక్కొక్కరు సంవత్సరంలో 320 గంటలు వడికితేచాలును. అనగా గ్రామంలోని ప్రతి బలంగలమనిషీ, సుమారు రోజుకొకగంట వడికినట్లయితే గ్రామానికి కావలసినబట్ట తయారవుతుందన్నమాట. కాని గ్రామస్థులు తలుచుకొంటే, స్త్రీలు, ప్రాథమికపాఠశాలల్లోని పిల్లలతోసహా రోజుకు రెండుగంటలు వడికినా వడకగలరు. ఈ విధంగా గ్రామాలు బట్టల విషయంలో స్వయంసంపూర్ణములు కావడమేగాక, తమకుకాగా మిగిలినవాటిని పట్టణాలకు పంపగల స్థితిలోకూడా ఉండగలవు."

ఖాదీఉత్పత్తికి కావలసిన పనిముట్లు తక్కిన పరికరాలకంటె చాలాచౌక. ఇక నేతవిషయ మాలోచిస్తే

ఒక్కొక్క మగ్గానికి సంవత్సరానికి 6000 చిలపల నూలు కావాలి. కాబట్టి యేడు మగ్గములు గ్రామమంతటికి సరిపోయే గుడ్డను తయారుచేయవచ్చును.

(గాంధిప్రణాళిక - కుటీరపరిశ్రమలు.)

## మనదేశమున కవసరమగు వస్త్రములన్నియు చేమగ్గములు సప్లయిచేయగలవా?

ఏ దేశం తన జనాభాలో అధికసంఖ్యాకులకు సంవత్సరంలో ఆరుమాసాలు పని కల్పించ లేదో ఆ దేశం ఆర్థికంగా అభివృద్ధిపొందినదని చెప్పుకొనుటకు అర్హత లేదు. మన భారతదేశం వ్యవసాయం ప్రధాన వృత్తిగాగల దేశం. మన రైతులకు సంవత్సరంలో ఆరుమాసాల విశ్రాంతి ఉంటుంది. ముఖ్యంగా రైతుస్త్రీలకు, ఉద్యోగస్తుల కుటుంబాలలోని స్త్రీలకు యెక్కువ విశ్రాంతి ఉంటుంది. వీరు ఏపనిలేకుండా తమ తీరికసమయాన్ని వృథాగా గడపుటకంటె నూలు వడకుట వారికీ, దేశానికీ కూడా చాలా లాభం, ఉపయోగం. వారు వడికిన నూలుతో వారి గ్రామంలోని చేనేతవారి శ్రామికునిచేత వస్త్రము నేయించుకొన్నచో, వారికి వస్త్ర సమస్య సులభంగా పరిష్కారమైపోతుంది. ప్రాచీన భారత వర్షంలో రైతులకు, ముఖ్యంగా స్త్రీలకు నూలు వడకటం ఒక ఉపవృత్తిగా ఉండేది. వారు తమ తీరికసమయంలో నూలువడికి, తమ గ్రామ చేనేత పారిశ్రామికునిచేత వస్త్రము నేయించుకొనేవారు. తద్వారా కార్మిక కర్షకులకు అన్యోన్య

మైత్రి, పరస్పరసహకారం ఉండేవి. గ్రామాలు వస్త్రవిష యంలో స్వయంసమృద్ధంగా ఉండేవి.

మన దేశమున కవసరమైన వస్త్రములను మన చేమగ్గ ములు సప్లయిచేయగలవా యని చాలామందికి సందేహ ముండవచ్చును. మనం మిల్లులమీదనే ఆధార పడడం మేలని, అవసరమైతే యింకా క్రొత్తమిల్లులను స్థాపించవలయునని అట్టివారి అభిప్రాయం. కాని మన భారత వస్త్ర పరిశ్రమయొక్క పూర్వచరిత్ర నొకసారి సింహావ లోకనం చేస్తే యీ సందేహంరాదు. మనదేశంలో మొట్ట మొదటి బట్టలమిల్లు 1853 లో స్థాపించబడినది. అంతకు పూర్వంవరకు మన చేతిమగ్గముపైన ఖద్దరువస్త్రముల నుత్పత్తిజేసి మన దేశ ప్రజల కవసరమైనంతవరకు సప్లయి చేయుటయేగాక విదేశములకు కూడ కోట్లకొలది రూపాయిల కిమ్మతుగల వస్త్రములను సప్లయిచేసియుండిరి.

1938,39 లెక్కలప్రకారం మనదేశమునకు కావల సిన వస్త్రములలో మనమిల్లులు 420 కోట్ల గజములను, మన 25 లక్షల చేమగ్గములు 200 కోట్ల గజములను సప్లయిచేయ గలిగినవి. మన దేశమునకు సగటున మనిషి 1కి 16 గజముల చొప్పున, లెక్కవేస్తే మొత్తము 640 కోట్ల గజముల వస్త్రములు గావాలి. కనుక 640 కోట్లగజములు మొత్తము చేమగ్గములే సప్లయిచేయాలంటే మనకు మొత్తం 80 లక్షల చేమగ్గము లవసరము. అయితే యిన్నిమగ్గాలు ఎక్కడ లభిస్తా యను సందేహముండ నవసరంలేదు. చేనేతపరిశ్రమ జీర్ణించిపోయిన రోజులలోనే అనగా 1905 నాటికి మన

దేశంలో మొత్తం 60 లక్షలచేమగ్గా లున్నవని ఇ. బి. హావెలు చెప్పియున్నారు. అయితే అప్పటిమగ్గాలన్నీ త్రోపుడు మగ్గాలే (Throw shuttle looms) గాని ఫ్లై మగ్గాలు (Fly shuttle looms) గావు. *

ఒక్క ఫ్లైషటిల్ మగ్గానికి మూడు చేమగ్గాలు సమము. అంటే చేమగ్గముల ఉత్పత్తి చాల నెమ్మది. ఫ్లైషటిల్‌లో ఉత్పత్తి మూడురెట్లు హెచ్చుగా చేయ వచ్చును. ఈనాడు మన దేశంలో ఉన్న 25 లక్షల చేమగ్గాలలో, త్రోపుడుమగ్గాలు 64%. ఫ్లైషటిల్ మగ్గములు 35% మాత్రమే ఉన్నవి. అంటే ఫ్లైషటిల్ మగ్గములు 8,75,000 లున్నూ, త్రోపుడు మగ్గములు 16,00,000 లున్నూ వున్నవి. కనుక పైన మనకు కావాలనుకున్న 80 లక్షల చేమగ్గములలో 35% ఫ్లైషటిల్ మగ్గములు, 64% త్రోషటిల్ మగ్గముల దామాషా ప్రకారము. లెక్కవేస్తే 28,00,000 ఫ్లైషటిల్ మగ్గాలు, 51,20,000 త్రోషటిల్ మగ్గాలు అవసరమగును. ఇందులో పైనచూపిన 51,20,000 త్రోషటిల్ మగ్గాలను కూడా ఫ్లైషటిల్ మగ్గాలుగా మార్చి వేసేయెడల 17,06 666 ఫ్లైషటిల్ మగ్గాలకు సమానమగును.

---

* (చేమగ్గాలు రెండురకము లున్నవి. పూర్వంనుంచీ అమలులో ఉండేవి త్రోపుడుమగ్గాలు. అంటే నాడిని చేతితోనే ఒకప్రక్కనుంచి యింకొక ప్రక్కకు విసరవలసియున్న మగ్గాలు. రెండవ రకము 1733 సం లో జాన్ కే అనువాడు కనిపెట్టినమాదిరి. ఈరకము మగ్గములో నాడిని చేతితో విసరకుండా ఒక త్రాడులాగినంతలోనే నాడి యిటునటు సులభంగా, త్వరగా పోగలదు. ఈ రెండవరకము మగ్గాలు మనదేశంలో 1910 నుంచే వాడుకలోనికి ప్రభుత్వమువారిద్వారా ప్రవేశపెట్టబడినవి.)

కనుక మొత్తం 45,06,666 సైమటిల్ మగ్గాలు మనకు కావలసిన బట్టనంతా తయారుచేయగలవు. ఈనాడు దేశంలో ఉన్న 25 లక్షల చేమగ్గములను సైమటిల్ మగ్గాలుగా మార్పుచేసుస్తే మనకు ఇంక 20 లక్షల సైమటిల్ మగ్గాలు మాత్రమే క్రొత్తగా కావాలి. ఇటీవల మన దేశంలో చేమగ్గాల సంఖ్య పెరుగుతూవున్నది. దేశంలో ప్రజలు, ప్రభుత్వముకూడా తగినంత ప్రోత్సాహాన్నిస్తే తప్పకుండా అన్నిమగ్గాలు బయలుదేరుటకు ఏమియు సందియము లేదు. ఇందువల్ల యింకా దాదాపు రెండుకోట్లమంది నిరుద్యోగులకు పని కల్పించవచ్చును.*

అయితే త్రోపుడుమగ్గాలను, సైమటిల్ మగ్గాలుగా మార్చాలంటే కొంచెము ఖర్చు అవసరమే. లోగడ 1932-33 సంవత్సరముల మధ్య మనదేశములోని ధనికుల పెట్టుబడితో సాగించబడుతున్న బట్టల యంత్రములను ప్రోత్సహించవలయునని ఇండియా ప్రభుత్వమువారు 40½ కోట్ల రూపాయలను రక్షణసుంక రూపంలో ప్రజలవద్దనుంచి వసూలుచేసి, వస్త్రముల మిల్లులకు, ఖర్చుపెట్టియున్నారు.

---

* బర్మాదేశంలో బయలుదేరిన స్వదేశీయోద్యమ ఫలితంగా, అంతవరకు మదరాసు రాష్ట్రంనుంచి దిగుమతిచేసికొంటున్న లుంగీలను నిషేధించవలెనని బర్మాదేశీయులు ప్రచారం సాగించారు. తత్ఫలితంగా బర్మాస్త్రీలు విశ్రాంతి సమయంలో నేతనేస్తూ, తమ లుంగీలను తామే తయారుజేసుకోవటం ప్రారంభించారు. ఇందువల్ల మదరాసు లుంగీల వ్యాపారమునకు కొంత దెబ్బతగిలింది. ఇట్టి స్వదేశాభిమానముతో, గృహపరిశ్రమల రక్షణపైగల అభిమానముతో, స్వంత వస్త్రకొరత నివారణకు మన ప్రజలు మాత్రము వెనుదీయరని భావించవచ్చునుగదా?

ఇంకఅనేకపరిశ్రమలరక్షణకుకూడా చాలధనవ్యయంచేశారు. పెద్ద ధనికుల రక్షించుటకే అట్టి విధానము నవలంబించిన ప్రభుత్వము, యీనాడు దేశంలో పతనావస్థయందున్న చేనేత పారిశ్రామికులను రక్షించు దృష్టితో, గృహపరిశ్రమలలో ప్రధానమైన చేనేతపరిశ్రమకు ప్రోత్సాహమొసంగు దృష్టితో, వస్త్రోత్పత్తివిషయంలో గ్రామాలను, దేశాన్ని స్వయం సమృద్ధిగా చేయాలనే దృష్టితో, దేశంలోని నిరుద్యోగ సమస్యా నివారణదృష్టితో వివిధరాష్ట్రప్రభుత్వములవారు అట్టి అదనపుఖర్చు భరించుటకు వెనుదీయగూడదు. ఈవిధంగా చేనేతపరిశ్రమను రక్షించి, గ్రామాభ్యుదయమును చేకూర్చుటకు వినియోగించిన ఖర్చు సద్వినియోగమే యగును.

విద్యుచ్ఛక్తిని సులభంగా సప్లయిచేస్తే మన చేమగ్గములపై ఉత్పత్తిని యింకా పెంచవచ్చును. అప్పుడు మన ప్రజలకు ఒక్కొక్కరికి 16 గజముల ప్రమాణమునకు మించి గుడ్డ సప్లయి చేయవచ్చును.

పై విధముగ మనదేశమునకు మిల్లులతో నిమిత్తము లేకుండగనే మన వస్త్రసమస్యను సులభముగా పరిష్కరించవచ్చును.

## చేమగ్గము ఆర్థికముగా సౌష్ఠవమైనది

చేమగ్గము ఆర్థికంగా సౌష్ఠవమైనదిగాదని సామాన్యులవాదం. దృఢనమ్మకం. కాని మిల్లుపరిశ్రమ, చేనేత పరిశ్రమల రెండింటిని పోల్చి వాటి తారతమ్య సమస్యపై

ప్రత్యేకంగా కృషి జేసిన ఆర్థిక శాస్త్రజ్ఞులు, సాంకేతిక విద్యానిపుణులు మాత్రం చేమగ్గపు పరిశ్రమ ఆర్థికంగా సాధ్యమైన దేనని ఋజువు జేసియున్నారు. మదరాసు ప్రభుత్వ వస్త్రపరిశ్రమ శాఖకు పూర్వ అసిస్టెంటు డైరెక్టరు, మదరాసు గవర్నమెంటు టెక్స్టైల్ ఇన్‌స్టిట్యూట్ ప్రిన్సిపాల్ అయిన సి. యం. అసల్‌నాన్‌గారు తన "Cotton Cloth Impassy" (పే. 15) లో చేమగ్గము ఆర్థికంగా సాధ్యమైన దేనని ఈవిధంగా ఋజువుచేసియున్నారు:

"ఒక మిల్లుమగ్గము పనిజేయాలంటే రు. 600/- ల పెట్టుబడికావాలి. కాని ఒక్క చేమగ్గం పనిజేయాలంటే రు 30/- ల పెట్టుబడిచాలు. అంటే ఒక్క మిల్లుమగ్గానికి పెట్టే పెట్టుబడితో 20 చేమగ్గాలు పనిచేయించవచ్చును. ఒక్క మిల్లుమగ్గంపై రోజుకు 50 గజాలగుడ్డ మాత్రమే నేయవచ్చును. ఆ దేకాలములో చేమగ్గము మీద 10 గజాలు నేయవచ్చును. కనుక 20 చేమగ్గములు కలిసి ఒక రోజుకు 200 గజాలగుడ్డ నేయగలవు. కనుక ఒకమిల్లు మగ్గపు పెట్టుబడితో 20 చేమగ్గములు స్థాపించి, మిల్లు మగ్గము మీదకంటె చేమగ్గముమీద నాల్గురెట్లు యెక్కువగా గుడ్డ ఉత్పత్తి చేయవచ్చును.

"యంత్రముల స్థాపనకయ్యే ప్రారంభ ఖర్చులు, భూమి, కట్టడములు, రైల్వే ప్రక్కదారి (Railway siding) నీటివసతి, విద్యుత్తువగైరాశక్తి సంపాదన, పంటసరుకు పడుగుపేకలు తయారుచేయుట కవసరమగు యంత్రసామగ్రి పనిముట్లు, మరమ్మతు, తనిఖీ, కార్యాలయపు ఖర్చులు,

వసతులు కల్పించవలెను, పిల్లల పాఠశాలలు, ఆస్పత్రులు, పచ్చికలు, తరగతులు, పెట్టుబడిమీద వడ్డీలు, మేనేజింగుఖర్చులు, నా వస్త్ర, వ్యాయామస్థానపు ఖర్చులు, చదువు తరగతులు, పని వారల శిశువు సహాయాలు, వైద్యసహాయం. ప్రసవస్త్రీల కిచ్చు సెలవు సహాయాలు, సెలవు వేతనములు, భాగస్వామ్యపువిలువలు, నష్టాలు, సమ్మెలవల్ల ఖర్చులు అనేకము మిల్లువారు భరించాలి." *

కనుక మిల్లులకు పెట్టుబడి యెక్కువ. చేమగ్గములకు పెట్టుబడి తక్కువ. పైనవివరించిన ఖర్చులుగాని, అవస్థలుగాని చేమగ్గములకు లేవు. పెట్టుబడికి తగిన ఫలితము మిల్లులకు లేదు. ఒక్కొక్కకడము ప్రత్యేకంగా లెక్కచేస్తే మిల్లుగుడ్డ చౌక యను భ్రాంతి కలుగవచ్చునేమోగాని, దేశపు మొత్తము మీద ఆర్థికదృష్టితో చూచినచో మిల్లులు దేశమునకు లాభదాయకములు గావు.

మిల్లువస్త్రంకంటె, చేనేతవస్త్రం అనేకవిధములుగా ఉత్తమమైనదని చాలమంది వస్త్రపరిశ్రమ నిపుణులు వక్కాణించి, ఋజువుచేసియున్నారు. అనుభవజ్ఞులుకూడా అందులో సత్యం ఉన్నదని ఒప్పుకున్నారు. ఇంటర్ నేషనల్ ఛేంబర్ ఆఫ్ కామర్స్, కలకత్తాలోని ఇండియా నేషనల్ ఛేంబర్ ఆఫ్ కామర్సుకున్న సెక్రటరీ అయిన యం. పి. గాంధి గారు "విదేశవస్త్రముల పోటీ నెదుర్కొనటం ఎట్లా ?" ("How to compete with foreign cloth") అనే పుస్తకం

---

* Cotton Cloth Impassy" (P. 15) By D. M. Amalsad A. S. S. O. C. M. C. T. (Manchester)

28 వ పేజీలో చేనేత వస్త్రమునుగూర్చి యీ క్రింది విధంగా వ్రాశారు :

"(1) చేత్తో వడికిన నూలుతో నేయబడినది కనుక చేనేత వస్త్రము మిల్లుగుడ్డకంటె మృదువుగాను, ఆహ్లాదకరంగాను ఉంటుంది. (2) వేసవికాలంలో చల్లగా ఉంటుంది. చలికాలంలో వెచ్చగా ఉంటుంది. (3) ఎక్కువగా నానేగుణంవుంది కనుక చెమటగాని, తడిగాని త్వరగా పీల్చుకుంటుంది. (4) గుడ్డ ఎక్కువకాలం మన్నుతుంది. (5) చేనేతవస్త్రం ఉతుకుట తేలిక. (6) మన దేశపు మొరటుతనపు చాకిరేవు దెబ్బలకు తట్టుకుంటుంది."

చేనేత పరిశ్రమలో నూలు సరిచేయడంలో నూలుకు గట్టితనం, నునుపు ఎక్కువగుతుంది. కాని మిల్లులో మిషిన్ మీద అవిరిసహాయంతో చేసేసరిలో నూలు గట్టిపడడానికిగాని, నునుపెక్కడానికిగాని అవకాశంలేదు. అందువల్ల నేనేతగుడ్డ, మిల్లుగుడ్డకంటె ఎక్కువకాలం మన్నుతుంది. ఈ విషయమై ఫాక్టు ఫైండింగు కమిటీవారు తమ నివేదిక 203 వ పేజీలో వ్రాస్తూ, "చేనేతగుడ్డ, మిల్లుగుడ్డకంటె ఎక్కువకాలం మన్నుతుంది. అందుచేత మొత్తం మీదమిల్లుగుడ్డకంటె చేనేతగుడ్డచౌక*" అన్నారు. హోల్కారు ఎస్టేటు నేతపరిశ్రమ నిపుణుడుఅగు వి. ఏ. తాల్ చెరుకూరు "ఖద్దరునూలు" (Charka yarn) ను గురించి వ్రాస్తూ యీ

"Hand woven cloth is more durable and therefore, cheaper in the longrun" Fact Finding Committee Report. P. 203.

విధంగా చెప్పారు :- "ప్రత్తిగింజ తీయుటం దగ్గరనుంచీ వస్త్రం తయారయ్యేవరకు ప్రతిపనీ చేతితో తయారుచేసి నట్లయితే, నేతలోగాని, బలంలోగాని, మన్నికలోగాని, అట్టి వస్త్రాన్నిమించిన వస్త్రం ఉండదు. అట్టి లక్షణాలు, విశిష్టత ఉండుటవల్లనే ఖద్దరువస్త్రం చిరకాలం మన్నుతుంది. మిల్లు నూలుకంటె చేతితో వడికిననూలు చాల బలంగా ఉంటుం దని ఎరామస్ విల్సన్ శాస్త్రీయముగా ఋజువుపఱచి యున్నారు."

* భారతదేశములోని గృహపరిశ్రమలలో కెల్ల మన చేనేత పరిశ్రమ ప్రధానమైనది. వ్యవసాయం తరువాత హెచ్చుమందికి పనికల్పించగల గృహపరిశ్రమ, చేనేత పరి శ్రమ మాత్రమే. ఈనాడు మన దేశ జనాభాలో నూటికి 75 మంది వ్యవసాయమువల్ల జీవిస్తున్నారు. మన చేనేత పరిశ్రమవల్ల దాదాపు 2 కోట్లమంది జీవించుచున్నారు. ఈనాడు మనదేశమందలి 417 బట్టలమిల్లులు 4 లక్షల 30 వేలమంది కార్మికులకు మాత్రమే పనికల్పించుచున్నవి. మనదేశ ప్రజలకు కావలసిన 640 కోట్ల గజాలవస్త్రము లలో మిల్లులు 435 కోట్లునూ, చేమగ్గములు 185 కోట్లునూ సప్లయిచేస్తున్నవి.

మిల్లులకంటె చేమగ్గములే మనదేశమునకు అను కూలమైనవి. యంత్రపరిశ్రమలో గలుగునిరుద్యోగసమస్యను చేమగ్గపు పరిశ్రమ సులభముగ పరిష్కరించగలదు. మన దేశంలో ఉన్న చేమగ్గములను ఎత్తివేసి, మిల్లులను స్థాపించి నచో మొత్తము, 5 లక్షల 73 వేలమందికి మాత్రమే

మిల్లులు పనికల్పించగలవు. అప్పుడు చేనేత పారిశ్రామికు లలో మిగిలిన 1 కోటి 98 లక్షలమంది నిరుద్యోగులౌతారు. వారికి ప్రభుత్వంగాని, ప్రజలుగాని ఏపని జూపించగల్గుతారు. ఇంతమందిని నిరుద్యోగులచేసి, పాశ్చాత్యదేశాలలో మాది రిగా వారినందరిని ప్రభుత్వంయిచ్చే భిక్షపై బ్రతుకమనడం నాగరికత లక్షణమా ? అట్లుగాక యీనాడు మన దేశంలో ఉన్న మిల్లుల నన్నిటినీ ఎత్తివేసి చేమగ్గాలనే స్థాపిస్తే మొత్తం 5 కోట్ల 28 లక్షలమంది ప్రజలకు జీవనోపాధి కల్పించవచ్చును.

"ఇది యంత్రయుగం గాబట్టి మనం చేనేతపరిశ్రమను ఎత్తివేసి మిల్లులనే ప్రోత్సహిస్తామని అభివృద్ధివాదులు వాదించవచ్చు. అయితే పైనచెప్పినట్లు అందువల్ల నిరు ద్యోగులగు 1 కోటి 98 లక్షల చేనేతపారిశ్రామికులకు ఆ అభివృద్ధి కోరేవారు ఏవృత్తి చూపించగలరు. వీరు దేశానికి మహాభయంకరరూపమైన నిరుద్యోగులౌతారు. ఈనాడు కళకళలాడు గ్రామాలు, పట్టణాలుకూడా తిండిలేక మల మల మాడిపోతవి. ఇందువల్ల దేశంలో యేర్పడే తీవ్రమైన సాంఘిక, ఆర్థికదుస్థితిని తట్టుకోలేము" అని ఫ్యాక్టుఫైండింగు కమిటీవారు తమ రిపోర్టులో 205 పేజీలో వ్రాశారు. అంతేగాక "మన ప్రభుత్వముగాని చేనేతపారిశ్రామికులు గాని మెదలకుండా కూర్చుంటే, ఈనాడు మన వస్త్రమిల్లులు పొందుతూఉన్న అభివృద్ధిని నిరాటంకంగాసాగనిస్తే, దేశంలో చేనేతపారిశ్రామికుల దుస్థితి తీవ్రరూపం దాల్చుతుంది. అందువల్ల నిరుద్యోగులై తిండికి అల్లలాడు లక్షలకొలది

చేనేతపారిశ్రామికులకు బ్రతుకు తెరువు చూపించవలసిన బాధ్యత ప్రభుత్వముపై పడుతుంది'' అని కూడా ఫ్యాక్టు ఫైండింగుకమిటీవారు తమ నివేదికలో 213 వ పేజీలో స్పష్టముగా హెచ్చరించియున్నారు.

మిల్లులు బయలు దేరినతరువాత అంతవరకు ప్రశాంత జీవనంజేస్తూఉన్న గ్రామప్రజలు బస్తీల కెగబ్రాకారు. కార్మికులు బస్తీలలో ఉండే మురికి, అనారోగ్యప్రాంతాలలో నివాసా లేర్పాటుచేసికోవలసివచ్చింది. పల్లెలలోని ప్రశాంతిజీవనంపోయి ఎప్పటికప్పుడు ఆందోళనాపూరిత కృత్రిమజీవితాని కలవాటు కావలసివచ్చింది. ఫ్యాక్టరీలలో పరాయిస్త్రీలు పురుషులు కలసి పనిజేయవలసివచ్చింది. భారతీయ సాంప్రదాయ సిద్ధమైన నీతినియమాలు మాయమైనవి. వేలకొలదికార్మికులు చమటోడ్చి చాకిరిజేస్తే, ఒకరిద్దరు వ్యక్తులుమాత్రం లక్షాధికార్లు, కోటీశ్వర్లు గావటం అనేది యిప్పటి ఫ్యాక్టరీవిధానంయొక్క ఫలితం. అధిక సంఖ్యాకులు తిండిలేక మలమలమాడుతూఉంటే బహుకొద్ది మందిమాత్రం హంసతూలికాతల్పాలలో బవళించి, హాయిగా జీవితం గడపడం పెట్టుబడివిధానంయొక్క ఫలితం. * మిల్లుల వల్ల తరుచుగా కార్మికులసమ్మెలు చెలరేగుచున్నవి. మానవశక్తి హెచ్చుగానున్న మనదేశంలో మిల్లులవల్ల నిరుద్యోగ

---

*Capitalist production divided the Society between the inordinately rich and the miserably poor, between the fewer haves and the many havenots.''

ACHARYA J. B. KRIPALINI,
*Politics of Charaka.* Page 52.

సమస్య తీవ్రరూపం దాల్చుతుంది. కాని కుటీరపరిశ్రమగా సమపబడు చేనేత (ఖాదీ) పరిశ్రమలో యీ బాధలు ఏమీలేవు. ఖాదీవిధానమువల్ల గ్రామములు స్వయంపోషకములు, స్వయంసమృద్ధములు అగుచున్నవి. ఈ విధానంలో పూంజీదారులకు స్థానములేదు. మధ్యదళారీల విపరీత లాభాలకు స్థానమసలేలేదు. చేనేత పారిశ్రామికుడు తన స్వంత కుటీరంలో స్వతంత్రంగా, తనకు వీలైనప్పుడు హాయిగా నేత నేసుకోవచ్చును. ఇంటిలోనివారి అందరి సహాయ, సహకారాన్ని పొందుటకు వీలున్నది. భార్యా భర్తలు, తల్లి బిడ్డలు, యిల్లువిడిచిపెట్టి పోనవసరంలేకుండానే కృషి జేసుకోవచ్చును. కుటుంబపోషణ అంతయు ఒక వ్యక్తిమీదనే పడదు. "గృహపరిశ్రమగా సాగింపబడే చేనేత పరిశ్రమ విధానము ఒక ఆదర్శప్రాయమైన నిర్మాణము"ని ఫ్యాక్టుఫైండింగు కమిటీవారు తమ నివేదిక 203 పేజీలో వ్రాసియున్నారు. Fact finding Committe Report. p. 203.

మన భారతీయ నాగరికతకు, మన భారతదేశ ఆర్థిక సౌధనిర్మాణమునకు మన గ్రామపరిశ్రమలే శరణ్యమని ప్రజలును, ప్రభుత్వమును కూడ గుర్తించిరి. అందుకొరకే అఖిలభారత గ్రామపరిశ్రమలసంఘము స్థాపించబడి కృషి జేయుచున్నది. ఆ మహదాశయంతోనే మన మదరాసు రాష్ట్రమున ప్రకాశంపంతులుగారి ఖాదీవిధానము కూడ ప్రారంభించబడినది.

మన దేశంలోని ప్రధానమైన ఆర్థికసమస్య దేశంలోని యేడులక్షల గ్రామాలలో ఉన్న ప్రజానామాన్యానికి

సంవత్సరంలో ఆరుమాసాలు బొత్తిగా పనికల్పించ లేక పోవుట. కొంతమందికి మాత్రమే కొద్దిపని కల్పించుట. పెద్ద ఎత్తునసాగించే భారీపరిశ్రమలు యీ నిరుద్యోగసమస్యను పరిష్కారముచేయలేక పోతుఉన్నవి. మన దేశంలో ఆధునిక యంత్రసహాయముతో నడపబడుచున్న పంచదారమిల్లులు, గుడ్డలమిల్లులు, ఇనుము ఉక్కు ఫ్యాక్టరీలు, సిమెంటు ఫ్యాక్టరీలు, జనుపనారమిల్లులు వగైరా ఫ్యాక్టరీచట్టము క్రిందకు రాదగిన భారీమిల్లులన్నియు కలిసి మన జనాభాలో 15 లక్షల కార్మికులకు మాత్రమే పని కల్పించగలిగినవిగాని యెక్కువమందికి పని జూపలేకపోయినవి. మన దేశంలో కూలిజనం యెక్కువ. ఖాదీపరిశ్రమల నిర్మాణానికి అవసరమైన పెట్టుబడి తక్కువ. "ఇట్టి పరిస్థితులలో మానవశక్తియగు కార్మికుల నెక్కువమంది నుపయోగించుకుంటూ, పెట్టుబడి తక్కువతో పరిశ్రమల సాగించడమే మన ఆర్థిక విధానానికి ఉత్తమమైన మార్గము. అట్టి వాతావరణమునకు చేనేతపరిశ్రమ చాల అనుకూలమైనది" అని ఫ్యాక్టు ఫైండింగు కమిటీవారు తమ రిపోర్టు 206 వ పేజీలో సూచించియున్నారు.

పైగా మన దేశంలోని ప్రజలందరిలోను కొనుగోలు శక్తి ఒకేమాదిరిగా లేదు. బహు కొద్దిమందిమాత్రమే ధనికులు. అత్యధికసంఖ్యాకులు నిరుపేదలు. ఫ్యాక్టరీలు నిర్మించినందువల్ల అట్టిపరిస్థితి చక్కబడకపోవడమేగాక, మరింత అధ్వాన్నమగును. కాని జాగ్రత్తగా యోచించి నిర్మాణము

చేసి సాగించే కుటీరపరిశ్రమలే కొనుగోలుశక్తిలోని అట్టి వ్యత్యాసాన్ని సమన్వయపరచగలవు.

"చేతిపరిశ్రమల విధానంలో నిత్యజీవితావసర వస్తువుల నుత్పత్తిచేయుటం ఆర్థికంగా సౌష్టవము గాదని భావించుట పొరబాటు" అని ఫ్యాక్టుఫైండింగు కమిటీవారు తమ రిపోర్టు 206 వ పేజీలో స్పష్టపరచియున్నారు.

వికేంద్రీకరణ దృష్టితో ఆలోచిస్తే, ఉత్పత్తిలోగాని, ధరలోగాని చేతిమగ్గాలు చాల సౌష్టమైనవే నని R. P. గ్రెగ్ తన 'ఖద్దరు ఆర్థిక తత్వము' (Economics of Khaddar) అను పుస్తకం 87 వ పేజీలో ఖండితముగా వ్రాసియున్నారు. ప్రపంచములోని అత్యధిక కోటీశ్వరుడును, మోటారు పరిశ్రమాధిపతియు పాశ్చాత్య దేశపు భారీ పారిశ్రామిక బ్రహ్మయు నగు హెన్రీఫోర్డు కూడా వికేంద్రీకరణ విధానము చాల ఉత్తమమైనదని గ్రహించుటయేగాక ఆ విధానాన్ని చాల మెచ్చుకొని దాన్ని బలపరుస్తూ వాదించుచున్నాడు.*

మన దేశ పరిశ్రమలను ముఖ్యంగా వస్త్ర పరిశ్రమను కేంద్రీకరించుట కంటె వికేంద్రీకరించుటయే మన భారత ఆర్థికస్థితికి, సాంఘిక స్థితికి చాల తగియున్నది. కేంద్రీకరణ విధానంలో ఉన్న దుష్ఫలితములు వికేంద్రీకరణలో లేవు. మన దేశంలోని మానవకోటియొక్క నిరుద్యోగ సమస్యను, నిరుపేదతనమును బాపుటకు ఖాదీ వస్త్ర పరిశ్రమకు మించిన పెద్దపరిశ్రమ లేనేలేదు. చైనా జపానుల

---

* హెన్రీ ఫోర్డుయొక్క (1) "My life and work" (2) "Today and tomorrow" చూడుడు.

మధ్య సాగిన దీర్ఘకాలపు యుద్ధాలలో చైనాదేశపు సైన్యాలకు అవసరమైన కంబళ్ళువగైరా సమస్త వస్త్రముల సరఫరా యావత్తు అచటి చేమగ్గాలమీదనే తయారు గావటం అనేది చైనాకు ఒక అపారమైన సంపద. నేత పరిశ్రమలో నిపుణులై యుండి, ఆ సమస్యపై అధికారపూర్వకమైన తీర్పు నీయగలవారే పై అభిప్రాయమును వెల్లడించిరి. ఆధునిక యుద్ధములలో విమానములపైనుండి బాంబుల వర్షము కురిపించుటకుగల లక్ష్యము కేంద్రీకరింపబడిన పారిశ్రామిక ఉత్పత్తిస్థానము లేనని ప్రతివారికి తెలిసిన విషయమే. "మన అపారమైన చేనేత పరిశ్రమను యీనాడున్నట్లు వికేంద్రీకరించుటయేగాక, ఆధునిక యంత్రశక్తి విధానము క్రింద కేంద్రీకరింపబడవలసిన మిల్లు మగ్గములను పూర్తిగా తొలగించి, వాటికి బదులు యింకను చేనేత పరిశ్రమను ఎందుకు అభివృద్ధిచేయగూడదు?" అని అఖిల భారత చరఖాసంఘు ఒరిస్సాశాఖకు పూర్వము ఆర్గనైజరుగా ఉండి, ప్రస్తుతము బెంగాల్, అస్సాం శాఖలకు శక్రటరీగా నున్న శ్రీ అన్నాడ ప్రసాద్ చౌదరి M. sc. గారు "చేనేత పరిశ్రమను ఎట్లా రక్షించాలి" ("How to Help the Hand-loom Industry") అనే పుస్తకం 4 వ పేజీలో వ్రాశారు.

మిలిటరీ దృష్టితోగాని, శత్రువుల దండయాత్రల నుండి తప్పించుకొనే దృష్టితోగాని ఆలోచిస్తే, ఉత్పత్తిని కేంద్రీకరించుట కంటే వికేంద్రీకరించుటయే చాల ఉత్తమమైన విధానమని ఒప్పుకొనక తప్పదు. అప్పుడప్పుడు దీర్ఘకాలపు యుద్ధములచే పీడింపబడే ప్రపంచములో ప్రజాసామా

స్యము తమ నిత్యజీవితావసర వస్తువులగు అన్నవస్త్రాలు సాధ్యమైనంతవరకు ఎక్కడికక్కడ స్థానికంగా ఉత్పత్తి చేసుకోవడం క్షేమము. అట్టి వస్తువులకుగాను దూరప్రాంతముల నుంచీ వచ్చే దిగుమతులపై ఆధారపడి ఉండటం, తీవ్రమైన యుద్ధపరిస్థితి వచ్చినప్పుడు చాల ప్రమాదమునకు గురికావలసి వచ్చును. ఉత్పత్తిని వికేంద్రీకరించడం సైనికావసరాలకే అత్యవసరమవుతూ ఉండగా, యీనాడు మన దేశంలో వికేంద్రీకరించబడియున్న అత్యావశ్యకమైన చేనేత పరిశ్రమ విధానమును నిర్లక్ష్యముచేసి, మిల్లు పరిశ్రమకై ప్రాకులాడుట కేవలం ఉన్మాద మనకు తప్పదు'' అని ఫ్యాక్టు పైండింగు కమిటీవారు తమ రిపోర్టు 207 వ పేజీలో స్పష్టపరచియున్నారు. మనదేశ ఆర్థిక సాంఘిక పరిస్థితికి గృహపరిశ్రమలే అన్ని విధాల తగినవి. మన సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక జీవితమునకును గ్రామమే వెన్నెముక. అట్టి గ్రామజీవితానికి మూలాధారమైన గృహపరిశ్రమలను నాశనముచేసి, భారీపరిశ్రమలు పెట్టుట మనదేశ సౌభాగ్యమునకు తీరనినష్టము '' అని ఫ్యాక్టుఫైండింగు కమిటీవారు తమరిపోర్టులో 207వ పేజీలో వ్రాసియున్నారు.

కనుక పైన వివరించినట్లు మనదేశ సాంఘిక ఆర్థిక పరిస్థితులబట్టి విచారించినను, మనదేశములో నున్న చౌక రకపు కూలి జనసంఖ్యనుబట్టి యోచించినను మన ప్రజలకు సంవత్సరములో గల ఆరుమాసాల నిర్వ్యాపారత్వమును బట్టి ఆలోచించినను, కేంద్రీకరింపబడిన మిల్లుపరిశ్రమ యొక్క దుష్ఫలితముల గమనించినను, ఫ్యాక్టుఫైండింగు

కమిటీవారి సలహాలను పరిశీలించినను, సైనికులయుద్ధరంగపు
చెత్తుల దృక్పథముతో విచారించినను, ప్రాచ్య పాశ్చాత్య
ఆర్థిక, పారిశ్రామిక వేత్తల అభిప్రాయముల ధోరణి గమ
నించినను మన భారతదేశమునకు వికేంద్రీకరణక్రింద నడుప
బడు గృహపరిశ్రమలే చాల అనుకూలమైనవని స్పష్టమగు
చున్నవి.

నిరుద్యోగసమస్యా నిర్మూలనదృష్టితోను, జాతీయ
ఉత్పత్తి పెంపుదల విషయంలోను, పేదప్రజల కొనుగోలు
శక్తిని పెంచు విషయంలోను, జీతీయ ధనాన్ని అభివృద్ధి
చేసే దృష్టితోను పైన చర్చించిన విషయాల నన్నింటిని
సింహావలోకనంచేస్తే, రాటము, ఖద్దరు మన ఆర్థికవిధానం
లోని చక్కని సౌమ్యసిద్ధాంతములని మాజీ కాంగ్రెస్
అధ్యక్షులు శ్రీ ఆచార్య కృపాలినీ తమ "గాంధీ
మార్గము"లో వ్రాసియున్నారు. *

ఇట్టి వికేంద్రీకరణ సిద్ధాంతమునకు మన జాతీయ
ప్రభుత్వ ప్రధాని పండిత జవహరిలాల్ నెహ్రూ యెంత
మాత్రమును వ్యతిరేకిగాక, అట్టి వికేంద్రీకరణ విధాన
మునకు సుముఖుడేననుటకు యిటీవలనే ఆయన వ్రాసిన
"The Discovery of India" అను గ్రంథములోని యీక్రింది

* "From point of (1) The diminuation of unemployment, (2) increase in national production, (3) the purchasing power of the poor, and (4) the collective wealth of the nation, Charka and Khadi are sound propositions in Economics."

—ACHARYA J. B. KRIPALANI
"The Gandhiam way" P. 21

వాక్యమే తార్కాణము. "విద్యుచ్ఛక్తిని ఎక్కువగా ఉపయోగించినచో గృహపరిశ్రమలు అభివృద్ధిజెందుటకు అవకాశముండుటయేగాక, గృహపరిశ్రమలు ఆర్థికంగా సౌష్టవమును జెంది భారీపరిశ్రమలతోసహా పోటీ చేయగలవు. వికేంద్రీకరణ విధానము ఉత్తమమైనదనే అభిప్రాయం యిటీవల చాల బలపడుతూఉంది. హెన్రీఫోర్డు సైతము వికేంద్రీకరణ విధానము ఉత్తమమైన దను అభిప్రాయమును బలపరచుచున్నారు."*

## మద్రాసుప్రభుత్వ ప్రణాళికాస్వరూపము

మద్రాసుప్రభుత్వ ఖాదీప్రణాళికప్రతులు శాసనసభా సభ్యులకు పంచిపెట్టబడినవి. అందలి ముఖ్యాంశములు పత్రికలలో కూడ ప్రచురింపబడినవి. కొన్ని ముఖ్యవిషయముల నిట ఉల్లేఖించుచున్నాము

ఈప్రణాళికలో రెండుభాగములున్నవి. (1) Intensive (తీవ్రతరము) (2) Extensive (విస్తృతీకరణము) లోగడ కొంతవరకు ఖద్దరుపరిశ్రమ అభివృద్ధినందిన ప్రదేశములలో తీవ్రతర ప్రణాళిక అమలుపెట్టబడును. 1. గురవారెడ్డిపాలెము, 2. ఎర్రగుంటపాలెము, 3. తిరుప్పూరు . . . . ఈ ప్రదేశములు గుడ్డలవిషయంలో స్వయంపోషకము లగుటకు ప్రభుత్వమే బాధ్యతవహించి కార్యమును సాగించును.

---

* "The increase in the use of Electric power fecilitates the growth of small industries and makes of economically capable of competing with large scale industry. There is also a growing opinion in favour of decentralization and even Henry Ford has advocated it"—Pt. Jawaharlal Nehru's "The Discovey of India" Page 488.

2. విస్తరణభాగము:—జిల్లాకొక ఫిర్కా చొప్పున 25 ఫిర్కాలలో ప్రవేశపెట్టవలెనని ఉద్దేశించిరికాని తరువాత 6 ఫిర్కాలకు తగ్గించిరి. ఇది చాల విచారకరము. మధ్యనిషేధమును రాష్ట్రమంతట 3 సంవత్సరములలో అమలుజరుపుటకై యెట్టి తీవ్రతరమైన కృషిని గావించుచున్నారో అట్లే ఖద్దరుప్రణాళికను అమలుజరుపు విషయమున కూడ నేటి ఆర్థికఅనుకూలవాతావరణమును వినియోగించి బట్టలకొరతను బాపుటకై ప్రభుత్వము తీవ్రతరమైన కృషిచేయవలెను. జిల్లాకు రెండు ఫిర్కాలవంతున 50 ఫిర్కాలలో ఈ సంవత్సరము ప్రణాళికను ప్రవేశపెట్టినచో వాని సద్యోఫలితములను యితరులు కండ్లారచూచి, దృఢవిశ్వాస చేతస్కులై అనుసరించుటకు అనుకూలముగా నుండెడిది. అంతేకాక రాష్ట్రమునంతను స్వయంపోషకము చేయుటకు 5 సంవత్సరములకంటె యెక్కువ కాలము పట్టినచో, ప్రజలకంతగా ఉత్సాహకరముగను, ఆచరణయోగ్యముగను ఉండకపోవచ్చును. ప్రతిఫిర్కాకు ఒకఫిర్కా ఆఫీసరుండును. ఫిర్కా ఖాదీఆఫీసరే ఫిర్కాలోని కుటుంబములకన్నింటికి ప్రణాళిక కూర్పు తెలియజేయును. ఫిర్కాలోని ప్రతిగృహము కనీసము ఒక్క రాట్నమునైనను కలిగియుండవలెను. ప్రతి కుటుంబములో రాటముపై నూలుతీయుటకు ఒక వ్యక్తిని ఏర్పరచి, ఆ పేరును ఫిర్కాఆఫీసరుకు తెలుపవలెను. ఏ ఒక కుటుంబమైనను, ఒక వ్యక్తిని ప్రత్యేకించలేనిచో, వేరొక కుటుంబమునుండియైనను నిర్ణయించవచ్చును. అప్పుడు ఒకేకుటుంబమునుండి ఇద్దరు వ్యక్తులు నూలుతీయ

వలయును. ప్రత్యేక పరిస్థితులలో, బయలు వ్యక్తికూడ నిర్ణయము చేయుకొనుటకు అనుమతిని యిచ్చు అధికారము, ఇన్స్పెక్టరు, టెక్స్టయిల్ కంట్రోలరులకు కలదు.

అవసరమైనచో ప్రత్యేకింపబడిన వ్యక్తులకు నూలు తీయుటయందు శిక్షణ ఇవ్వబడును. ఫిర్కా ఖాదీ ఆఫీసరు ప్రతి ఒక్క వ్యక్తి నెలకు తీయవలసిన నూలు మొత్తమును నిర్ణయించును. ఆఫిర్కాలో తయారైన నూలు నేయుటకు కొన్ని మగ్గములు ప్రత్యేకింపబడును. ఆఫిర్కాలోని మగ్గములకు మిల్లునూలు యివ్వబడదు. సహకారసంఘములోని మగ్గములకుకూడ ఈ నిబంధన వర్తించును. ఖద్దరునూలును నేయుటకు ఫిర్కాలోని మగ్గములు చాలని యెడల ప్రక్క ఫిర్కాలోని మగ్గములుకూడ ప్రత్యేకింపబడును.

ఈ ప్రణాళిక అమలు జరుపబడుచున్న ప్రదేశములందును, అ. భా. చ. సంఘమునకు చెందిన ప్రదేశములందును, రాష్ట్రీయ, టెక్స్టయిల్ కమీషనరు ఈ నిర్ణయించిన యితర ప్రదేశములందును, కొన్ని సంస్థలు మాత్రమె, ఖద్దరు వ్యాపారము చేయుటకు అనుమోదింపబడును. మిగిలిన వ్యాపారసంస్థ లన్నియు మద్రాసు బట్టల వర్తకుల కంట్రోలు ఆర్డరు క్రింద రద్దుచేయబడును.

ఈప్రణాళిక అమలు జరుగుకొద్దీ ఆయాఫిర్కాలకు మిల్లుగుడ్డ సప్లయి తగ్గింపబడును. పెద్దవారికి సంవత్సరమునకు 20 గ. వంతున, చిన్నవారికి 10 గజముల వంతున ఫిర్కా జనసంఖ్యకు సరిపడు ఖద్దరు తయారగును. 25

ఫిర్కాలలో మొత్తము ఖద్దరు ఉత్పత్తి 144 లక్షల గజాలు లేక 800 బేళ్లు అని అంచనా వేయబడినది.

కావలసిన రాటముల సంఖ్య 1,80,000. అందు క్రొత్తగా తయారు చేయించవలసినవి ఒకలక్ష. 1946. నవంబరు చివరకు రాటముల సప్లయి పూర్తియగును. రాటములు, యితర సామానులు, అసలు ధరకే అమ్మబడును. హరిజనులు, ఇతర బీదలనుండి మాత్రము ఖరీదు నెలవాయిదాలవంతున వసూలుపరచబడును.

ప్రత్తిని ఎవరికి వారే తెచ్చుకొనవలెను. అయినను ప్రభుత్వముకొని, నిల్వయుంచి అమ్మవలసిన అవసరము గుర్తింపబడినది. ఏకులు, ప్రత్తి నగదుకే అమ్మబడును. హరిజనులు, ఇతర బీదల విషయంలో ఏకులను అరువుకు అమ్మి, నూలురూపమున రాబట్టుకొందురు. 300 కుటుంబముల కొక ఖాదీఆఫీస రుండును. వారిపని ప్రత్తిని, ఏకులను అమ్ముట, నూలు వడకుటను పరీక్షించుట, నూలు పోగు చేయుట. ఏకుటుంబమైనను వడికిన నూలును గుడ్డగా నేయించుకొనుటకు ఫిర్కా ఆఫీసరు ఏర్పాటు చేయును. మిగతనూలు, ప్రభుత్వమున కివ్వవలెను.

వడకుట చేతగానివారికి శిక్షణ ఏర్పాటు ఉన్నవి. ఫిర్కాకు 4 చొప్పున (Instructors) శిక్షకులు ఉందురు. ఒక్కొక్క శిక్షకుడు, రోజుకు మూడుతరగతులకు శిక్షణ యివ్వవలెను. తరగతికి 25 మంది విద్యార్థులు (20 స్త్రీలు + 5 పురుషులు) ఒక్కొక తరగతికాలము దినమునకు రెండు గంటలవంతున నెల రోజులు. ఈ నెలశిక్షణలో తాము

నేర్చుకొనుటయే గాక, ఇతరులకు నేర్పుటకు కూడ పనికి వచ్చెదరు.

## ఖాదీ ఆఫీసర్ల శిక్షణ

రాష్ట్రములలో మొత్తము 10 శిక్షణ కేంద్రములు, ఆంధ్ర 4, తమిళ 4, మలబారు, 1 దక్షిణకనడా 1. ఒక్కొక్క తరగతిలో 40 మంది చేర్చుకొనబడుదురు. ప్రతితరగతి మూడు నెలలు జరుగును. ఇవిగాక ఖాదీప్రవేశిక పరీక్షకు బందరులోను, తిరుప్పూరులోను ఒక సంవత్సరము శిక్షణ యివ్వబడును. ఖద్దరు నేతకుకూడ పై రెండుచోట్లలో ఒక సంవత్సరము తర్బీతు యివ్వబడును.

ఫిర్కాలో తయారైనబట్ట, ఆ ఫిర్కాలోనే అమ్మి వేయబడును. ప్రతికుటుంబము తాము తీసిన నూలుతో నేయించుకొన్న బట్టకు గజమునకు 4 అణాలు ప్రభుత్వము బోనస్ యిచ్చును. ఇందువలన ఖద్దరుబట్ట ఖరీదు తగ్గును. బీదప్రజలు ఖద్దరు కొనేందుకు వీలగును. ఈ బోనస్ పేద కుటుంబములకే, అనగా సంవత్సర నికరాదాయము రు 240 కంటె తక్కువగా కలవారికే యివ్వబడును. ఒక ఫిర్కా లోని ఖద్దరు వేరొకఫిర్కాలో అమ్మినచో బోనస్ యివ్వ బడదు.

ఖద్దరు అమ్మకము ధరనిర్ణయ మిట్లు జరుగును. రాష్ట్రీయ టెక్స్టయిలు కమిషనరు నూలుకు ధర నిర్ణయించును. ఆ ధరకు ప్రభుత్వము నూలును కొనును. మగ్గము లపై నేయించును. నూలుధర, నేత మజూరీలకు, గజము

మునకు అణావంతున ప్రభుత్వఖర్చులు కలుపబడునును. ఆధరకే ఖద్దరు అమ్మబడును. బోనస్ అర్హులైనవారికి, ఈ ధరనుండి బోనస్ తీసివేయబడును.

ప్రతిగ్రామమునకు ఒకగ్రామ ఖాదీకమిటి ఉండును. ముగ్గురకు తగ్గకుండ, 5 మందికి ఎక్కువగాకుండ సభ్యుల సంఖ్య ఉండును. వీరు ప్రతిగృహమునకును తిరిగి ఖాదీ ప్రచారము చేయవలెను. ఈప్రణాళిక విజయవంతముగునట్లు చేయుట వీరిపని. ప్రణాళికాభారము గ్రామకమిటీపైనను, ఫిర్కా కమిటీపైనను ఉండును. ఫిర్కాకమిటీసభ్యులు:— 2. శాసనసభాసభ్యులు, 1. అ. భా. చ. సంఘప్రతినిధి, 1. చేనేత ప్రతినిధి, 5. పెద్దమనుష్యులు. ఈ 9 మందిలో 3 ఫిర్కాలోనివారై యుండవలెను. ఫిర్కా ఖాదీకమిటీసరు కార్యదర్శి, అధ్యక్షుని కమిటీ ఎన్నుకొనును. విధులు: ఖాదీ ప్రచారము చేయవలెను. ప్రణాళిక అభివృద్ధిని గమనించవలెను.

రాష్ట్రీయ ఖాదీ కమిటి:— సదరు కమిటిలో యీక్రిందివారు సభ్యులుగా ఉందురు. (1) ప్రధాని (అధ్యక్షుడు), (2) పరిశ్రమల మంత్రి, (3) వ్యవసాయ మంత్రి, (4) గృహపరిశ్రమల మంత్రి, (5) అ. భా. చ. సంఘ, ఆంధ్ర, కేరళ, తమిళ శాఖల ముఖ్య ఆఫీసర్లును, (6) ఆర్గురు అనధికార ఖాదీ ప్రేమికులు, (7) చేనేత పరిశ్రమ ప్రతినిధి, (8) అభివృద్ధిశాఖా కార్యదర్శి, (9) పరిశ్రమల డైరెక్టరు, (10) రాష్ట్రీయ టెక్స్టయిల్ కంట్రోలరు (కార్యదర్శి).

పై కమిటీలు గాక, ప్రణాళికను అమలు జరుపుటకు యీ క్రింది ఉద్యోగస్థులుకూడా ఉందురు. 1. రాష్ట్ర సెక్రటరీలు కమీషనరు 2. అఖిలభారతసంఘ ప్రాంతీయ కార్యదర్శులు- ప్రాంతీయచరఖా ఆఫీసర్లుగా నియమింపబడుదురు.—ప్రతిఫిర్కాకు ఫిర్కా ఖాదీఆఫీసరు. 300 కుటుంబముల కొక ఖాదీ ఆఫీసరు.

ఈ ప్రణాళికపై ఖర్చు ప్రభుత్వము రాబట్టుకొనును. (Intensive) (తీవ్రతర) ప్రణాళిక 1447-48 లో సంపూర్ణము చెందును. అప్పుడు సంవత్సరమునకు ఒక కోటి ఖర్చు అగును. 1948 నుండి ప్రభుత్వఖర్చు మానివేయవచ్చునని భావింపబడుచున్నది.

ఇది అ.భా.చ. సంఘమువారిచే వ్రాయబడి, మద్రాసు ప్రభుత్వముచే అంగీకరింపబడెను. ఈ ప్రణాళికను, శాసన సభ్యులుకూడ అంగీకరించిరి. మహాత్ముని ఆమోదముకూడ ప్రధానిపొందెను. ఖద్దరు సంపూర్ణవికాసము పొందాలంటే బట్టలమిల్లులు స్థాపింపకూడదని గాంధి అభిప్రాయ మొసంగెను. దానిని మద్రాసుప్రభుత్వము అంగీకరించినది. ప్రధాని అక్టోబరు 2 వ తేదీని ఎఱ్ఱగుంటపాలెంలో యీఖాదీ ప్రణాళికను ప్రారంభించుచు, క్రొత్తమిల్లులను స్థాపింపనీయమని ప్రకటించెను. తదాది ఈప్రణాళికపై అనుకూల ప్రతికూల విమర్శనలు బయలుదేరినవి. ఈ విమర్శనల కన్నిటికిని మహాత్ముడు సునిశితమైన సమాధానమును ది 27-10-46 హరిజన్ లో సంపాదకీయమున ఇచ్చియున్నాడు.

# మద్రాసు ప్రణాళికపై విమర్శలు

## మిల్లు యజమానుల దృక్పథము

మిల్లుయజమానుల విమర్శను పరిశీలింతము. భారత దేశంలో నూలుమిల్లుల, బట్టలమిల్లుల స్థాపనవలన ఎక్కువ లాభం బొంబాయిరాష్ట్రము పొందినదికాని, మనరాష్ట్రము పొందలేదు. మనదేశములోని మొత్తము 417 మిల్లులలో మనరాష్ట్రములో నున్నవి 45 మాత్రము. అందునను ఎక్కువగ దక్షిణభాగముననే యున్నవి. బొంబాయిలో 350 లక్షల జనాభాకు 60 లక్షల మరకదుళ్లున్నవి. మద్రాసులో 830 లక్షల జనాభాకు 20 లక్షల మరకదుళ్లున్నవి. బొంబాయిలో బట్టల ఉత్పత్తి 34,300 లక్షల గజములు. మద్రాసులో బట్టలఉత్పత్తి 9,640 లక్షల గజములు. కేంద్రప్రభుత్వ యుద్ధానంతర పునర్నిర్మాణ ప్రణాళికయందు ఆయారాష్ట్రములకు బట్టల మిల్లుపరిశ్రమాభివృద్ధికై దామాషా ప్రకారం కేటాయించబడినవాటిలో మనరాష్ట్రానికి 5 లక్షల మరకదుళ్లు యివ్వబడినవి, ఇందులో సంస్థానములకు 1½ లక్షలు కేటాయించబడినవి. మొత్తము 5 లక్షల మరకదుళ్లలో అరిగిపోయిన వాని స్థానమున 2½ లక్షలు పోను అభివృద్ధికి 2½ లక్షలు. బట్టలమిల్లుల పునర్నిర్మాణ కార్యక్రమము అమలుజరుపుటకు 2 సంవత్సరములున్నూ, పూర్తి యగుటకు 5 సంవత్సరములున్నూ పట్టును. అందువల్ల ప్రస్తుత విధానమున బట్టలకొరత ఎక్కువ యగును. కనుక, ఎక్కువ కదుళ్లకొరకై ఆందోళనచేయ

నవసరములేదా ? ప్రజలందరకు కావలసిన వస్త్రాలు ఒక్క ఖద్దరువిధానమువల్ల సప్లయి కాగలవా? అని వారివిమర్శ.

ఇదివరకు మనరాష్ట్రమునను న్నమిల్లులు ఎంతవరకు మన రాష్ట్రాన్ని స్వయంపోషకము చేయగలిగినవి? మన మెక్కువగా యితర రాష్ట్రములపైననే యాధారపడి యున్నాము కదా? ఇట్లా యితరరాష్ట్ర మిల్లుబట్టలపైన ఆధారపడియుండేదానికన్న ఒకటి రెండు సంవత్సరములలో కాకున్న 5 సంవత్సరములలోనైన మనలను స్వయంపోషకము చేయునట్లుగ ఖాదీఉత్పత్తి విధానమును ఏల నిర్ణయించరాదు? మనరాష్ట్రంలో ప్రతి రెండు కుటుంబాలకూ అంటే జనాభాలో ప్రతి ఎనిమిదిమందికీ అయిదుగురు ప్రతిరోజు ఒకగంట నూలువడికితే, మన రాష్ట్రము స్వయంపోషకమగునట్లు చేయవచ్చునని మనరాష్ట్రీయ టెక్స్టైలు కమిషనరు మహాత్మునికిచ్చిన లెక్కలు 27–10–46 న హరిజన పత్రికలో ప్రకటింపబడినవి. మహాత్ముడు తన సంపాదకీయంలో చివర యిట్లు ప్రశ్నించుచున్నాడు:—

Is it extravagant to expect every five persons out of eight to spin one hour for day, say for love of the Country of their birth.

కనుక మాతృదేశాభిమానముతో ఒక గంటకాలమును ఖద్దరుఉత్పత్తికి వినియోగించినచో, బట్టల కొరతను 6 మాసములలోనే కొంతతగ్గింపవచ్చును. కాని ప్రతిఒక్కరు దీక్షతో వడకునట్టి మానసికపరివర్తనమును కలిగించు ప్రభుత్వప్రచారము, ఏర్పాట్లు తప్పక కావలయును. మనము

మిల్లుబట్టలపైననే ఆధారపడినచో, 5 సంవత్సరముల వరకు స్వయంపోషకము కాదు. ప్రభుత్వ ఖాదీవిధానము వలన ముడిసరకుల ఖరీదులు, ఉత్పత్తిమజూరీలు, వర్తకుల లాభములు అన్నియు గ్రామాలయందే యుండును. ఇది గ్రామముల ఆర్థికపుష్టికి మిక్కిలి తోడ్పడును.

శ్రీ వెంకటేశ్వరన్ గారు తయారుచేసిన అంచన ఇది. మద్రాసురాష్ట్ర జనాభా 5 కోట్ల 30 లక్షలు. సగటున కుటుంబానికి 4 గురు చొప్పున సుమారుగా కుటుంబాలు $132\frac{1}{2}$ లక్షలు ఉన్నవి. ఒకగంటసేపు వడికితే, మనిషి 3/8 చిలపనూలు తీయగలడు. రోజూ ఒకగంట చొప్పున నెలకు $11\frac{1}{4}$ చిలపలు నూలుతీయవచ్చును. ఈ విధంగా సంవత్సరానికి 135 చిలపలు లేక 10 పౌనులు తయారగును. ఈ నూలుతో 44 అం. వెడల్పు గల 30 గజాలబట్ట తయారు చేయవచ్చును. కుటుంబానికి ఒక్కరుచొప్పున రోజూ ఇలా వడికితే సంవత్సరం మొత్తంమీద రాష్ట్రంలో ఉత్పత్తి కాగలబట్ట 39 కోట్ల, 75 లక్షల గజాలు.

పెద్దవానికి 20గజాలు, పిల్లవానికి 10 గజాలువంతున రాష్ట్రజనాభా కంతకూ కావలసినబట్ట. పెద్దలకు 74 కోట్ల గజాలు పిన్నలకు 16 కోట్ల గజాలు, మొత్తం 90 కోట్లు.

అనగా కుటుంబానికి ఒక్కడే రోజూ ఒకగంటసేపు మాత్రం వడికే పక్షంలో, 50 కోట్ల 25 లక్షల గజాల బట్ట తక్కువ అవుతుంది.

ఈ తక్కువను పూర్తి చేసుకోవాలంటే కుటుంబానికి ఒక్కరుచొప్పున రోజూ 2½ గంటల సేపైనా వడకాలి, లేదా ఒక్కొక్క గంటే వడికేపక్షంలో, రెండు కుటుంబాలకు కనీసం 5 గురైనా వడికేవారుండాలి.

ఇక మగ్గాలవిషయం. ఒక్కొక్క మగ్గంమీద రోజుకు 5 గజాల చొ॥ గుడ్డ నేయవచ్చును. అప్పుడు నెలకు సగటున 5 రోజులు విశ్రాంతి తీసివేసేయెడల, ఒక్క మగ్గంమీద నెలకు 125 గజాలు తయారుజేయవచ్చును.

ఈ లెక్కప్రకారం చూస్తే రాష్ట్రానికి కావలసిన 90 కోట్లగజాల బట్టను తయారుచేయాలంటే 6 లక్షల మగ్గాలు చాలు. ప్రస్తుతం ఈ రాష్ట్రంలో 5 లక్షలకుపైగా మగ్గాలు వున్నవి. కనీసం ఇంకా 75 వేల మగ్గాలు హెచ్చుచేస్తే, రాష్ట్రానికి కావలసిన బట్టంతా చేమగ్గాలమీదనే ఉత్పత్తి చేయించవచ్చు.''

ఇన్ని వేల చేమగ్గాలు మన రాష్ట్రంలో ఎట్లా లభిస్తాయని సందేహ మెంతమాత్రము పడనవసరంలేదు. ఇటీవల మనదేశంలో 30 లక్షల మగ్గా లున్నవి. కాని 1906 లో 60 లక్షల మగ్గాలున్నవని మదరాసుప్రభుత్వ పరిశ్రమశాఖా డైరెక్టరు ఇ. బి. హావెల్ అంచనా వేసియున్నాడు. ప్రభుత్వము, ప్రజలూకలిసి ఖాదీప్రణాళికను హృదయపూర్వకంగా అమలుజరుపుటకై నిర్ణయించుకుని అందుకు పూనుకుంటే మనరాష్ట్రంలో చేమగ్గాలు నిస్సంశయముగా లభిస్తాయి.

ఇక ఇప్పుడున్న మిల్లులకు ఈ ప్రణాళికవలన ఎక్కువ నష్టము కలుగునను వాదనను విచారింతము. ఇప్పుడు పని

చేయుచున్న మిల్లులను ప్రభుత్వము ఆపివేయుటలేదు. అవి పనికిరానంతవరకు తప్పక పనిచేయును. పూర్వము విపరీత ములైన లాభములను పొందిన మిల్లు యజమానులకు యిప్పుడు కొంత లాభము తగ్గినను నష్టములేదు. ధనికుల లాభముకొరకై ప్రజాసామాన్యమున కవసరమైన ప్రణాళికను ఆపివేయకూడదు. ఈ ప్రణాళికకు వ్యతిరేకంగా బయలుదేరిన ప్రచారము, భవిష్యత్తులో ప్రభుత్వమునకు కనువిప్పుగా నుండగలదు. ఈ ఒక్క గొప్ప కుటీర పరిశ్రమనే ప్రజానీకంలోకి వ్యాపింపజేయుటకు, పెట్టుబడి దారులు, ఎంత నిరోధక పద్ధతుల నవలంబించిరో తెలియగలదు. మున్ముందు ప్రభుత్వ మన్ని ముఖ్య పరిశ్రమలను వశము చేసుకొనవలయునన్న ఎంత కష్టమో చూడుడు. మద్రాసు రాష్ట్రంలో ప్రస్తుతం ఉన్న మిల్లుల అభివృద్ధికి, క్రొత్తగా బట్టల మిల్లులు ప్రారంభించడానికి, కేంద్ర ప్రభుత్వంవారు లోగడ యిచ్చిన మరకదుళ్ల కోటాను, మద్రాసు ప్రభుత్వము వారు రద్దుచేయించుట మిక్కిలి అవసరము.

మిల్లులు మూసివేయుటవలన మిల్లు కార్మికులు నిరుద్యోగులగుదురను సమస్య ప్రాముఖ్యమైనది కాదు. మిల్లు కార్మికులు, జీవనవ్యయం అధికంగా పెరిగిన ఈ రోజుల్లో పట్టణాలల్లో కూలి చాలక, మురికి యిండ్లలలో అనారోగ్య వాతావరణంలో క్రుగ్గి ఉండేబదులు, గ్రామాలల్లో తమ స్వతంత్ర గృహాలల్లో, తమకు తామే యజమానులై ఏ గృహపరిశ్రమనో అంటపెట్టుకొని చక్కని ఆరోగ్యవంతమైన వాతావరణంలో కుటుంబ పోషణగావించుకొని

తప్పక సౌఖ్యపడుదుము. అయితే గృహపరిశ్రమల నిర్వాహణకు సహకార సంఘములద్వారా ప్రభుత్వముచక్కని ఏర్పాట్లను గావింపవలయును.

## ప్రత్తి పంటదారుల సంఘ దృక్పథము.

ఈ ప్రభుత్వ ఖాదీ ప్రణాళికకును, ప్రత్తి పంటకు అవినాభావ సంభంధముకలదు. కనుక ప్రత్తిని పండించు రైతుల దృక్పథమును పరిశీలింతము. మద్రాసు వ్యవసాయ చేంబరు అధ్యక్షుడైన శ్రీ బెజవాడ రామచంద్రా రెడ్డిగారి అభిప్రాయమిది. మద్రాసు ఖాదీ ప్రణాళిక వ్యవసాయ ఆర్థిక విధానమును తారుమారు చేయుటయేగాక, ప్రత్తి రైతులకు పెద్ద సమ్మెటపెట్టు కాగలదని 27-10-46 న మదరాసులో, మద్రాసు రాష్ట్రవ్యవసాయదారుల సభలో ఒక తీర్మానమును గావించబడినది. అట్టి తీర్మానమునకు ఆధారమైన లెక్కలను గమనింతము.

"గత 15 సంవత్సరములలో ప్రత్తి పంట 300 పాళ్లు పెరిగినది. దేశంలో మిల్లు మగ్గాలున్నూ, కదుళ్ళున్నూ 50 పాళ్లు మాత్రమే పెరిగినవి. కనుక ప్రత్తి ఉత్పత్తిదారుల అభివృద్ధి, మిల్లు పరిశ్రమాభివృద్ధిపై నాధారపడియున్నది. ఎక్కువ ప్రత్తిని వినియోగించుకొనునట్లు మిల్లు పరిశ్రమ అభివృద్ధి నందినందుననే ప్రత్తి పంట వాణిజ్య పంటయైనది. కాంబోడియావంటి ఉత్తమ ప్రత్తి వడుకు నూలునకుపయోగింపబడుట లేదు. హిందూదేశములోని ఉత్తమ జాతులలో మద్రాసులో పండింపబడు కాంబోడియా

ఒకటి. రాష్ట్రములోని మొత్తము ప్రత్తి పంటలో కాంబోడియా పంట సగము. దాని ఖరీదు 6 కోట్ల రూపాయులు. అంతేకాక వ్యవసాయశాఖవారు Co 2, Co 4, X 44 63, అను ఉత్తమ రకాలను కూడా అభివృద్ధిపరచిరి. మిల్లు పరిశ్రమ అభివృద్ధిచెందిననే, ప్రత్తి పంట మూడురెట్లు అధికమై 18 కోట్ల రూపాయులు రాష్ట్ర ఆర్థిక పుష్టికి తోడ్పడును. నూతన మిల్లుల స్థాపన పేద రాయలసీమకు మిక్కిలి తోడ్పడును'' పై వాదనలో ఎంత పటుత్వమున్నదియు కాన్పించుచునే యున్నది. ఉత్తమమైన కాంబోడియా ప్రత్తిని, ఖాదీ నూలు తీయుటకు ఉపయోగించకూడదనియు, ఉపయోగించరనియు ఏమి నిష్కర్షయున్నది. ఉత్తమమైన కాంబోడియా ప్రత్తిని ఉపయోగించుటవలన, ఉత్తమమైన ఖాదీ నూలు తయారుకాగలదు. అందువలన సన్నని నూలు ఎక్కువ వేగంగా తీయడానికి ఉపకరించే రాట్న సృష్టికి కూడ అవకాశమున్నది. ఉత్తమమైన సన్నని ఖాదీ నూలు, నేత పారిశ్రామికునకును, బట్టను తయారుచేయుటయందు చాల సౌలభ్యమును కలిగించును. వెనుకబడియున్న పేద రాయల సీమలో, పారిశ్రామిక కూలీలకు, మిల్లు కూలీలకు, యంత్రముల స్థానమున పని కలుగునుట ఎంత నీరసమైన వాదనో గమనింపుడు. కనుక ప్రత్తి పంట వ్యాపారమును తమ చేతులయందుంచుకొన్న కొందరు ధనికుల దృక్పథమే కాని నిజముగ ప్రత్తి పంట ఉత్పత్తికి ప్రభుత్వ ఖాదీ ప్రణాళిక అడ్డురాదు. సరికదా, అభివృద్ధికే తప్పక కారణమగును.

# ప్రత్తి పంటదారులకు శ్రీ ప్రకాశంగారి సమాధానం

శ్రీ టంగుటూరి ప్రకాశంపంతులుగారు (మద్రాసు ప్రధాని) ఈ క్రిందిప్రకటన చేశారు. "ఖాదీ ప్రణాళికసందర్భంలో రాష్ట్రంలో ప్రత్తిఉత్పత్తికి అవాంతరాలు కలుగుతాయన్న మిషపై బయలుదేరిన విమర్శలకు నేను ఇంకా సమాధానం ఇవ్వవలసివున్నదని గతపర్యాయం చేసిన ప్రకటనలో సూచించివున్నాను. ఈ విషయమై బయలుదేరిన విమర్శలు ఈ క్రిందివిధంగా వున్నాయి.

(1) మిల్లు పరిశ్రమ వృద్ధిచెందినందువలన ప్రత్తిపంటకూడా వృద్ధి చెందివున్నది. అట్టి ప్రత్తిపంటల ఉత్పత్తికి ఇప్పుడు విఘాతం కలుగుతుంది. (2) మంచిరకాల ప్రత్తి ఉత్పత్తికికూడా అంతరాయా లేర్పడతాయి. (3) ప్రత్తిపండించేవానికి లాభాలు తగ్గిపోడంమూలంగా అతడు దెబ్బతింటాడు. (4) క్రొత్తమిల్లుల స్థాపన నిషేధించబడినది కాబట్టి ముఖ్యంగా దీనివలన రాయలసీమకు చాలానష్టం సంభవిస్తుంది. తుంగభద్ర హైడ్రోఎలెక్ట్రిక్ ప్రాజెక్టుకింద మిల్లులకు ఎన్నో సదుపాయాలు కలగగలవు. కాని, ఆ ప్రాజెక్టుక్రింద సదుపాయాలు పొందవలసిన ప్రాంతాలలో మిల్లులు వృద్ధిచెందడానికి సదుపాయాలు లేకున్నందున, ప్రాజెక్టు మూలంగా కలిగే సదుపాయాలు వ్యర్థమౌతాయి. ఇక చేనేతపారిశ్రామికులు బయటిప్రాంతాలనుంచి దిగుమతిచేయబడే నూలుపై ఎల్లకాలం ఆధారపడవలసి వుంటుంది.

వీటిలో మొదటి విమర్శకు నా సమాధానం ఇది: అసలు ఈ రాష్ట్రంలో మిల్లులు బయలుదేరడానికి పూర్వమే, ఇండియాలో ఇతర ప్రాంతాలలోవలె ప్రత్తి విశేషంగా పండుతున్నది. కాబట్టి బట్టలమిల్లుల అభివృద్ధికి అనుగుణంగా ప్రత్తిపంటల వైశాల్యం వృద్ధిచెందించనడం సరి కాదు. ఈ సందర్భంలో ఈ క్రిందిసంఖ్యలను గుర్తించాలి: 1923-24 లో ప్రత్తిపంటల వైశాల్యం 26 లక్షల ఎకరాలు. ప్రత్తి ఉత్పత్తి 4,50,260 బేళ్లు. యుద్ధాత్పూర్వం ప్రత్తిపంటల వైశాల్యం 24 లక్షల ఎకరాలు.

ఉత్పత్తి 5,08,210 బేళ్లు. (ఒక బేలుఅనగా 400 పౌనులు) 1913-14 నాటికి కూడా పరిస్థితి ఇదేవిధంగా వుంటుంది.

మిల్లులు వృద్ధిచెందుతున్నప్పటికీ, ప్రత్తి ఉత్పత్తిని హెచ్చించడానికి ప్రభుత్వంవారు ఎంత కృషిచేసినప్పటికీ, గడచిన 20 సంవత్సరాలలో ప్రత్తిఉత్పత్తి పరిమాణం 27,950 బేళ్లుమాత్రమే పెరిగింది. అందువలన మద్రాసు ప్రభుత్వంవారు ప్రకటించిన టెక్స్టైల్ విధానంలో బట్టలమిల్లులకు ప్రోత్సాహంలేని కారణాన ప్రత్తిఉత్పత్తి తగ్గిపోతుందని భీతిల్ల నవసరంలేదు.

రాయలసీమ జిల్లాలలోను, ఇతర ప్రాంతాలలోను రైతులు పొట్టిపింజ ప్రత్తిని పండిస్తారు. దానిమూలంగానే వారికి ఆదాయం చేకూరుతుంది. సస్య పరివర్తనంలో ప్రత్తి అక్కడ చాలా ముఖ్యమైనది. కాబట్టి ఇకముందుకూడా వారు ప్రత్తిని పండిస్తారు.

అక్కడి భూస్థితి, వాతావరణ పరిస్థితినిబట్టి ప్రత్తిని పండించడం కన్న వారికి గత్యంతరంలేదు. ఇక తుంగభద్ర ఇరిగేషన్ ప్రాజెక్టు అమలులోకి వచ్చేసరికి అక్కడి పరిస్థితి ఏవిధంగా వుంటుందో నిర్ధారణ చేయుడం చాలాకష్టం. కాని, ప్రత్తిపంటఅభివృద్ధి విషయమై ప్రభుత్వంవారు, భారతీయ కేంద్ర ప్రత్తిసంఘంవారు, ప్రజలు ఎంతనో ప్రోత్సహిస్తున్నప్పటికీ ప్రత్తిపంట తగినంత వృద్ధిచెందలేదన్న విషయాన్ని గుర్తించాలి. దాన్నిబట్టే అంతా తెలుసుకోవచ్చు.

ఇక రెండవవిమర్శకు నా సమాధాన మిది: ఈ రాష్ట్రంలో ఉత్పత్తిచేయబడుతున్న మేలురకం ప్రత్తి ప్రస్తుతం వున్న మిల్లుల అవసరాలు తీర్చడానికే సరిపోడంలేదు. అందువలన ఆ లోటును తీర్చడానికై మేలురకం ప్రత్తిని బైటిప్రాంతాలనుంచి దిగుమతి చేయవలసివస్తున్నది. ప్రభుత్వంవారు తలపెట్టినప్రకారం పెద్దఎత్తుపై చేనేతపరిశ్రమ వృద్ధిచెందినపక్షంలో, అప్పుడు పొట్టిపింజ ప్రత్తితోనే కాక, మేలురకాల ప్రత్తితో తీసిన వడుకునూలు ఉత్పత్తికి కూడ ప్రోత్సాహం లభిస్తుంది.

దీనిని మిథ్యాస్వప్నంగా భావించ నవసరంలేదు. ఎందుకంటే, రాష్ట్రంలో క్రమేణా ఖాదీఉత్పత్తి హెచ్చుతున్నప్పుడు, ఇతరరకాల బట్టలకు ప్రత్యామ్నాయంగా ఖాదీ ఉపయోగించబడుతున్నప్పుడు మేలురకం పడుకునూలుతో తయారైన ఖాదీకి గిరాకీ హెచ్చుతుంది. అందువలన మద్రాసు ప్రభుత్వంవారు ప్రకటించిన టెక్స్టైల్ విధానం ఫలితంగా, మేలురకాల ప్రత్తిఉత్పత్తికి అంతరాయం ఏర్పడుతుందన్న అనుమానం ప్రభుత్వంవారికి ఎంతమాత్రం లేదు.

ఇక మూడవరకరి విమర్శకు నా సమాధానం ఇది: ఇతరవాదాల విషయంలో వలెనే ఈ వాదనవిషయంలోకూడా ఖాదీవిధానం జయ ప్రదం కాగలదనే ప్రాతిపదికపై మనం సమాలోచన చేయాలి. ఈ రాష్ట్రంలోని మిల్లులు ప్రస్తుతం ఆరులక్షలబేళ్ళ ప్రత్తిని ఉపయోగించు కుంటున్నవి. ఈ రాష్ట్రంలో ప్రత్తిఉత్పత్తి అయిదులక్షల బేళ్ళకన్న కొంత అధికం వుంటుంది. ఇక ఈ లోటును భర్తీచేయడానికి ఈజిప్టు ప్రత్తి, ఆఫ్రికా ప్రత్తి, అమెరికా ప్రత్తి మొదలైన రకాలను దిగుమతీ చేసుకోవలసి వస్తున్నది. ప్రత్తికి గిరాకీ, ప్రత్తిధరలు ఇవిరెండూ చివ రికి వస్త్రాల గిరాకీమీద, వస్త్రాల ఉత్పత్తిపైన ఆధారపడి వుంటాయి. ఈ రాష్ట్రంలో ప్రజలకు ప్రస్తుతపు రేషన్‌కన్న అధికంగా వస్త్రాల సరఫరా నిమిత్తమే ఖద్దరుప్రణాళిక ఏర్పడివున్నది. కాబట్టి, ఈ విధానం క్రింద ప్రత్తిపండించే రైతుకు సరసమైన ధర లభించదన్న అనుమానం నిర్హేతుకమైనది.

ఇక నాల్గవవిమర్శకు నా సమాధానం ఇది: రాయలసీమ జిల్లా లలో పొట్టి పింజప్రత్తి విశేషంగా పండించబడుతుంది. జపాన్ రెండవ ప్రపంచసంగ్రామంలో ప్రవేశించిన నాటినుంచి ఈ పొట్టిపింజ ప్రత్తి అమ్మకం పెద్ద సమస్యగా పరిణమిల్లినది. అన్ని గ్రామాలలోను వడుకు నూలు పరిశ్రమ పునరుద్ధరింపబడుతున్నందున, ఆయా ప్రాంతాలలో పండిన ప్రత్తిని ఎంతో లాభకరంగా ఉపయోగించుకోడానికి వీలుపడు

తుంది. రాయలసీమలో మిల్లులమూలంగా ప్రజలలో కొద్దిమందికిమాత్రమే పనులు లభిస్తాయి. ఈ సంఖ్య ఎంతమాత్రం లెక్కలోకి వచ్చేదికాదు. కాని, వడుకునూలు పరిశ్రమ, దానితోపాటు చేనేతపరిశ్రమ పున రుద్ధరింపబడినప్పుడు, ప్రజలలో అత్యధిక సంఖ్యలకు ఉద్యోగాలు లభించగలవు.

అన్యప్రాంతాలనుంచి నూలును దిగుమతి చేసుకోడంలో మన పరాధీనస్థితిని తప్పించడానికి వడుకునూలు పరిశ్రమ పునరుద్ధరణయే అత్యుత్తమ సాధనం. ఇక తుంగభద్ర హైడ్రో ఎలెక్ట్రిక్ ప్రాజెక్టుక్రింద ఉత్పత్తిఅయ్యే విద్యుచ్ఛక్తినంతటిని లాభకరంగా వినియోగం అయేలాగ ప్రభుత్వంవారు చేస్తారు. దీనికి ప్రభుత్వంవారు అవలంబించనున్న పద్ధతిం కాలక్రమంలో ప్రకటిస్తారు.

యుద్ధకాలంలో మన అనుభవాన్నిబట్టి, మనకు తెలుస్తున్న దేమంటే, ఈ దేశంలో పొట్టిపింజ ప్రత్తి విశేషం నిల్వవుండిపోయినందున మనకు తీవ్రసమస్య ఏర్పడింది.

ఈ ప్రత్తిని లాభకరంగా సద్వినియోగం చేసుకోడానికి వడుకు నూలు పరిశ్రమను, ఖాదీ ఉత్పత్తిని మించినసాధనం మరొకటిలేదు.

సర్వావసానంగా నేను చెప్పదలచుకున్నది ఇది: ఖద్దరు ప్రణాళిక లోని మంచిచెడ్డలను అలా వుండనివ్వండి. ప్రస్తుతపరిస్థితిలో వున్న మిల్లులకే సరఫరా చేయడానికి సరిపడునంత ప్రత్తి పండనప్పుడు, తత్క్షణ భావిలోగాని, మున్ముందుగాని ప్రత్తి ఉత్పత్తి హెచ్చేఅవకాశాలు కనిపించనప్పుడు, మరికొన్ని బట్టలమిల్లులను స్థాపించాలన్న వాదన సముచితంగా లేదు."

## స్టేట కౌన్సిలు దృక్పథము

ఒక యావద్భారత ప్రణాళికను నిర్ణయించి దాని ప్రకారం ఆధునిక పద్ధతులపై వస్త్రపరిశ్రమను అభివృద్ధి చేయవలయునని స్టేటుకౌన్సిలులో సర్. యన్. గోపాల

స్వామి అయ్యంగారు తెచ్చిన తీర్మానం అంగీకరింపబడినది. పై తీర్మానం పూర్తిపాఠం ఇలాఉన్నది.

"స్టేటుకౌన్సిలు గవర్నర్ జనరల్. ఇన్. కౌన్సిలుకు ఇలా సలహా నిస్తున్నవి.

(ఎ) దేశంలో చేనేత పరిశ్రమను రక్షించి, యితోధికంగా అభివృద్ధి అయ్యేటట్లు చెయ్యాలంటే, ఇప్పుడు దేశంలో ఉన్న నూలుమిల్లులు, నేతమిల్లులు చక్కగా పని చేస్తూ ఉండేటట్లు చూడాలి, అవి వృద్ధిఅయ్యేటట్లుచేయాలి. రాష్ట్రాలలోను సంస్థానాలలోను యుక్తమైన ప్రదేశాలు నిర్ణయించి, క్రొత్తమిల్లులను స్థాపించి, దేశోపయుక్త జాతీయ ప్రణాళికతో అవి పనిచేసేటట్లు చూడాలి. ఆవిధంగాచేస్తే, దేశంలో నూలు, గుడ్డ కరువు లేకుండా పోతుంది. అప్పుడు నూలుసరకుల రవాణా, వర్తక వ్యాపారాలు జరుపవచ్చు. అంతేగాకుండా, పట్నాలలోను పల్లెలలోను ఉండే జనసామాన్యం జీవనప్రమాణం వృద్ధిఅయ్యేటట్లు తోడ్పడవచ్చు.

(బి) భారతదేశ మిల్లు పరిశ్రమ అంతరింపజేయడానికి అప్పుడే ఒకరాష్ట్రం పూనుకున్నది. ఇతరరాష్ట్ర మంత్రివర్గాలుకూడా ఆపద్ధతినే అనుసరించేటట్లు కనబడుతున్నది. అందుచేత అట్టిమార్గాల నెదుర్కొని ఆపవలసి ఉంటుంది.

(సి) ఈ కారణాలచేత, ఏమాత్రం ఆలస్యం చేయకుండా భారతప్రభుత్వం ఒకశాసనంచేస్తూ ప్రజల యోగక్షేమానికై నూలు మిల్లు పరిశ్రమాభివృద్ధి భారత ప్రభుత్వాధీనంలోనిదని ప్రకటిస్తూ, ఈపరిశ్రమ భారతదేశమంత

టను ఒక జాతీయ ప్రణాళికతో అభివృద్ధి అయ్యేటట్లు నిర్ణయించవలెను.''

పై తీర్మానాన్ని సభవారి అంగీకారానికి పెట్టుతూ, సర్. గోపాలస్వామి అయ్యంగారు ఇలా చెప్పారు. ''ఈమధ్య మద్రాసు ప్రభుత్వం ప్రకటించిన కార్యవిధానంతో, నూలు మిల్లు పరిశ్రమాభివృద్ధి కాగపోగా, ఇక అవి అసలే అంతరించే ప్రమాదం ఏర్పడ్డది. ఈవిధానం సర్వత్ర ఆదరణలోకి వస్తే ఈపరిశ్రమ నామరూపాలు లేకుండా పోతుంది.

''నాకు ఖాదీఅంటె అయిష్టంకాదు. రాజకీయంగా దాని ప్రాముఖ్యం నాకు తెలుసు, కాని ఖాదీవిధానంతో దేశానికి కావలసినంత గుడ్డమాత్రం తయారు కాదు''

మద్రాసు ప్రభుత్వ విధానంలో, రాష్ట్రంలో ఉన్న మిల్లులనేమీ మూసివేయుట లేదు; పైగా కేంద్రప్రభుత్వం యుద్ధానంతర ప్రణాళికలో మద్రాసు రాష్ట్రానికి కేటాయించిన 5 లక్షల మరకదుళ్లను, మద్రాసు ప్రభుత్వము రద్దు చేయగోరినా, ఆప్రణాళిక ననుసరించి విదేశాలలో యంత్రాలను కొంతవరకు కొన్నారు, కొంటున్నారు కాబట్టి, కేంద్ర ప్రభుత్వం అంగీకరించకపోవచ్చును. కనుక లోగడ ఉన్న మిల్లుపరిశ్రమకు, ప్రస్తుతంజరుగుచున్న అభివృద్ధికి ఏమాత్రం, ఈప్రభుత్వ ఖాదీప్రణాళిక అడ్డువచ్చుటలేదని రూఢియగుచున్నది. మిల్లుపరిశ్రమ అసలే అంతరించే ప్రమాదం ఏర్పడ్డదని సర్ గోపాలాస్వామయ్యంగారి వాదన. ఖాదీపరిశ్రమ సర్వత్రా వ్యాప్తికివచ్చి ప్రజాకోటికి కావలసిన వస్త్రాలను ఉత్పత్తి చేయగలిగిననాడు ఈ యంత్రపరిశ్రమ నామరూ

పాలు లేకుండా పోయినా దేశానికి, ప్రజానీకమునకు నష్టము లేదు. ఏకొందరు పూంజీదారులో తమలాభాలు తగ్గిపోత వను భయంతో వారి వారి స్వప్రయోజనాలను రక్షించు కోటానికై యిట్టి ప్రతికూలవాదనను లేవదీస్తుంటారను విషయము గొప్ప గొప్ప పెట్టుబడిదారుల సంస్థల అభిప్రా యములే వెల్లడి చేయుచున్నవి.

భారతప్రభుత్వ పరిశ్రమలశాఖా కార్యదర్శి ప్రభుత్వ విధానాన్ని యిలా వివరించాడు "మద్రాసు ప్రభు త్వం ఏమిచేయ సంకల్పించిందో పత్రికలలో ప్రకటించి నదితప్ప భారతప్రభుత్వానికి ఏమీ తెలియదు. టెక్స్ టైల్ విధానం భారతదేశ మంతటికి ఒకటే..... ఇది వరలో అంగీకరించిన విధానానికి స్వస్తిచెప్పి, మరొక విధానాన్ని అనుసరించవలెనని ఏరాష్ట్రమూ, ఏసంస్థానమూ భారతప్రభుత్వానికి తెలియజేయలేదు"

టెక్స్టయిల్ విధానం భారతదేశమంతటికీ ఒకటే యైనా, భారతప్రజానీక క్షేమాన్ని, ఆర్థికపుష్టిని ఆశించే నేటి భారతజాతీయ ప్రభుత్వం, లోగడఉన్న మిల్లు పరిశ్ర మను రద్దుచేయలేకపోయినా, ఏ సిద్ధాంతానికై కాంగ్రెసు గత షష్టిక సంవత్సరాలుగా అఖండమైన కృషి, త్యాగము చేసిందో, ఆ అపూర్వ సిద్ధాంతాన్ని రాష్ట్రీయ కాంగ్రెస్ ప్రభుత్వాలు తమ శక్తికొలది కార్యరూపంలో పెట్టుతూ వుంటే, అడ్డువస్తుందా! ఎన్నటికి రాదు. మిల్లు పరిశ్రమ తక్కువగానుండి, స్వయంపోషకమునకు తగినన్ని, చేనేత

మగ్గాలున్నా మద్రాసు రాష్ట్రంలోనే ఖాదీ ప్రణాళికా విజయానికి మిక్కిలి అవకాశం ఉన్నది.

కనుక ప్రస్తుతం మద్రాసుకు భారతప్రభుత్వం కేటాయించిన 5 లక్షల మరకదుళ్ళను, భారతప్రభుత్వం రద్దు చేయకపోయినా, ప్రధాని ప్రకాశం నిరుత్సాహపడ నవసరం లేదు. పై 5 లక్షల మరకదుళ్ళల్లో, పాతవాటిమార్పుకు 2½ లక్షలు పోతే, మిగత 1½ లక్షలు పెంపు చేయడానికి కనీసం 5 సంవత్సరాలు పట్టును. ఈలోగా ఈ సంవత్సరమే 50 ఫిర్కాలలో ఖాదీప్రణాళికను అమలుజరిపినచో, దాని సంపూర్ణ విజయానికిగల అవకాశాలను దేశమేగమనించి, తమ పొరపాటు అభిప్రాయాలను మార్చుకొంటుంది. 50 ఫిర్కాలలో ఆర్థిక పుష్టినంది కళకళలాడుచున్న గ్రామాలు యావద్భారత దేశానికి మార్గదర్శకములగును.

## పత్రికల విమర్శలు

మద్రాసు ప్రభుత్వ ఖాదీప్రణాళికనుగూర్చి మద్రాసులోని పత్రికలధోరణి ఎలా ఉన్నదో కొంత పరికించుట యిచ్చట అప్రస్తుతముకాదు. మద్రాసులోని "మెయిలు" 'ఫ్రీ ప్రెసు' వంటి పత్రికలు మద్రాసు విధానాన్ని చాల తీవ్రంగా విమర్శించినవి. ఈ విధానంవల్ల మద్రాసు రాష్ట్రంలో మిల్లుపరిశ్రమ అంతర్ధానముకానున్నదని, ఈ ఈ రాష్ట్రంయొక్క ఎగుమతి వ్యాపారం క్షీణించి రాష్ట్ర ఆర్థికానికే దెబ్బతగులుతుందని, యిది రాష్ట్రంలో చేనేత పరిశ్రమకుకూడ గొడ్డలి పెట్టనని, ఖాదీ ఎక్కువ కాలము మన్నదని, కోట్లకు, సూట్లకు పనికిరాదని, ఎక్కువ మూరగల

సన్నని వస్త్రాలనుగట్టి స్త్రీలు వీనిని ఏవగిస్తారని, మొక్క లైన సాకులనన్నింటిని పత్రికలు వెల్లడించినవి. ఇవన్నీ కూడా అప్రాముఖ్యమైన సాకులు.

పై ప్రశ్నల కన్నింటికి లోగడ సమాధానాలు యివ్వ బడినవి. మిల్లుపరిశ్రమ అంతమైనా దేశానికి ఎట్టినష్ట మున్నూ కలుగదు. పట్టణాలల్లో ఏర్పడ్డ కూలీల మురికి గుడి సెల (Slums) సమస్యలన్నీ అంతరించి, గ్రామ సౌమ్యజీవ నము వ్యాప్తినందును. గ్రామసీమలు ఆర్థికపుష్టినందును. మిల్లుకంటె ఖాదీయే ఎక్కువకాలము మన్నును. అను విషయం లోగడనే తెల్పియున్నాము. ఖాదీకోట్లకు, సూట్లకు పనికిరాకపోతే, సూట్లుకోట్లు వేయుటయే మానివేయ వచ్చును. అవి భారతసభ్యతకే అనవసరము. మన వాతా వరణమునకు అసౌఖ్యకరము. పైగా పాశ్చాత్యదుస్తుల పైఖరి వ్యామోహమువలన తక్కువజీతాలుగల ఉద్యోగ బృందము ఎట్లా యిబ్బంది పడుచున్నదియు అనుభవమైన విషయం. అంతేకాక స్త్రీలు ముతక ఖద్దరును కట్టుటకు ఏవ గిస్తారనుట అజ్ఞానమును వెల్లడిచేయుచున్నది. గ్రామాలల్లో నూటికి 80 మంది జనాభా పనిపాటలు చేసుకుండే వారుగనుక, ముతక బట్టలనే కోరుతారు. గ్రామా లల్లోని స్త్రీలుకూడా, ప్రత్యేక సందర్భములలో తప్ప, సామాన్యంగా ముతకబట్టనే కట్టుకుంటారు. ప్రత్యేక సమ యములలో వాడుటకు దాపుడుబట్ట లుండును. ఇక సన్న బట్టలు కట్టె కొంతమంది నాగరక స్త్రీలు, ముతకబట్టను కట్టుట కిష్టపడకపోవచ్చును. అట్టివారికి సన్నని ఖద్దరు

బట్టలు లేవా ? అందుకొరకు కొంచెము ధర ఎక్కువ అగును. అతి సున్నితమైన స్త్రీలకొరకు సన్నని డక్కా మజ్లిన్లు, పీతాంబరాలు పూర్వం తయారు కాలేదా! అట్లాగే నేటి నాగరక స్త్రీలు తమ విశ్రాంతి కాలాన్ని సద్వినియోగం చేసి సన్నని నూలువడికి, నాజూకైన బట్టలు తయారు చేయించుకొనవచ్చును.

హిందూ, ఆంధ్రప్రభ వంటి పత్రికలు కాంగ్రెసు వాదనాన్ని గురించి, ఖాదీఉత్పత్తికై ప్రభుత్వ ప్రణాళికను ఆమోదిస్తూ, మిల్లులలోని మరకదుళ్ళను రద్దుపరచే విధా నాన్ని తీవ్రంగా ప్రతిఘటించినవి. ఈ విమర్శనల కన్నింటికి అక్టోబరు మధ్యలో ప్రకాశం ప్రధాని సమాధానమిచ్చాడు. "ఈ విమర్శ అంతా కూడా ఖాదీ విధానంపైన సంపూర్ణ విశ్వాసంలేని వారినుండిన్నీ, ఖాదీతత్వాన్ని రాజకీయ ఎత్తుగా మాత్రమే అంగీకరించినవారినుండిన్నీ బయలుదేరింది! ఈ వ్యతిరేక విమర్శకవర్గంలో వ్యాపించియున్న సర్వసాధారణమైన అభిప్రాయం ఇది. మిల్లు పరిశ్రమయున్నూ, ఖాదీ పరిశ్రమయున్నూ ఇరుగుపొరుగు వారివలె అభివృద్ధి నందగలవనియు, పైగా అవి పరస్పరసహాయములనియువారి విశ్వాసము. కాని నిజమాలోచించిన పై రెండును ప్రత్యర్థులవంటివే!

### చేనేత పారిశ్రామికుల స్థితి.

ప్రస్తుతం చేనేత పారిశ్రామికులకు నెలకు 10 నుండి 12 రోజులకు మించి పనిలేదు. మిల్లుల అభివృద్ధిని,

ముఖ్యంగా నూలుమిల్లుల వృద్ధిని అరికట్టినట్లయితే చేనేత పనివాండ్ర పరిస్థితి మఱికొంచెము హీనమగునని కొందరు చెప్పుచున్నారు. ఈ చేనేత పరిశ్రమలోని లోతుపాతులు తెలియనివారికి, ఈ సమస్య బాహ్యదృష్టికి ఈ క్రిందివిధంగా కన్పడుతుంది. 'మన రాష్ట్రంలోని నూలుమిల్లుల్లో, 20 లక్షల మరకదుళ్లు, నూలును ఉత్పత్తిచేస్తుంటేనే, రాష్ట్రములో ఉన్న 5 లక్షల మగ్గాలకు 10 నుండి 12 రోజులకు తగిన నూలే లభించుచున్నప్పుడు, క్రొత్తగా మన రాష్ట్రానికి కేటాయించిన 5 లక్షల మరకదుళ్లు పనిచేస్తే, నూలుసప్లయి కొంత విరివిగా జరుగుననియు, 5 లక్షల కదుళ్లను రద్దు చేయుటవలన నూలు ఉత్పత్తి తగ్గును గనుక, పనివారికి నూలు సప్లయి యింకా తగ్గుననియు వారివాదన.

ఇది ఎంతమాత్రము సత్యముకాదు. నిజపరిస్థితుల స్వరూపం వేరే ఉన్నది. మరొక దృక్పథమున నిజస్వరూప మిట్లు ప్రత్యక్షమగును. ఖాదీప్రణాళికవ్యాప్తి మన మిల్లుల లోని ఉత్పత్తి, వారిలాభములు తప్పక తగ్గిపోవునను దృఢ నమ్మకము కలిగినందుననే, మిల్లు యజమానులీ వ్యతిరేక ప్రచారమును సాగించిరి.

మన రాష్ట్రములోని ప్రస్తుత బట్టల కొరతనుగాని, చేనేతపనివారికి నెలకు సరిపోయిననూలుసప్లయినిగాని చేసే విషయంలో, మిల్లులు తమ స్థానమును ఉనికిని ఎంతవరకు సార్థకము చేసుకొన్నవి. పై సమస్యల నివారణ కెంతవరకు తోడ్పడినవన్న విషయము పరిశీలింపతగినది.

మిల్లు యజమానులు యుద్ధలాభాలవలన తమ జేబులు నింపుకొనిరి. మేనేజింగు డైరక్టర్లకు ఎక్కువ జీతాలు, కమిషన్లు యిచ్చిరి. షేరుదార్లకు 15% మొదలు 60% వరకు డివిడెంటుల పంచియిచ్చిరి. చివరకు పనివాండ్లకు కొన్ని నెలల బోనసు నిచ్చిరి. అంతేగాని, మన రాష్ట్రింలోని ప్రజలకు బట్టల సప్లయిలోగాని, చేమగ్గాలకు నూలు సప్లయిలోగాని వారుచేసింది ఏమీలేదు.

లోకడ మహాత్ముడు దేశంలోని బట్టల కొరతను గూర్చి చెప్పిన విషయం అతిశయోక్తికాదు:—Cloth famine, I know is a mockery for only if the government and the mill owners will act honestly and intelligently, no one need go naked for want of cloth, we have cotton enough, idle hands enough and skill enough, to make cloth in our villages.

"ప్రభుత్వము, మిల్లు యజమాన్లు, తెలివిగాను క్రమంగాను పనిచేసినట్లయితే, గుడ్డలేదని ఎవ్వరు నగ్నంగా తిరగనక్కర లేదు. ఈ గుడ్డకరువు వట్టిబూటకము. మన గ్రామాలల్లో బట్ట తయారుచేయుటకు, తగినంతదూది, తగినంతమంది మనుష్యులు, తగిన కౌశలము ఉన్నది!

లోకడ భారత ప్రభుత్వముగాని, మిల్లుదారులుగాని చేనేత పారిశ్రామికునకు తగినంతనూలు సప్లయిచేసే విషయంలో అవకాశాలుండిన్ని ఏవిధమైన సహాయానికి పూనుకొనలేదని ఈ క్రిందిలెక్కలవలన రుజువు కాగలదు.

భారతదేశంలోని మిల్లుల్లో సాలుకు 162 కోట్ల 20 లక్షలపౌన్ల నూలు ఉత్పత్తి అగుచున్నది. దీనిలో 116 కోట్ల

20 లక్షలపౌన్లనూలు మిల్లుల్లోనే నేతకు వినియోగింపబడుచున్నది. పోగా 46 కోట్లపౌన్లు మిగులుచున్నవి. ఇందులో 10 కోట్లపౌన్లు. పవర్ మగ్గాలకు, అల్లికపనులు, చేపలవలలు వగైరాలకు పోతున్నది. కాగా మిగిలిన 36 కోట్లపౌన్లనూలే చేనేత పారిశ్రామికుల మగ్గాలకు చేరుచున్నవి. ఇది చేనేత మగ్గాలకు 10 దినాలకైనా సరిపోవుటలేదు. మొత్తం ఉత్పత్తిలో మూడవవంతు అనగా 54 కోట్ల పౌన్లను చేమగ్గాలకు యిస్తే 18 కోట్ల పౌన్లు ఎక్కువగా సప్లయివచ్చి, కనీసం 15 దినాలకు సరిపొయ్యేనూలు దొరుకుతుందని చేనేత పారిశ్రామికసంఘాలు, తీర్మానాలుచేసి, ప్రాధేయపడినప్పుడు, ఏమాత్రమైనా తమ స్వంతకోటానుండి తగ్గించుకొని, చేమగ్గాలకు యివ్వజాలని మిల్లుయజమానులు నేడు చేమగ్గాలకు, ఖాదీప్రణాళికవలన నష్టము వాటిల్లునని చెప్పుట మొసలి కన్నీళ్లు విడుచుటగాక మరియేమిటి. చేనేత పారిశ్రామికులు అధికంగా అడిగిన 18 కోట్ల పౌన్లనూలు మిల్లు యజమానులు యుద్ధానికి పూర్వం వాడుకొంటున్న 98 కోట్ల పౌన్ల నూలు పోను, అవి అదనంగా వాడుకొంటున్న 18 కోట్ల పౌన్ల నూలునేకదా! రెండుకోట్లమంది సమస్యను సడలించడానికై, తమ అదనపు వినియోగాన్ని నాడు వదలజాలని వారు, నేడు, తమ స్వప్రయోజనాలకు దెబ్బతగులునని తోచి, చేనేత పారిశ్రామికులకే యీ ప్రణాళిక హానికరమని చెప్పుట ఎంత హాస్యాస్పదముగ నున్నదో చూడుడు. కాబట్టి, ప్రభుత్వం ఖాదీప్రణాళిక అమలులోనికి వచ్చినచో, ఆ ఫిర్కాలలో నున్న మగ్గాలకు మిల్లునూలు యివ

గనుక, ఖద్దరు ఉత్పత్తి ప్రదేశాలల్లోని మగ్గాలకు లోగడ యిస్తూఉండిన మిల్లునూలు యితర మగ్గాలకు యిప్పుడు దామాషాగా ఎక్కువ అవుతుందా లేదా? ప్రస్తుతం, ప్రణాళిక అమలులో ఉన్న ప్రదేశాలల్లోని మగ్గాలకు 30 రోజులు పనికలుగును. మహాత్ముడాశించిన గ్రామ స్వయంసంపూర్ణత, ఆర్థికపరిపుష్టి, చేనేత పారిశ్రామికులకు నిండుపని, వ్యవసాయదారులకు ఉపవృత్తి, పెచ్చుసంపాదన మొదలైన లాభములన్నియు, ఈ ప్రణాళిక విజయవంతముగా అమలు జరిగినపుడు తప్పక కలుగును.

## ఎగుమతి, దిగుమతి వ్యాపారములు

మన ఒక్కరాష్ట్రంలోనే ఖాదీ ప్రణాళిక అమలు జరుపుటవల్ల, ఇతర రాష్ట్రాలల్లోను, సంస్థానాలల్లోను, యంత్రపరిశ్రమ అభివృద్ధినంది, మిల్లుబట్టలు దొంగతనముగా దిగుమతియగునని కొందరివాదము. ఇది వట్టిభ్రమ. ఈ ప్రణాళిక అమలులోనుండే ప్రాంతాలలో దూదికొన్న ఖరీదుకే అమ్మబడును. ప్రజలు వృథాయయ్యే తీరికసమయాన్ని వినియోగించి నూలు తయారుచేస్తారు. నేత కూలితో 4 అణాలు ప్రభుత్వము భరిస్తుంది. అప్పుడు ఖద్దరు గుడ్డ ఖరీదుకూడా యించుమించు మిల్లుబట్ట కరీదుకు సరిపోవచ్చు. లేదా కొంచెము ఎక్కువయైనను ప్రజలు ఖద్దరునే వాడుదురు. కనుక ప్రస్తుతం చేనేతబట్టల ధరలు, మిల్లుబట్టల ధరలకంటె ఎక్కువగానున్నా, మనస్త్రీలు, ఎక్కువగా చేనేత చీరలనే వాడుతున్నారుగాని, మిల్లుచీరెలకు

ఎగబడుచున్నారా ? ఎందుచేత? చేనేత చీరెలలోని మన్నిక, అందము కారణము. * ఇకముందు మాత్రము అట్లా ఎందుకు జరుగదు ? ఈపద్ధతి అమలుజరిగిన తర్వాత తప్పకుండా గ్రామస్థులు, పట్టణాలల్లో చాలమంది ఖద్దరునే ఎక్కువగా వాడుతారు. పట్టణాలల్లో ఖద్దరుబట్ట కట్టలేనివారికి, మిల్లులు ప్రస్తుతము పనిచేయుచునే యుండును గనుక, మిల్లుబట్టలు తప్పక లభించును. దొంగతనముగా మిల్లుబట్టలు ఎగుమతి యైనను, అది వ్యాపారులకు లాభకరము కానప్పుడు మాను కొందురు.

ఈ ప్రణాళికవలన ముఖ్యంగా మనరాష్ట్ర ఎగుమతి వ్యాపారంకూడ నశించునని ఒకవాదన. "ప్రపంచంలో

---

* ఖద్దరుగుడ్డ మన్నికలో మిల్లుగుడ్డకంటె ఎక్కువ కాలముండును, ఈవిషయమును అనేకమంది అనుభవజ్ఞులు ప్రత్యేక నిపుణులు, వాడుకచేయుచున్నవారు వక్కాణించు చున్నారు. 1852–64 సం. ఫ్రాన్సులో జరిగిన అంతర్జాతీయ ప్రదర్శనలో ఖద్దరు వస్త్రములు, మిల్లువస్త్రములకంటె ఎక్కువకాలము మన్నుతాయని నిపుణులవల్ల నిర్ణయించబడి యున్నది. 1860–65 సం॥లలో భారతదేశంలోని వస్త్ర పరి శ్రమనుగూర్చి పరిశోధనచేసిన జె. యఫ్. వాట్సన్‌కూడ మిల్లువస్త్రములకంటె, ఖద్దరు వస్త్రములు యెక్కువ మన్ను నని తన 'Cotton costumes and manufactures of India' లో ఉల్లేఖించియున్నాడు. కనుక గుడ్డయొక్క మన్నికను ఆలోచించినప్పుడు, దాని ఖరీదు కొంచెము హెచ్చుగా ఉన్నను అది పరిగణించగూడదు.

దేశాలన్నీ విదేశవ్యాపారాలవల్ల అభివృద్ధి పొందుతున్నవనీ మదరాసు ప్రభుత్వ ఖాదీప్రణాళికవల్ల ఎగుమతి వ్యాపారానికి తావేలేదని అందుచేత ఈ అవకాశాన్ని తీసుకొని ఇతర రాష్ట్రాలు తమ ఎగుమతి వ్యాపారం అధికంగా సాగించి లాభాన్ని పొందుతాయని అందువల్ల మన రాష్ట్ర ఆర్థికస్థితికే భంగముకలుగునని'' కొందరు చెప్పుచున్నారు. ఈ మధ్య మద్రాసు ప్రభుత్వము నిషేధించిన లుంగీల ఎగుమతి వ్యాపారాన్ని ఉదాహరణగా తీసుకొని కొందరు మద్రాసు ప్రభుత్వానికి చేనేతపరిశ్రమ విషయమైగల అజ్ఞానమే పై నిషేధానికి కారణమని ప్రచారముచేస్తున్నారు. మిల్లుగుడ్డల కోటా 12 గజాలే వస్తూ ఉండగా చేనేతగుడ్డ కొంతవరకు బట్టలకొరతను తొలగిస్తున్నది. అందులోనుండి లుంగీలు విదేశాలకు పంపడము, ''తనకుమాలిన ధర్మం కాదా?'' 'తనకుమాలిన ధర్మము' చేయుటలోని ఈ సిద్ధాంతాన్ని ఎంద రంగీకరిస్తారు? ఇది నిశ్చయంగా లుంగీ వ్యాపారులు, తమకు తగిలిన స్వంతవ్యాపార నష్టాలవల్ల చేసే విమర్శయేగాని, రాష్ట్ర అభ్యుదయ దృష్టితో చేసే విమర్శకాదు.

తన యిరుగుపొరుగు సోదరుడు వస్త్రములేక బాధలుపడుతూఉంటే, వస్త్రవ్యాపారి తనవద్దనున్న సరుకు వారికి విక్రయించకుండా, ఎక్కువధర లభిస్తుందనే ఆశతోనే గదా ఎగుమతివ్యాపారం సాగిస్తున్నాడు? అట్లుగాక యితర రాష్ట్రాలలోని ప్రజలు వస్త్రములు లేక బాధపడుతున్నారు. కాబట్టి వారి యందుగల జాలిచేతనే నేను ఎగుమతి వస్త్ర

వ్యాపారం సాగిస్తున్నాననియే వ్యాపారస్తుడు హృదయ పూర్వకంగా వక్కాణించగలడు.

నేటి యుద్ధానంతర పరిస్థితులల్లో, వ్యాపార రీత్యానైనా ఒకదేశం వేరొకదేశాన్ని పీడించుట హర్షింప తగినదికాదు. ఎగుమతి వ్యాపారాలలో, ఇతర దేశపు మార్కెట్లను మనఅధీనంలో ఉంచుకొని, మనము తద్వారా ఆర్థికలాభాన్ని పొందవలెననే ఉద్దేశం, ఇప్పటివరకు పీడిత దేశంగాఉన్న మనకెందుకు. యుద్ధములో దెబ్బతిన్న, జపాను, చైనా దేశాలల్లోని మార్కెట్లను వశంచేసుకో టానికి యిది మంచి అదునుకావచ్చునుగాక, మనము బాధ పడుతూ ఇతరమార్కెట్లను మనస్వాధీనం చేసుకోవాలనే అత్యాశ అర్థరహితమైనది.

రాష్ట్ర ప్రజావసరముల తీర్చకుండ ఎగుమతి వ్యాపారులు తమ స్వార్థముకొరకు వస్త్రములను ఎగు మతులు చేయుట అధర్మమని గ్రహించినచో, ప్రభుత్వము వారు వస్త్రముల ఎగుమతివ్యాపారము నరికట్టుటలో చాల యుక్తమైనపంథా త్రొక్కిరని ఒప్పుకొని తీరవలయును. మన దేశప్రజల వస్త్రావసరముల దీర్చినపిమ్మట మిగిలిన వస్త్రము లుంటే వాటిని ఎగుమతిచేయుటను ఏ ప్రభుత్వమును అరి కట్టను.

ఇటీవలనే మద్రాసులో జరిగిన టెక్స్టయిలు రక్షణ సభ కధ్యక్షత వహించిన, యస్. ముత్తయ్య మొదలియార్ గారు సభను ప్రారంభించిన జనాబ్ అబ్దుల్ మజీద్ గారు ప్రకాశం ప్రణాళిక మనరాష్ట్ర ఎగుమతి, దిగుమతి

వ్యాపారాలకు నష్టమని చెప్పిన అంశాలు, జాతీయ దృక్పథంతో పరిశీలిస్తే ఎంతమాత్రం నిలువనేరవు.

పైగా రాష్ట్రాన్ని స్వయంపోషకము చెయ్యగల 5 లక్షల చేమగ్గాలను, చేనేత పారిశ్రామికుల సమస్యను తాము సానుభూతితో పరిశీలిస్తున్నట్లు, వారి శ్రేయస్సుకొరకే కృషి చేస్తున్నట్లు మాట్లాడిరి.

"ముతక ఖద్దరునూలు నేసేవానికి గజానికి 10 అణాలు కూలి గిట్టుతుంది. సన్న మిల్లునూలు నేసేవారికి గజానికి 13 అణాలు గిట్టుతుందంటే, ఇది నేత పనివారికి లాభకరం గాదా!" అని శ్రీ ముత్తయ్య మొదల్యారుగారంటున్నారు.

ఈ ప్రశ్న తేనెవూసినకత్తి! గజానికి 13 అణాల వంతున కూలి, 10 దినాలు సంపాదించడం లాభమో, గజానికి 10 అణాలవంతుననైనా 30 దినాలకు కూలి సంపాదించడం లాభమో, తెలియజాలనంత అజ్ఞానములో చేనేత పారిశ్రామికులు లేరని భావిస్తున్నాము.

ముత్తయ్య మొదల్యారుగారు సదరు భావము కేవలము చేనేత పారిశ్రామికులయెడ సానుభూతితో మాట్లాడినదేనని చెప్పినచో వారియొక్క సూచన పారిశ్రామికంగా వారి అజ్ఞానాన్ని సూచిస్తుంది. సన్ననూలుతో ఒక గజం వస్త్రం నేయటానికవసరమైన కాలంలో ముదుగునూలుతో ఒక గజంకన్నా హెచ్చే నేయవచ్చు. అట్లాంటప్పుడు శ్రమపడిన కాలముతో పోల్చిచూస్తే మజూరీలో హెచ్చు అనేది ఉండదు. అబ్దుల్ మజీద్‌గారు "ఈ టెక్స్టైల్ విధానం

వల్ల చేనేత పనివారికి, మిల్లులకు, మిల్లు కార్మికులకు, యజమానులకు హానికలుగుతుంది. వారంతట వారే ఏకగ్రీవంగా అసమ్మతి తెల్పుతున్నారు'' అని అన్నాను. ఇందు చేనేత పని వారి విషయమై వారు చెప్పింది కేవలం అసత్యం. చేనేత పనివారు శ్రీప్రకాశం ప్రణాళికకు సుముఖులేగాని వ్యతిరేకులు గానేకారు. వారు అసమ్మతిని తెలుపనేలేదు. పైగా అనేక మంది సమ్మతిని వెలిబుచ్చియున్నారు. ప్రకాశం ప్రణాళిక మిల్లు యజమానులకు మాత్రము హాని కావచ్చును. మిల్లు కార్మికులకుకూడా అంతగా హానికాదు. తాత్కాలికంగా మిల్లు పనివాళ్లకు పనిపోయినప్పటికి వారు గ్రామాలు చేరుకొని ఏకుటీర పరిశ్రమనో అంటి పెట్టుకొని సౌఖ్యంగా బ్రతుకుతారు. ఏమి ఫర్వాలేదు.

చివరకు శ్రీ ప్రకాశంగారినికూడా ఒక్క ఊపు ఊపి చూస్తున్నాను.

''దక్షిణ హిందూదేశంలోని గృహపరిశ్రమ లన్నింటిలో చేనేత పరిశ్రమ మహోత్కృష్టమైనది. ఖద్దరును జాతీయ ఆర్థికసూత్రంగా చేయడం పిచ్చి. ఖద్దరు ఇంత వరకు ఒక రాజకీయపక్ష చిహ్నంగా మాత్రమే ఉన్నది. అది అలాగే ఉండవలసిందే. శ్రీ ప్రకాశంగారు జనబాహుళ్యం తన చేతిలో పెట్టిన అధికారాన్ని దుర్వినియోగం జేస్తే, ప్రజాబాహుళ్యం శ్రీ ప్రకాశంగారిని పదచ్యుతుని చేయ గలదనడంలో ఆశ్చర్యంలేదు'' అన్నారు.

మనరాష్ట్రంలో ఉన్న 80% కార్మిక కర్షక ప్రజాబాహుళ్యం శ్రీ ప్రకాశం ప్రణాళికను ఆమోదిస్తుంటే శ్రీ

ప్రకాశంగారిని ప్రజాబాహుళ్యం పదచ్యుతిని చేస్తుందన డంలో వీరు వాస్తవిక పరిస్థితులను ఎంత సత్యదృష్టితో పరిశీలిస్తున్నారో తెలియుచున్నది.

నిర్మాణ కార్యక్రమవ్యాప్తి: భారతస్త్రీల సహకారము

భారతదేశము మిల్లునూలుపైనను, మిల్లుబట్టపైనను ఆధారపడకుండునట్లు నిర్మాణ కార్యక్రమవ్యాప్తి తప్పక జరుగవలయును. గత రెండు శతాబ్దములనుండియు భారత స్వాతంత్ర్య సమరోత్సాహసమయమున భారతనారీమణులు నడుములు బిగించి పురుషులతో బాసటయై నిలచిరి. అట్లే ఈ క్లిష్టసమయమున కూడ నూత్న భారతోదయమునకై తప్పక ముందంజవేయగలరు. ప్రోత్సాహ ప్రబోధములే తెలుగు. భారతస్త్రీ లెల్లరును దినమున కొకటి రెండు గంటలు రాట్నములు త్రిప్పినచో మనకు తగినంత నూలు ఉత్పత్తికాగలదు. నూలు ఉత్పత్తికి తగినన్ని చేమగ్గా లున్నవి. కాన నూలుఉత్పత్తి జరిగినచో దానిని వస్త్రముగా మార్చుట కెట్టి ఆలస్యమును జరుగదు. భారత దేశీయవస్త్ర కారుడును, వస్త్రకళయు ఇంకను నశించలేదు. అట్టి దేశీయ వస్త్రపారిశ్రామికుని పూర్తిగా ఉపయోగించుకొనుటకును, తద్వారా భారత వస్త్ర సమస్యను నివారించుటకును వచ్చిన మహత్తరసమయ మిది. ఈ విషయమున నాయకుల ప్రచార ప్రబోధములు కేంద్రీకరింపబడవలయును. భారత స్త్రీలీవిషయమున తమ సంపూర్ణ సహకారము నొసగ కృతనిశ్చయులైనచో భారతభూమి స్వర్గతుల్యమగును. ప్రతి గృహము రాట్నభృంగముల మధురధ్యానములతో ప్రతి

ధ్వనించును. ప్రతికుటుంబము నయనానందకరమును, మనో మోహనకరమునైన వస్త్రములను ధరించును. దేశమున కెట్టివిపత్తు సంభవించినను, భారతీయులకు మానసంరక్షణ విషయమున నెట్టి లోటు నుండదు. పేదసంసారములు ఆర్థిక పుష్టినందును. గ్రామసీమలు కళకళలాడును. ఇట్లు స్వయం సమృద్ధములైన భారత గ్రామసీమలను మనము త్వరలో చూడగలము.

## రాట్నం స్వరూపము : అభివృద్ధి

ఈ ప్రణాళికకు వ్యతిరేకులు, రాట్నాన్ని ఒక మోటు పరికరంగానే భావిస్తున్నారు. ఖద్దరునూలును తయారుచేసే రాట్నంనిర్మాణంలోనేమి, బట్టను తయారుచేసే చేమగ్గము, దానికి సంబంధించిన యితర పరికరాల విషయంలో నేమి ఎంత మార్పుజరిగినదో లోగడ ప్రకరణములలో వివరించ బడెను. చేమగ్గమున్నూ, నూలురాట్నమున్నూ అభివృద్ధి యగుటకు చాల అవకాశములున్నవి! మద్రాసు ప్రభుత్వమువారి విద్యుత్ ప్రణాళికవలన, గ్రామాలకు విద్యుత్తు చౌకగ లభ్యమైనచో, రాట్నమునకున్నూ, మగ్గమునకున్నూ విద్యు చ్ఛక్తిని ఏల జోడించరాదు ? అందుకుగల అభ్యంతర మేమిటి? పరిశోధనశాఖను ఏర్పాటుచేసినచో రాట్నమునం దట్టిమార్పు జరుగుట ఒకయబ్బురమా !

## ప్రణాళికలోని గొప్పతనము

ధనవంతులైన మిల్లుయజమానుల చేతుల్లో నున్న పరిశ్రమ ప్రజాబాహుళ్యమును చేరును. పూర్వం కొద్ది

మందికి మాత్రమే పూర్తిపనినిచ్చిన వృత్తి, ఇప్పుడు విశ్రాంతికాలమున పనిజేయుట కందర కవకాశమిచ్చును. గ్రామాలలోని ప్రజలు, ధనము, పట్టణములకు ప్రవహించుట నిలచిపోవును. గ్రామములు ఆర్థికపరిపుష్టితో కళకళలాడును. గ్రామముల క్షీణతవలన అభివృద్ధికివచ్చిన ధనికులైన పట్టణవాసుల కిది ఒకవేళ ఏవగింపుకావచ్చును!

## విమర్శకులకు శ్రీ ప్రకాశంగారి సమాధానము

మద్రాసు ప్రభుత్వంవారి టెక్స్‌టయిల్ విధానంపై చెలరేగిన వివిధవిమర్శలకు మద్రాసుప్రధాని శ్రీ టి. ప్రకాశంపంతులుగారు సమాధానమిస్తూ బట్టలమిల్లు పరిశ్రమాభివృద్ధి విషయమై స్టేట్ కౌన్సిల్ సమావేశంలో సర్ ఎన్. గోపాలస్వామి అయ్యంగార్ ప్రతిపాదించిన తీర్మానాన్ని గురించి ప్రస్తావించారు. ఏ కేంద్రప్రభుత్వం, ముఖ్యంగా ప్రస్తుత తాత్కాలిక కేంద్రప్రభుత్వం రాష్ట్రీయప్రభుత్వాలతో సంప్రతించకుండా ఈ విషయంలో ఎట్టిచర్యను తీసుకోదని, మద్రాసు ప్రభుత్వంవారి అభిప్రాయాన్ని తాత్కాలిక కేంద్రప్రభుత్వంవారు కోరినప్పుడే మద్రాసు ప్రభుత్వంవారు ఈ విషయమై ఆలోచించవలసి ఉంటుందని ప్రధాని ప్రకాశంగారు తెలిపారు.

అఖిలభారత చరఖాసంఘంవారు ఆచరణపూర్వకంగా చూపగలిగిన అభివృద్ధిదృష్ట్యా, మద్రాసుప్రభుత్వంవారి ఖాదీప్రణాళిక విజయవంతం కాగలదని ఆశించటానికి సావకాశంలేదన్న విమర్శకు సమాధానంగా ప్రకాశంగారు ఇలా అన్నారు:

"ఖద్దరులో మనకు విశ్వాసమున్నట్లయితే, ఆసన్నభావిలో లక్షలకొలది పాటకజనానికి లాభదాయకమైన వృత్తులను ఏర్పాటు చేయుటలో మన దేశానికి ఖాదీ బాగా ఉపకరించగలదని అంగీకరిస్తే, ఈ విశ్వాసాన్ని ఆచరణరూపంలో పెట్టాలి. కొత్తమిల్లుల నిర్మాణం,

ప్రస్తుతమున్న మిల్లుల అభివృద్ధి గ్రామీయులకు లాభదాయకమైన వృత్తులను ఏర్పాటుచేయలేవు. మిల్లుగుడ్డల ఉత్పత్తి అధికమైనయెడల తమ గుడ్డలకొరత తీరుననీ, వడుకునూలుపట్ల అశ్రద్ధవహించినా నష్టంలేదన్న అభిప్రాయాలు గ్రామీయులలో ప్రబలేటట్లు ప్రవర్తిస్తూ, గ్రామస్థులు ఖద్దరును గురించి హృదయపూర్వకంగా శ్రద్ధవహించకలరని ఆశించటం సమంజసంకాదు. పైగా ఈ ఖాదీవిధానంపట్ల గ్రామస్థులకు అనుమానం కలుగవచ్చును. తమను ఖద్దరుతో సంతృప్తిపడమని సలహా నిచ్చి, పురవాసులకు సన్నటిమిల్లుగుడ్డలు సప్లయిచేయ నుద్దేశించారని వారు అనుమానపడవచ్చును. ఇదివరలో యున్న ప్రభుత్వాలు, ధనికవర్గాలు ఖాదీవిషయంలో కలిగించిన అత్యధిక నిరోధనలను ఒంటరిగా ఎదుర్కొంటున్న అఖిలభారత చర్ఖాసంఘమువారికి ఈ విధమైనవిమర్శలు అన్యాయంచేస్తున్నవి. ఈ విమర్శకులు చరఖాసంఘంవారు సర్టిఫై చేయని యితరవర్గాలయం దీఉత్పత్తినిగురించి యోచించలేదు. అనేక బట్టల మిల్లులతో కూడియున్న కోయంబుత్తూరువంటి జిల్లాలోనే చర్ఖాసంఘం వారు ఖాదీని విజయవంతంగా ఉత్పత్తిచేయగలగటాన్నిబట్టి ప్రభుత్వం వారు యేర్పాటుచేయగల సానుకూలమైన పరిస్థితులలో ఖాదీవిధానం సఫలంకాగలదని ప్రభుత్వంవారు ఆశించుటకు సావకాశమున్నది.

"ఈ ప్రభుత్వఖాదీవిధానం, ప్రభుత్వంవారి స్వంతబాధ్యతపై ప్రారంభింపబడిన పెద్దఎత్తు ఖాదీకార్యక్రమమని. ఇది ప్రజాప్రతినిధుల ప్రభుత్వమని, ప్రభుత్వ పరిపాలనావర్గానికిగల శక్తిసామర్థ్యాలన్నింటి వల్లను ఈ కార్యక్రమం కొనసాగింపబడుననీ, వివిధవిమర్శకులు గుర్తించలేకపోవటం వారి వాదాలలో ఒకముఖ్యమైనలోపం. ఇట్టి ప్రభుత్వ కార్యక్రమం సాధించగల భావిఫలితాలను అఖిలభారత చర్ఖాసంఘం చూపగలిగిన కొద్దిపాటి అభివృద్ధినిబట్టి నిర్ధారణచేయలేము.

అఖిలభారత చర్ఖాసంఘానికి చెందిన ఆరితేరిన నిపుణుల సహాయము, సలహా ప్రభుత్వ ఖాదీకార్యక్రమానికి చేకూరివవన్న విషయం

కూడా విమర్శకులు యోచించాలి. కేంద్రప్రభుత్వంవారిచే యేర్పాటు చేయబడిన విషయ సేకరణ సంఘంవారి నివేదికనుబట్టి మద్రాసు ప్రభుత్వం వారి బట్టలమిల్లులవిధానం సమంజసమైనదేనని విస్పష్టమైనది. పంజాబు రాష్ట్రంలో ఉత్పత్తియగుచున్న నూలుగుడ్డలలో నూటికి 60 పాళ్ళు వడకునూలువల్లనే తయారగుచున్నదని ఈ నివేదికలో వెల్లడైనది. మన రాష్ట్రంలో పరిస్థితి మరొకవిధంగా ఉండటానికి కారణం బట్టల మిల్లులసంఖ్యను యింతకాలము అధికం కానివ్వటమే.''

## మిల్లుగుడ్డల పోటీ

ఇతరరాష్ట్రాలలో తయారయిన మిల్లుగుడ్డలతో మన రాష్ట్రాన్ని నింపివేయుటం ఇండియాగవర్నమెంటు 1935 వ సంవత్సరపు చట్టం 297 సెక్షనుప్రకారం నిరోధించలేము గనుక ఖాదీవిధానం సరిగా సాగదన్న వాదానికి ప్రకాశంగారు ఈ క్రిందివిధంగా సమాధాన మిచ్చారు:

''ప్రస్తుత పరిస్థితుల ననుసరించి గుడ్డలపంపకం దేశం మొత్తం మీద జరుగుచున్నవి. అందువల్ల ఏ ఒక్క రాష్ట్రంలోను మిల్లుగుడ్డలు అత్యధికంగా వచ్చి పడగలవనే ప్రశ్నకు తావులేదు. మిల్లుగుడ్డల కంట్రోలు తొలగింపబడిన పిమ్మటగాని యిట్టివాదం బయలుదేరటానికి వీలులేదు. ప్రభుత్వ ఖాదీవిధానంపట్ల ప్రజలలో జనించగల ఉత్సాహం అధికంకాగలదన్న దృష్టిలో ఈ వాదాన్ని పరిశీలించాలి. ప్రజలలో ఉత్సాహం అభివృద్ధిచెందుతూ, ఖాదీఉత్పత్తి యెంతఅధికమైతే ఇతర రాష్ట్రాలనుంచి గుడ్డను దిగుమతిచేయటం అంత తగ్గుతుంది. అత్యంత ప్రధానమైన ఈ గ్రామపరిశ్రమను రక్షించుటలో ప్రభుత్వంవారు అనుస రించగల చర్యలవిషయ మటుండగా, ఈ రాష్ట్రంలోని కొనుబడిసంస్థలు, తమ క్షేమంకోరకు ఇతరరాష్ట్రాలనుంచి కొనుగోలును అమ్మకానిబట్టి తగ్గించుకుంటారు. కంట్రోలువిధానం తొలగిపోయిన పిమ్మట ఏర్పడగల పరిస్థితులను రాష్ట్రప్రభుత్వంవారు ఎదుర్కొనుటకు తగిన చట్టసవరణలు సకాలంలో జరగవని ఊహించటం పొరబాటు.''

"మిల్లుగుడ్డల కంట్రోలు తొలగిపోయే లోపుగానే అట్టి యధికారాలు అవసరమైనట్లయితే వాటికొరకు తగిన ఒత్తిడిచేసి సంపాదించి తీరుతాం."

## విమర్శలకు మహాత్ముని సమాధానము

శ్రీ ప్రకాశం ప్రణాళికపై మద్రాసులో చెలరేగిన దుమారానికంతా, మహాత్ముడు ది 27-10-46 హరిజన వ్యాసంలో కొన్ని ముఖ్యాంశాలక్రింద సమాధానంఇచ్చాడు ప్రకాశం ప్రణాళికను, నిశితవిమర్శకు గురిచేసే ప్రతిఒక్కరు ఈ అంశాలను మననం చేయవలెను. అట్లాచేస్తే ప్రకాశం ప్రణాళిక గ్రామాలల్లోని ప్రజాబాహుళ్యముయొక్క శ్రేయస్సును, ఆర్థికపుష్టిని కోరిచేయుబడినదనే విషయం స్పష్టం కాగలదు. ఇట్టి ప్రణాళికను అమలుపరచడానికి కంకణం కట్టుకొన్న శ్రీ ప్రకాశం ఒక్కడుగుకాదుగదా, పది అడుగులు ముందుకువేసి భారతావనికంతా మార్గదర్శియైనాడు. ప్రకాశం ధన్యజీవియైనాడు.

మహాత్ముడు విమర్శకులకు విశదపరచిన ముఖ్యాంశాలు నాలుగు. (1) ఈ ప్రణాళిక గ్రామస్థులు వృధాపుచ్చే అమూల్యమైన కాలాన్ని తమకు సరిపొయ్యేబట్ట తయారు చేసుకొనునూలుకు సద్వినియోగం చేయుటకొరకు.

"The Madras scheme is undoubtedly meant to utilize a part of the idle hours of the villagers for spinning sufficient yarn to clothe themselves. Is it chemerical to induce and expect the people to utilize their idle hours to do useful nationa l,honest labour."

"గ్రామస్థులు తమ సొంత అవసరములకు తగినంత గుడ్డను తయారుచేసుకొనుటకు కావలసిన నూలు వడకుటకు తమకుగల తీరిక కాలమును వినియోగించవలెననియే మద్రాసు ప్రణాళికోద్దేశమనుట నిస్సంశయము. తమకు పనిలేనికాలమును, దేశానికి తమకు అక్కరకు వచ్చేరీతిని వినియోగించుడని ప్రజలను ప్రోత్సహించుట వెర్రిభ్రమయా?"

2. రెండవ విషయము:—గౌరవంగా కష్టించి వృద్ధికి రావలెనని ప్రయత్నించే గ్రామస్థులపై పూంజీదారులు ధ్వజమెత్తుట మంచిదికాదు.

"Let not capitalists and other entrenched personages range themselves against the poor villagers and prevent them from bettering their hard lot by dignified Labour."

3. మూడవ విషయము:—ఈ ప్రణాళికయొక్క విశిష్టలక్షణములు.

"This is work for democracy by a Democratic Government. Hence the scheme must be popular at least where it is to be tried.

It must not be one man's scheme but the whole Govt's.

It must have the backing of the legislature. In no case may it smack of compulsion. It must be intrisically practicable and of benefit to the masses."

The government have accepted them in toto after full discussion with experts and among themselves.

"ఇది ప్రజాప్రతినిధి ప్రభుత్వము ప్రజలకొరకు తయారుచేసినది. ఈ ప్రణాళిక అమలుజరిపిన ప్రాంతాలలోనైనను ప్రజారంజకము కావలయును. ఈ ప్రణాళిక ఒక వ్యక్తి కల్పితముగా నుండరాదు. శాసనసభలు, మంత్రి

వర్గము హర్షించినదిగా నుండవలెను. ఈ ప్రణాళికయందు నిర్బంధముండరాదు. ఇది స్వతస్సిద్ధముగా ఆచరణయోగ్యమై యుండి ప్రజాసామాన్యమునకు లాభసాటియై యుండవలెను. ఈ ప్రణాళికను నిపుణులతో సంప్రదించిన తర్వాతనే ప్రభుత్వము అంగీకరించినది.''

4. నాల్గవ విషయము:— ప్రస్తుతమున్న మిల్లుల కెట్టిభంగమును రాదు. ఈ ప్రణాళిక సర్వత్రా వ్యాపించి నప్పుడుమాత్రం మిల్లు పరిశ్రమయంతయు నష్టపడును.

"Let it be remembered that the existing Madras mills will not be touched at present. That the whole mill industry will be affected, if the scheme spreads like wild fire as I except some day such a thing must, goes with out saying. Let not the largest capitalist rue the day when and if it comes".

"The only question then worth considering is whether the Madras Government are honest and competent. If they are not, everything will go wrong. If they are, the scheme must be blessed by all and must succeed."

''ప్రస్తుతం మద్రాసు రాష్ట్రంలో ఉన్న మిల్లులకు భంగము కలుగదని గ్రహింపవలెను. ఈ ప్రణాళిక అటవీ జ్వాలవలె వ్యాపించినప్పుడు మిల్లుపరిశ్రమ యావత్తు నష్ట పడును. అట్టి సుదినమునునే నపేక్షించుచున్నానటుట చెప్ప నవసరములేదు. అట్టిదినము వచ్చినచో గొప్ప పూంజీ దారుడు చింతింపకుండుగాక. బాగా ఆలోచించవలసినవి మద్రాసు ప్రభుత్వమునకుగల శక్తి, నిష్కాపట్యత. వారి కవిలేనిచో ప్రణాళిక విఫలమగును. ఉన్నచో ప్రతి ఒక్కరు ఆ ప్రణాళికను ఆశీర్వదించవలెను. అది తప్పక విజయ వంతమగును.''

## రాష్ట్రపతి కృపాలిని అధ్యక్షోపన్యాసములో 'వస్త్ర పరిశ్రమపై' నొసంగిన అభిప్రాయము

"వికేంద్రీకరణకు వస్త్ర పరిశ్రమ చాలా అనువైనదని భావించాము. కాని యీ విషయంలో కూడా ఎక్కువ మిల్లులను నిర్మించడానికి కాంగ్రెస్ రాష్ట్రాలు పోటీ పడుతున్నారు.

ప్రస్తుతం బట్టకు కొరతగా నున్నందున దానినుత్పత్తి చెయ్యటానికి గల అన్నివిధానాలను ఉపయోగించాలని కొందరినమ్మకం. అయితే యిందుమూలంగా క్రొత్తగా ధనికవాదులు బయలుదేరగలరని గ్రహించలేకపోతున్నారు.

ఖాదీ ప్రచారకుడుగా నాకుగల అనుభవాన్నిబట్టి చర్ఖాను, మగ్గాన్ని బహుళప్రచారంలోకి తెస్తే కొత్తమిల్లుల కంటె తక్కువ వ్యయప్రయాసలతో, స్వల్పకాలంలో ఎక్కువ వస్త్రాన్ని ఉత్పత్తి చెయ్యగలమని నా విశ్వాసము.

నేను వస్త్రపరిశ్రమను ఉదాహరణకు మాత్రమే పేర్కొన్నాను, కాని ఏ పరిశ్రమలను కేంద్రీకరించాలో, వేటిని వికేంద్రీకరించాలో మనం సమాలోచించుకొనడం ఇప్పటికే ఆలస్యమైంది.

పరిశ్రమల వికేంద్రీకరణ గురించి, మాట్లాడుతున్నానంటే, కేవలం చేతితోనే పరిశ్రమలు జరగాలని నా అభిప్రాయము గాదు. ఒక కార్మికుడు తన గ్రామంలో, తన

యింటిలో ఎక్కువ ఉత్పత్తికై ఎలక్ట్రిసిటీ ఉపయోగించుకోవచ్చు.

ఈ విధంగా పరిశ్రమలు వికేంద్రీకరణమూలంగా అప్పుడప్పుడు జరిగే సమ్మెలవల్ల నేమి, పోటీలవల్ల నేమి, తదితర కారణాలచేత నేమి, జాతీయసంపద దుర్వ్యయం కాకుండా ఉండగలదని వేరే చెప్పనక్కరలేదు. కుటీర పరిశ్రమలలో పోటీ ఉండదు. కనుక దానికి సంబంధించినంత వరకు యిరుగు పొరుగు ప్రజలలో సుహృద్భావం పెంపొందగలదు.

వికేంద్రీకృత పరిశ్రమలను సహకార పద్ధతులపై నెలకొల్పవచ్చు. ఉత్పత్తిని, పంపిణీని సహకార సంఘాల ద్వారా జరపగలరు. ఉత్పత్తివిషయమై వెంటనే సహకార సంఘాలను నెలకొల్పడానికి వీలుండకపోయినా, పంపిణీకై ప్రజాసంస్థలద్వారా, రాష్ట్రప్రభుత్వాలద్వారా సహకారసంఘాలను నెలకొల్పవచ్చు. గ్రామంలోని కార్మికుడు ఒక వస్తువును విక్రయించుకోవడానికి పడే కష్టాన్ని, దానిని తయారు చేసుకోవటంలో పడడు.''

*Pablished in Andhrapraha*
*Dated* 24-11-46.

## శ్రీ ప్రకాశంగారి వస్త్రప్రణాళిక-సింహావలోకనము

ఇటీవల మనరాష్ట్రప్రధాని శ్రీ ప్రకాశంపంతులు గారు ప్రకటించిన ఖద్దరుప్రణాళికను పూర్తిగ చర్చించితిమి. మనరాష్ట్రంలో ప్రస్తుతం యేర్పడియున్న వస్త్రకాటకాన్ని

నిర్మూలించుటకు చాల చక్కని ప్రణాళిక నేర్పాటుచేశారు. గత 25 సంవత్సరములనుంచీ మహాత్మా గాంధిగారు నిరంతరదీక్షతో సాగిస్తూఉన్న ఖద్దరు ఉద్యమసారమే యీ ప్రణాళిక. మన దేశమునకు మిల్లులు లేకుండగనే గ్రామీణప్రజలు తమ తీరుబడిసమయంలో వడికిననూలును, తమ గ్రామాలలోని చేనేతపారిశ్రామికునిద్వారా వస్త్రంగా తయారుచేసికొంటే ప్రజాసామాన్యం వస్త్రములకై యెట్టి బాధపడ నవసరంలేదని, ఆవిధానం గ్రామీణుల ఆర్థికస్థితిని పెంపొందిస్తుందని గాంధీగారి సిద్ధాంతము.

ప్రకాశంగారి ప్రణాళిక ప్రస్తుతం మనరాష్ట్రంలో నున్న నూలుమిల్లులుగాని, వస్త్రముల మిల్లులుగాని యుద్ధానంతర పునర్నిర్మాణమునకై తలపెట్టిన అభివృద్ధికర మార్పులు చేయగూడదని శాసించుచున్నది. మాములుగా ప్రస్తుతం ఉన్నస్థితిలోనే ఆయామిల్లులను పనిజేయనిచ్చుట కెట్టియభ్యంతరమును లేదు. పైన మేము వివరించినప్రకారము చూడగా మనకు మిల్లులసహాయం లేకుండగనే వస్త్ర సమస్య సులభంగా పరిష్కారము చేసికొనవచ్చునని స్పష్టమగుచున్నది. అట్టిపరిస్థితిలో యీనాడు మనరాష్ట్రంలో ఉన్ననూలు, బట్టలమిల్లులనుకూడ సాగనిస్తూ గ్రామీణ ప్రజాసామాన్యముచేత ఖద్దరు ఉత్పత్తివిధానమును అమలు పరచుటవల్ల మనవస్త్రసమస్య మరింత సులభముగా పరిష్కరించవచ్చుననుట నిర్వివాదాంశము.

నూతనముగా మనరాష్ట్రములో నూలుమిల్లులను, గుడ్డలమిల్లులను స్థాపించవలయునని కొందరు ధనవంతులు

ఆలోచించి నిర్ణయించుకున్నారు. అట్టి నూతనమిల్లులను మాత్రము నిర్మించరాదని ప్రకాశంగారి ప్రణాళిక శాసించు చున్నది. అందువల్ల పెట్టుబడిదారులకు తమ స్వంతలాభము పోవుననే విచారము ఉండవచ్చును. కాని బహుకొద్దిమంది యొక్క స్వార్థముకొరకు దేశములో కోట్లకొలది ప్రజల స్వావలంబనవిధానమును, క్షేమమును, ఆర్థికస్వాతంత్ర్యమును బలి యివ్వకూడదు. అది దేశక్షేమముగూడ గాదు అని యింతవరకు చదివిన పాఠకులకు స్పష్టమగుచున్నది.

నూతనముగా స్థాపించనున్న మిల్లుల నరికట్టుటవల్ల రాష్ట్రానికి దేశానికి నూలుకాటకము, గుడ్డలకాటమువచ్చి పడుతుందని భయపడుట వట్టిభ్రమతప్ప యదార్థముగా ఆలోచిస్తే అట్టిభయమున కెట్టి ఆధారమును లేదు. "దేశంలో యిప్పుడు తయారగుచున్న నూలుమొత్తము మనప్రజలకు కావలసినంతవరకు సరిపోతూఉన్నది. మనదేశంలోని ప్రజల జీవితపరిమాణమునుబట్టి చూస్తే మనప్రజల కవసరమగు వస్త్రముల తయారుచేయుటకు యీనాడున్న మరకదుళ్ళు వడుకుతూఉన్న నూలుఉత్పత్తిని పెంచవలసిన అవసరం లేదు అని స్పష్టపడుచున్నది"* అని మనదేశంలోని మిల్లులు చేమగ్గపు పరిశ్రమలపై బ్రహ్మాండమైన పరిశోధన విచారణ

*"The total quantify of yarn produced in the country is almost equal to our present requirements. This means that of present level of the standard of life of the people, the clothing requirements will not necessitate a greater production of yarn than that indicated by the existing spindleage,"

*Report of the Fact Finding Committee p. 224.*

జేసిన ఫ్యాక్టుఫైండింగు కమిటీవారు తమ రిపోర్టు 224 వ పేజీలోనిరూపించినారు. ఈవిషయంలో ఫ్యాక్టుఫైండింగుకమిటీ వారి అభిప్రాయమే ప్రమాణముగాని వేఱొకరి అభిప్రాయము ప్రమాణముగాదు "కనుక నూలుమిల్లులు స్థాపించకపోతే మనవస్త్రసమస్య క్లిష్టమగుతుందనే వారి వాదన, అభిప్రాయం స్వార్థపరుల అభిప్రాయం అయిఉండాలి. లేదా విషయపరిజ్ఞానము లేనివారి అభిప్రాయంఅయినా ఉండాలి"

ఈప్రణాళికవల్ల చేనేత పారిశ్రామికులు నూలులేక బాధపడవస్తుందనే అభిప్రాయంకూడ అర్థరహితము.

నూలుమిల్లులు పెట్టకపోతే దూదిపంట అంతా వృధాగా చెడిపోయి రైతులు నష్టపడుతారు అనే ఆక్షేపణకు ప్రకాశంపంతులుగారి సమాధానమే చక్కటిసమాధానము.

ప్రకాశంగారి వస్త్రప్రణాళిక ప్రకారం యీ నాటి వస్త్రకాటకం మరీ క్లిష్టమగుతుం దనుకోవటంకూడా పొరపాటే, మనరాష్ట్రానికి కేటాయించబడిన 3 లక్షల 50 వేల మరకదుల్లు క్రొత్తమిల్లులకును, యిదివరకున్న మిల్లులలో కదుళ్లసంఖ్య పెంచుటకే మంజూరి చేయబడినవి 1947 ఆఖరకుగాని మనకు దిగుమతికావు. వాటిని బిగింపుజేసి పని ప్రారంభించే టప్పటికి కొన్నిటి విషయంలో 1948 చివరకుగాని సంభవంగాదు. మరికొన్నిటి విషయంలో (క్రొత్తమిల్లుల విషయంలో) 1952 లో గాని సంభవించదు. అంతవరకు మనవస్త్రసమస్యా పరిష్కారమార్గం యేమిటి ? విమర్శకులు యేమి సూచిస్తున్నారు ? ఈ సంధికాలంలో మన వస్త్ర

కాటకాన్ని యెదుర్కొనుటకు ప్రకాశంగారి స్వావలంబన ఖాదీప్రణాళికకు మించినదిలేదు. ప్రస్తుతం అమలులోనున్న వస్త్రముల మిల్లులను దినమునకు మూడుషిఫ్టులు పనిజేయించుటకు, నూలు ఉత్పత్తినికూడా మూడుషిఫ్టులతో పనిజేయించుటకు తగిన యేర్పాట్లు జేస్తామన్నారు. మనరాష్ట్రవాసులు గుడ్డలులేక అవస్థలు పడుతూఉండగా పరాయిరాష్ట్రములకు, దేశములకు పంపే ఎగుమతులను ముఖ్యంగా చేనేతవస్త్రముల ఎగుమతిని నిషేధించారు. మనరాష్ట్రమునుంచి బయటికి ఎగుమతియయ్యే నూలునుకూడా పోకుండా యేర్పాట్లు చేస్తావున్నారు. తీరికను వృధాగా వ్యర్థంచేసుకోకుండా ఉండేటట్లు గ్రామాల్లో వడుకునూలు ఉత్పత్తికి, వస్త్రోత్పత్తికి తగిన ప్రోత్సాహం యేర్పాట్లు చేస్తున్నారు. ఈ విధానమును కొంతకాలం సాగించి, దాని అనుభవాన్నిబట్టి తరువాత కార్యవిధానమును ఆలోచిద్దామని కూడా ప్రధాని స్పష్టముగా చెప్పుతున్నప్పుడు ప్రతిపక్షులు యీ విధానమును ప్రతిఘటించడంలో వారిలో యేమీ సదుద్దేశం వ్యక్తం గావటంలేదు.

గత 25 సంవత్సరములుపైగా కాంగ్రెసుసంస్థ ఖద్దరు ఉత్పత్తిని ఒక ప్రధానాంశముగా పెట్టుకొని నిరంతరకృషి జేస్తూఉంది. ఆ ఖద్దరు యూనిఫారములు ధరించి, తాము కాంగ్రెసువారమని ఎలుగెత్తి చాటుకొని, కాంగ్రెసు తరఫున యెన్నుకోబడిన శాసనసభ్యులుగాని, కాంగ్రెసు సంస్థలుగాని, ఖద్దరు ప్రణాళికను ప్రతిఘటించడంలో ఆత్మవంచన, స్వప

చన వ్యాఘాతము వ్యక్తమగుచున్నవి. ఈ విషయంలో గాంధిగారు అనేకసార్లు ఖద్దరునుగూర్చి, గ్రామ స్వయం పోషకత్వమునుగూర్చి వ్రాసిన వ్రాతలు, చేసినబోధలు, నేర్పినపాఠములు కాంగ్రెసు సేవకులు, కాంగ్రెసు నాయకులు, కాంగ్రెసు సభ్యులు అందరూ స్మరణకు తెచ్చుకొని తమ సందియములు, అనుమానములు, కుశ్శంకలు అన్నియు తొలగించుకొని, ధైర్యముతో ముందుకువచ్చి ప్రకాశంగారి ఖాదీప్రణాళికను అన్నివిధముల బలపరచగలరని ఆశించుచున్నాము.

మహాత్మగాంధిగారి తరువాత, తనవారసుడని మహాత్మునిచే పేర్కొనబడిన తాత్కాలిక కేంద్రప్రభుత్వ ప్రధాని పండిత జవహరిలాల్ నెహ్రూ మొన్ననే ప్రకటించబడిన తన "The Discovery of India" లో ఖద్దరు, గ్రామపరిశ్రమల గూర్చివ్రాసిన వ్రాతలు చదివియైనను ధైర్యము తెచ్చుకొని ప్రకాశంగారి ఖాదీవిధానమును బలపఱచగలరని నమ్ముచున్నాము. పండితజవహరిలాల్ నెహ్రూతన "The Discovery of India" పేజి 484 లో యీవాక్యాన్ని వ్రాశారు. "గాంధిగారు ఖద్దరు అభివృద్ధినిగూర్చి చేస్తూఉన్న నిరంతర ప్రచారము, ప్రబోధము కేవలం పురాతనవృత్తిని పునరుద్ధరించవలయుననే వట్టి భావోద్రేకము కాదనీ, గ్రామీణులను పేదరికమునుంచి రక్షించి, వారిజీవన ప్రమాణమును హెచ్చించుటకై చేస్తూఉన్న కార్యకలాపమనీ" ప్రొఫెసరు కోల్ వంటి సుప్రసిద్ధ ఆర్థికతత్త్వవేత్తలుకూడాఅంగీకరించిరి.

# అభిప్రాయము

మద్రాసు ప్రభుత్వ వస్త్రవిధానంపై విమర్శలు జోరుగా వున్న యీ రోజులలో నా మిత్రులు శ్రీ కార్యంపూడి నాగేంద్రుడు తాడిపత్రి శ్రీ కంఠంగారలు "భారత వస్త్ర సమస్య"ను ప్రకటించడం ముదావహము. ఇద్దరూ లోకానికి చిరపరిచితులే. వస్త్రసమస్యలను గూర్చి నిరంతరము ఆలోచిస్తూ వున్నవారే. అందువల్ల యీ పుస్తకంలో పాండిత్యమూ, అనుభవమూ మిళితమై వున్నవి. "ప్రాచీనవైభవముతో" ప్రారంభించి వర్తమాన "ఖాదీ ప్రణాళిక" వరకు వస్త్రసమస్య పూర్తిగా పరిశోధించి ఖాదీ పరిశ్రమ ప్రాశస్త్యాన్ని తెలియజేశారు. ప్రస్తుతమున్న ప్రజాభిప్రాయానికి ఎదురీది యీవిధముగా చేయుట సాహసమే. అయినప్పటికి సత్యాన్ని మరుగుపరచుట సహించరానిదికదా!

ఇందులోవున్న ప్రకరణములలోని ఒక్కొక్క విషయాని కొక్కొక్క పుస్తకము వ్రాయవచ్చు. చర్చించిన విషయములను మరి కొంత విస్తృతము చేయవచ్చు. కాని వున్న వ్యవధిలో, అవకాశములలో నా మిత్రులు సాధించినది ప్రశంసార్హమైన విషయమని మాత్రము చెప్పగలను.

దామర్ల రమాకాంతరావు,
చెన్నరాష్ట్ర చేనేత కాంగ్రెస్
అధ్యక్షుడు.

మద్రాసు
5-12-46

Printed at the B. N. K. Press, Madras—Q. H. No. 100/B
D. Dis. P. Con. A. 520/46—12—46.

చేనేత పరిశ్రమయందలి అభిమానముచేత ఈ 'భారత వస్త్ర సమస్య' ప్రచురణకై మా ప్రయత్నమునకు కొంత ద్రవ్య సహాయము నొసంగిన సంస్థకును, వ్యక్తులకును మా కృతజ్ఞత నిందుమూలమున ప్రకటించుచున్నాము.

| | | |
|---|---|---|
| 1. | శ్రీ పద్మశాలి చేనేత పారిశ్రామిక సహకారసంఘము, పుల్లంపేట. | రు 150 |
| 2. | శ్రీ కాసల. వెంకటస్వామి, అవ్వారు చినరంగయ్య గార్లు. పుల్లంపేట. | రు 25 |
| 3. | శ్రీ ఉక్కడాల, రంగయ్యసెట్టిగారు, పుల్లంపేట. | రు 25 |
| 4. | శ్రీ బుధవరపు, శేషయ్య. వెంకటసుబ్బయ్యగార్లు, పుల్లంపేట. | రు 20 |
| 5. | శ్రీ వి. ఆర్. పిచ్చయ్యగారు, పుల్లంపేట. | రు 10 |
| 6. | శ్రీ అవ్వారు. గురవయ్య & బ్రదర్సువారు, పుల్లంపేట. | రు 15 |
| 7. | శ్రీ అవ్వారు. రంగయ్య సన్సువారు, పుల్లంపేట. | రు 10 |
| 8. | శ్రీ అవ్వారు. వెంకటసుబ్బయ్య, సుబ్బరాయులుగార్లు, పుల్లంపేట. | రు 10 |
| 9. | శ్రీ సోము. వెంకటసుబ్బయ్యగారు, పుల్లంపేట. | రు 10 |
| 10. | శ్రీ మలవతు, వెంకట్రామయ్య & శింగరయ్యగార్లు, | రు 10 |
| | పుల్లంపేట. | రు 10 |
| 11. | శ్రీ సామా. వెంకటయ్య & సన్సు వారు, పుల్లంపేట. | రు 10 |
| 12. | శ్రీ మాకల చంగయ్య & సన్సు వారు, పుల్లంపేట. | రు 10 |
| 13. | శ్రీ ప్రెగడ బాలనాగు బ్రదర్సువారు, మంగళగిరి. | రు 50 |
| 14. | శ్రీ అవ్వారు, మైలారుగారు మంగళగిరి. | రు 20 |

గ్రంథకర్తలు.

## రాబోవు ప్రచురణలు:

1. యక్షగానము : చేనేత గీతములు
2. మన ఆహార సమస్య
3. ప్రాథమిక విద్య
4. బహూత్తమ
5. స్వప్న వాసవదత్త

బహూత్తమ పబ్లికేషన్సు
పుల్లంపేట :: కడపజిల్లా